

డిశంబరు 22 వ తేదీన ముఖ్యమంత్రి హైదరాబాదులో ప్రారంభోత్సవం చేసిన కొత్త గ్లయిడర్ డ్రోములో పరిశీలింపబడుతున్న ఒక గ్లయిడరు.



11-1-1964 వ తేదీన సమాచార, ఆర్థికశాఖా మంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం చేసిన విశాఖపట్నంలో రూ 9 లక్షల ఖర్చుతో నిర్మించబడ్డ తంతి, తపాలా కార్యాలయ కొత్త భవనం

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 8    మాఘం - ఫాల్గుణం - చైత్రం

సంచిక : 4-5    1885-1886 శకం

ఫిబ్రవరి, మార్చి, 1964

## విషయసూచిక



---

మొదటి అట్ట : రంగురంగుల పతంగాలు.

మూడవ అట్ట : రాత్రిసమయంలో నాగార్జున సాగర్ డామ్
(హేరీ మిల్లర్ సౌజన్యంతో)

---

సంవత్సరం చందా – రు. 3–00.

విడి ప్రతి రు. 0–25 నయాపైసలు.

# ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన చదువరీ!

క్రితంసారి నా ఉత్తరంలో, అదనపుభూమిశిస్తు చట్టానికి వ్యతిరేకంగా వ్యతిరేక పార్టీలవారు (కమ్యూనిస్టులు, ప్రజాపార్టీవారు) లేవదీయబోయే ఆందోళనను గురించి ప్రస్తావించాను. వీరు నాకు ఒక మెమొరాండాన్ని సమర్పించారు. జనవరి 30 వ తేదీ నాటికి యీ చట్టాన్ని తొలగించకపోతే రాష్ట్రవ్యాప్తంగా సత్యాగ్రహాన్ని ప్రారంభిస్తామనికూడా స్పష్టీకరించారు.

ఇష్టంవచ్చినట్టు చట్టాల్ని చేయడం, వాటిని తొలగించడం పనికిరాదు. ప్రజలు ఎన్నుకున్న ప్రతినిధులు బాగా ఆలోచించి, చర్చించిన మీదటనే యీ చట్టాన్ని ఆమోదించారు. పవిత్రమైన శాసనసభా భవనాల్లో సృష్టించినదాన్ని వీధుల్లో హత్యచేయడం కూడదు. ఈ ఆందోళనను 'సత్యాగ్రహం' అని పిలవడంకూడా తప్పే. దీంట్లో 'సత్యం' ఎక్కడుంది? నిజానికి చట్టంలోనే 'సత్యం' వుంది.

పన్నులను ఎవరూ కావాలనుకోరు. అయినప్పటికీ సంఘానికీ, ముందుతరాలవారికీ మనం చెల్లించవలసిన ఋణంవంటి బాధ్యత యిది. యిందుకు మనం మన శక్త్యానుసారం చెల్లించాలి. మనం పొందిన అభివృద్ధికీ, భవిష్యత్తులోని ఉజ్జ్వల జీవితానికీ మనం చెల్లించవలసిన మూల్యం యిది. గతంలో ఎన్నోసార్లు ప్రవచించినదే మళ్ళీ ప్రవచిస్తున్నాను. సోషలిస్టు నమూనా సమాజాన్ని సృష్టించడానికి మనం నిశ్చయించుకున్నాం. హెచ్చుతగ్గుల్ని రూపుమాపి, సర్వులకు సమానావకాశాల్ని కల్పించడమే మనధ్యేయంగా పెట్టుకున్నాం. దీన్ని నెరవేర్చాలంటే నోటితో అనేసినంత తేలికేమీ కాదు. ఆర్థిక, సాంఘికసంస్కరణలు తీసుకు రావడమనేవి చాలా చిక్కులతో కూడుకున్న బృహత్తరకార్యాలు. వీనిని సాధించేందుకు పరంపరగా అమలు పరుస్తున్న పంచవర్ష ప్రణాళికలే చక్కటి ఉపకరణాలు. ప్రణాళికలనే మనం కావాలనుకుంటే, అందుకు ప్రతిగా కొంత చెల్లించడం మన విద్యుక్తధర్మం.

మూడవ పంచవర్ష ప్రణాళికను పరిశీలించిచూస్తే దాని పరిమాణం నిర్మాణ కార్యక్రమాల్లో, ఆర్థిక వనరుల్లో వివరించబడి వుండడాన్ని మీరు దర్శించగలరు. నిర్మాణ కార్యక్రమాలు మనం సాధించాల్సిన దేమిటో వ్యక్తం చేస్తాయి. ఆర్థిక వనరులు మనం ఆశయసాధనకు ధనాన్ని వెచ్చించడంద్వారా ఏం చేయగలమో తెలియజేస్తాయి. మనం ఏం చేయాలనుకుంటున్నామో, ఏం చేయగలమో— ఈ రెండింటికీ మధ్య అగాధంవుంది. ఈ అగాధాన్ని డబ్బుతో పోల్చవచ్చు. ఈ అగాధాన్ని అన్ని రాష్ట్రాలకు పంచడం జరుగుతుంది. ఇటీవలి లెక్కలప్రకారం, మనరాష్ట్రంలో యీ అగాధం 4 కోట్ల రూ. ఈ నాలుగుకోట్ల రూపాయల అగాధాన్ని అదనపు పన్నులద్వారా భర్తీచేయవలసివుంది. మన ప్రణాళికలో మూడింట రెండువంతులకు కేంద్రప్రభుత్వమే డబ్బుపెడుతున్నది. ఇక మిగిలిన భాగానికి ఆర్థిక వనరుల్ని మనం వెతుక్కోవాలి. అలా వెతుక్కోలేకపోతే ఆ మేరకు మన ప్రణాళిక దెబ్బతింటుంది. అందుచేత పన్ను అనేది మనగురించి మనమే సహాయం చేసుకునే విధానం అన్నమాట.

అమ్మకపుపన్ను, మోటారుపన్ను, పట్టణాలలో ఆస్తిపై పన్ను మొదలయిన ఆదాయ విధానాలు ఎప్పటికప్పుడు సవరించబడుతూ వున్నప్పటికీ, ముప్పయ్యేళ్ళకుపైగా రాష్ట్రంలో భూమిశిస్తుకు సంబంధించి తిరిగి ఏ చట్టమూ చేయడం జరగలేదు. ప్రతిముప్పయ్యేళ్ళకూ భూమిశిస్తును పునరాలోచించి సవరించడం ఒక ఆచారంగా వస్తూ వుంది. కాని అనేకకారణాలవల్ల 1931–32 నుండి యింతవరకూ అలాంటిదేమీ జరగలేదు. శిస్తుసవరణకు సంబంధించిన సూత్రాల ప్రకారం యీనాడు దీన్ని 400% వరకూ పెంచాల్సి వుంటుంది. (ఈనాడు ధాన్యంధరనూ యిరవయ్యేళ్ళక్రితం ధాన్యంధరనూ పోల్చి చూడండి

(1) ఆంధ్రప్రాంతంలో ఒక క్వింటాలు మొదటిరకం ధాన్యంహోల్ సేల్ ఖరీదు 1942–43 లో రూ. 12.29 లు వుంది. ఇది 1962–63 లో రూ. 41.44 కు పెరిగింది.

(2) ఆంధ్ర ప్రాంతంలో ఒక క్వింటాలు రెండవరకం ధాన్యం హోల్ సేల్ ఖరీదు 1942–43 లో రూ. 11.54 లు వుంది. ఇది 1962–63లో రూ. 36.86 కు పెరిగింది.

(3) తెలంగాణా ప్రాంతంలో ఒక క్వింటాలు మొదటిరకం, రెండవ రకం ధాన్యాల ఖరీదు 1942–43 లో సుమారుగా రూ. 13.96 లు వుంది. అది 1962–63 లో రూ. 34.18 కు పెరిగింది.)

కాని అదనపు భూమిశిస్తు చట్టంవల్ల సగటున 58% మాత్రమే పెరిగింది. నామమాత్రపుశిస్తు చెల్లిస్తున్న ప్రాంతాలలో మాత్రమే ఎక్కువశాతం వసూలుచేయడం జరుగుతున్నది. సంవత్సరానికిఎకరానికి 50 న. పై. చొప్పున ఒకేతీరునకనిష్ఠ రేటునురూపొం

దించాం. ఒకవేళ మీరు లోగడ రెండుఅణాలుమాత్రమే చెల్లిస్తున్నట్లయితే ఇప్పుడు పెరుగుదల నాలుగింతలు వుందనడంలో సందేహం లేదు. అయితే ఇది సంవత్సరానికి ఎనిమిది అణాలు మాత్రమే. సంవత్సరానికి ఒక్క పర్యాయం ఇంతమొత్తాన్ని చెల్లించడం ఇబ్బంది అనుకునేవారు ఎవరు వుంటారు?

నేను ఇదివరకే పేర్కొన్నట్లు ఈ పన్ను విధింపు, మనప్రణాళికలకు అవసరమైన పెట్టుబడి లోటును పూరించడానికి మాత్రమే జరుగుతున్నది. ప్రణాళికలలో అధికభాగం వ్యవసాయదారుని కొరకు ఉద్దేశించబడినవే. అతను పూర్తి ప్రయోజనాలు పొందాలంటే తనవంతు వాటాను చెల్లించాల్సివుంటుంది. వ్యవసాయదారునిపై పన్నుభారం అధికంగా పడిందనడం కూడా పూర్తిగా సత్యదూరమైన విషయమే.

ఇక్కడ * నేను పూర్తి వివరాలలోకి వెళ్ళదలచలేదు. అయితే కొందరు, ప్రజలలో అధికపన్నుల పట్ల వ్యతిరేకతను పురికొల్పడం ద్వారా ఖ్యాతిలోకి రావడానికి ప్రయత్నించడం దురదృష్టకరమనే విషయాన్ని మాత్రం చెప్పవలసివుంది. ఈ అధిక పన్నులు ఎంచేత అవసరమో ప్రజలు తెలుసుకున్నట్లయితే వారు ఈ భారాన్ని వహించడానికి మనఃపూర్వకంగా అంగీకరిస్తారు.

ఇక బంజరుభూముల * * సంగతి. భారతదేశంలోమరేరాష్ట్రంలో కూడా పంపిణీ చేయనన్ని బంజరుభూములను మనరాష్ట్రంలో భూవసతి లేనివారికి పంచామని తెలపడానికి నాకు ఆనందంగా వుంది. 1957వ సంవత్సరం నుంచి నాలుగున్నర లక్షల కుటుంబాలకు 21 లక్షల ఎకరాల బంజరు భూములను పంపిణీ చేయడం జరిగింది. ఇది గమనార్హమైన చర్య. చైనా దురాక్రమణ తరువాత ఈ విషయంలో తాత్కాలికంగా విధించబడిన నిషేధం జవానుల నిమిత్తం తీసుకున్న చర్య మాత్రమే. వారిని మనం ఇంతత్వరగా మరువరాదు. చైనాఉపద్రవం మనకు ఇంకా వుండనే వుంది. అత్యవసర పరిస్థితి కొనసాగుతునే వుంది. మనరక్షణకై పాటుబడేవారి సంక్షేమాన్ని గురించిన ఆలోచన మనకు బాగా వుండాలి.

గ్రామాధికార్లు మళ్ళీ తమ జీతాల్ని పెంచమని కోరుతున్నారు. వారి కోర్కెలను పరిశీలించి, సహాయం లభింపజేసి రెండుసంవత్సరాలు మాత్రమే అయింది. మళ్ళీ వారు ఇప్పుడు జీతాలు పెంచమని కోరడం తొందరపాటు చర్యఅనే విషయాన్ని మీరూ అంగీకరిస్తారు.

ఎన్.జి . ఓలు, ఉపాధ్యాయులుకూడా తమ జీతాలు హెచ్చించనట్లయితే ప్రదర్శనలు జరుపుతామంటూ హెచ్చరిస్తున్నారు. తక్కువ జీతాలుపొందే ప్రభుత్వోద్యోగులకు ఎంతగా సహాయం చేకూర్చవచ్చునో ఆర్థికమంత్రి పరిశీలిస్తున్నారు. ఎన్. జి. ఓలు, ఉపాధ్యాయులు ఈ ఫలితాల కొరకు నిరీక్షించవలసిందిగా నేను సూచిస్తున్నాను.

ప్రతి విషయానికి మనం సత్యాగ్రహానికి, ప్రదర్శనలకూ పూనుకున్నట్లయితే మనం ఏమీ సాధించలేక పోవచ్చు ఆందోళన ఒక జాడ్యంగా పరిణమించింది. ఈలెక్కన మనలో ప్రతిఒక్కరూ ఒక్కొక్క సత్యాగ్రహం జరపవచ్చు. కాలం గడ్డుగా వుందనడంలో సందేహం లేదు. అయితే ఇటువంటి సమయాలలో ముఖ్యంగా మనం చేయవలసింది నిదానించడం, యోచనచెయ్యడం. అంతేకాని నినాదాలు చేయడం, ఆందోళనలకు దిగడం మాత్రంకాదు. ఈ తరంయొక్క కార్యభారం కఠినమైనది. ఎందుచేతనంటే వారు తమ జీవన ప్రమాణాన్ని పెంపొందించు కోవడమేకాక భావితరాలవారి ఉజ్వల భవిష్యత్తుకై పునాదులుకూడా వేయాలి. ఈ కర్తవ్యపాలనలో మనం విఫలులమైనట్లయితే మనం రెండు విధాలుగా తప్పిదం చేసినవారమవుతాము. మనకు మనమే లోపం చేసుకున్నవారమే కాక చరిత్రకు కూడా లోపం చేసినవారమవుతాము. మన కర్తవ్యాన్ని మనం గుర్తించి చరిత్రలో మన స్థానాన్ని నిర్ణయించుకోవాలి. ఈ నిర్ణయం జటిలమైనది. అయినప్పటికీ నిర్ణయం తీసుకోవలసిందే.

* 5 వ పేజీ చూడుడు.

* * 68 వ పేజీ చూడుడు.

జైహింద్ !

భవదీయుడు,

నీలం సంజీవరెడ్డి.

# మహాత్మా!

—జ్ఞానానందకవి

౧

వెతలంబొంది బ్రిటీషు పాలకులచే
వేసారి నైరాశ్యపున్
జితిలో మ్రగ్గెడు వీరభారతము
నీ చెల్వారు విందైన ధీ
కృత కార్యోద్యమ సాధన ప్రగతిచే
ప్రీతిన్ స్వతంత్రమ్ము భా
రత జాతీయులకెల్ల నచ్చినది యశో
రమ్యుండ! గాంధీమునీ!

౨

వెలువక నాటి సాంఘికపు
విప్ల శక్తుల లెక్కసేయకన్
స్థిరత నపార ధైర్యగుణ
సింధుడవై యెదిరించినాడ వా
దొరల కుసాలనమ్ముగని
దూరముగా నివసించువారికిన్
హరిజనులన్న సార్థకత
నందగజేసిన నీకు నంజలుల్.

౩

అంతములేని నీ హృదయ
మందున పాఱెడు దేశభక్తి సి
ద్ధాంతఝరీ ప్రవాహములు
ధర్మము, సత్యము, ప్రేమభావవే
దాంత సుధామలోక్తులు
విహార మొనర్చునుగాక! భారతో
దంత మిదేగదా! నిజము
ధర్మగుణైక మహాత్మా గాంధిజీ!

౪

నీలో వెల్గిన దొడ్డభావములు
తండ్రీ! నేడు దేశమం
దాలోకింపగ వెల్గనిమ్మదియె
నా యాకాంక్ష కన్పట్టు నే
దో లోప మ్మొకియింత నేడదియు
నేదోరీతిగా బోవుచే
చాలున్ నాకది నాడు
భారతపు టంశం బెంత చెన్నారునో?

౫

వెలిగించుకొన్నది విజయభారతమాత
నీగాథసూత్రాల కాగడాలు
పరికించుచున్నది పరమార్థభువనమ్ము
నీ త్యాగమయ కథానీతిపథము
హర్షించుచున్నది యమృత ధరాస్థలి
నీ జన్మమునకు నవ్యాజభక్తి
ఆలించుచున్నది అమలైక గుణభూమి
నీ మధురప్రేమ నియతివాక్కు

తనువు పులకరింప వినుచున్నది నీ మ
హోదరణపు పల్కు మోద మలర
సత్యశాంతములకు జన్మహక్కగు సీమ
భరతభూమి! బాపు! ప్రణుతి నీకు.

# అదనపు భూమిశిస్తు

బాగా ఆలోచించి సందేహాలను, సమస్యలను నివృత్తి చేసుకున్న మీదటనే 1962 ఆంధ్రప్రదేశ్ భూమిశిస్తు (అదనపు శిస్తు) చట్టం ప్రవేశ పెట్టబడినప్పటికీ దీనిపై తలయెత్తిన విమర్శలూ, ఆందోళనల దృష్ట్యా దీనికి సంబంధించిన ముఖ్యవిషయాలనూ, బంజరుభూముల పంపకంలో ప్రభుత్వ విధానం వివరాలనూ, జారీచేయబడిన ఉదారమైన రెమిషను నియమాలనూ యీ వ్యాసంలో వివరించడం జరిగింది.

1864-1894 సంవత్సరాల మధ్య కాలంలో మన రాష్ట్రంలో తొలిసారి భూమిశిస్తు సెటిల్‌మెంటు జరిగింది. ఈ శిస్తు రేట్లు 30 సంవత్సరాలకుపైగా అమల్లోఉన్నాయి. తర్వాత మళ్ళీ పన్నుల సవరింపు జరిగింది. పోయినసారి 1931-32 లో సెటిల్‌మెంటు జరిగింది. తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణాజిల్లాలో పన్నులు సవరించబడినవి. ఆ తర్వాత సెటిల్‌మెంటు విధానాన్నే 1939 లో ప్రభుత్వం పూర్తిగా రద్దు చేసింది. ఎందుకంటే, 1935-1939 మధ్య కాలంలో ధరలు బాగా పడిపోయాయి. వ్యవసాయ సరుకుల ధరలు పూర్తిగా తలక్రిందులయ్యాయి. ఇప్పటి శిస్తు పెంపుదల 30 ఏండ్లతర్వాత వచ్చిందన్నమాట. ఈ లోగా ఎన్నోమార్పులు జరిగాయి.

ఈ శతాబ్ద ప్రారంభంనుండి వ్యవసాయ కృషికి వ్యాపార స్వభావం వచ్చింది. వ్యాపారపు పంటలు వేసే విస్తీర్ణం బాగా పెరిగింది. ఉత్పత్తికూడా పెరిగింది. ఆహారపు పంటలు వేసే విస్తీర్ణంతో పోల్చిచూసుకుంటే వ్యాపార పంటలవిస్తీర్ణం తక్కువగానేకనిపించినా, గ్రామీణ ఆర్థిక వ్యవస్థను ఆహార పంటల కంటే అధికంగా డబ్బురూపంలోకి మారుస్తున్న వ్యాపారపంటలకు అత్యంత ప్రాధాన్యం వచ్చింది. వ్యవసాయంలో వచ్చిన యీ మార్పు ధరల పెరుగుదలకు కారణమైంది.

ఫలితంగా ఆహారధాన్యాల ధరలు కూడా క్రమేణా పెరిగాయి. 1872 లో కంటే 1891 లోఆహారధాన్యాల ధరలు 3 రెట్లు ఎక్కువయ్యాయి. ఇంతకంటే 1912 లో మళ్ళీ 3 రెట్లు పెరిగాయి. పైగా మొదటి ప్రపంచ యుద్ధంవల్ల కూడా ధరలు బాగా పెరిగిపోయాయి. 1929 లో మాత్రం ఆర్థిక మాంద్యంవల్ల ధరలు మందగించాయి. మళ్ళీ రెండో ప్రపంచ యుద్ధకాలంలో యుద్ధాపూర్వపు స్థాయికంటే ధరలు 4 రెట్లు పెరిగాయి.

## శిస్తు సవరింపుకు అవకాశం

ధరలు బాగా పెరిగిన సమయాల్లో రైతులకు ఎక్కువగా లాభాలు వస్తూవుంటే, శిస్తు దీనికి అనుగుణంగా పెరగడం జరగలేదు. మార్కెట్ ధరలనుబట్టిచూస్తే భూమిశిస్తు చాలా తక్కువ స్థాయిలో ఉండిపోయింది. భూమిశిస్తు రేట్లు చాలా తక్కువగా ఉన్నాయనీ, పెంచడానికి అవకాశం ఉన్నదనీ చాలాకాలం అనుకుంటూ ఉండడం జరిగింది. పన్నుల పరిశీలన సంఘంవారు కూడా ఇదే అభిప్రాయం వెలిబుచ్చారు.

పోయినసారి సెటిల్‌మెంటు జరిగినప్పుడు వివిధ జిల్లాలలో నిర్ణయించిన శిస్తురేట్లు, అప్పటినుండి 30 ఏండ్లవరకు అమల్లో ఉండాలనీ ఆ తర్వాత ధరల వ్యత్యాసాలనుబట్టి మళ్ళీ వాటిని సవరించాలనీ ఉద్దేశించారు. 1939 లో సెటిల్‌మెంటు విధానాన్ని పూర్తిగా ప్రభుత్వం రద్దుచేసి ఉండకపోతే, గుంటూరు, కర్నూలు, నెల్లూరు, కడప, చిత్తూరు, విశాఖపట్నం జిల్లాలలోనూ, అనంతపురం జిల్లా కదిరి తాలూకాలోనూ 1955 లో సెటిల్‌మెంటు జరిగిన శిస్తురేట్లు పెరిగి ఉండేవి. అలాగే ఆంధ్రలోని మిగిలిన ప్రాంతాల్లో 1962 లో సెటిల్‌మెంటు జరిగి ఉండేది.

ఈ జిల్లాలన్నిటిలో ఆ విధంగా సెటిల్‌మెంటు కార్యక్రమం జరిగి ఉన్నట్లయితే, భూమిశిస్తు ఎక్కువగా పెరిగి ఉండేది. ఎందుకంటే 1955 లో, అంతకుముందు 20 సంవత్సరాల కాలంలోని సగటు ధరలు ఆధారంగా లెక్కగట్టిచూస్తే, పూర్వపు సెటిల్‌మెంటు జరిగినప్పటికంటే

100 కి 154 నుండి 326 వరకు శిస్తురేటు పెంచవలసి ఉండేది.

1955 తర్వాతకూడా ధరలు పెరుగుతూనే ఉన్నాయి. ఉదాహరణకు ధాన్యం టోకుధర సూచీ సంఖ్య 1952 లో 92. ఇది 1960 లో 105 అయింది. (ప్రాతిపదిక 1952-53 = 100) అలాగే పప్పుధాన్యాల సూచీసంఖ్య ఆకాలంలో 78 నుండి 93కు పెరిగింది. ప్రతి ఇతర పన్నూ కూడా క్రమేణా పెరుగుతూనే ఉంది; కొన్ని సందర్భాలలో కొత్తపన్నులు వేయడం కూడా జరిగింది. భూమిశిస్తులోమాత్రం, ధరలు పెరిగినదానికి అనుగుణంగా పన్ను పెరగలేదు. ఇది రైతులందరికీ లాభదాయకమైన పరిస్థితిగదా. భూమిశిస్తుమీద సర్చార్జి, వ్యాపారపంటలమీద ప్రత్యేక పన్ను, అదనపు మాగాణిశిస్తువంటి తాత్కాలిక చర్యలు కొన్ని గైకొనడం జరిగింది. కాని వీటిదృష్ట్యాచూసినా పెరిగిన ధరలకూ, భూమిశిస్తులకూ సరైన సంబంధం ఏర్పడలేదు. భూమిశిస్తు పెంచవలసిన అవసరం కలగడమే కాకుండా రకరకాల శిస్తులను తొలగించడం, ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలోని శిస్తువ్యత్యాసాలను తొలగించడంకూడా అవసరమైంది. ఈ రెండుప్రాంతాల సమైక్యతకు యీ చర్య ఉపకరిస్తుంది.

## చట్టంలోని ముఖ్యాంశాలు

అదనపు భూమిశిస్తు చట్టం చేయవలసిన అవసరాన్ని యీ దృక్పథంతో పరిశీలించాలి. చట్టంలోని ముఖ్యాంశాలనూ, తర్వాత జరిగిన సవరణలనూ జాగ్రత్తగా పరిశీలిస్తే, పరిస్థితులలో కలిగిన మార్పులకు అనుగుణంగా యీ చట్టం చేయవలసిన ఆవశ్యకత, దాని ఉద్దేశాలు స్పష్టంగా తెలుస్తాయి. మొదట్లో చట్టం అమలు జరిగినప్పుడు కృష్ణా, గోదావరి ఆనకట్టల క్రింద, నిజాంసాగరు ప్రాజెక్టు మొదలగు వాటిక్రింద ఆయకట్టు 20 ఎకరాలకు మించిన యితర నీటి వనరులక్రింద సాగయ్యే మాగాణి భూములకు శిస్తురేటు రెట్టింపుచేసి, దిగువ పరిమితులువిధించడంజరిగింది.*

20 ఎకరాలు, అంతకులోపు ఆయకట్టుగల వనరులక్రింది మాగాణిభూముల విషయంలో శిస్తు నూటికి 50 వంతులు మాత్రమే పెరిగింది. వాటికి ఒకేపంట ఉన్నప్పుడు ఎకరానికి కనీసపరిమితి రు. 6, గరిష్టపరిమితి రు. 12 గానూ, రెండు పంటలున్నప్పుడు ఎకరానికి రు. 9 కనీస పరిమితి, రు. 18 గరిష్ట పరిమితిగానూ నిర్ణయించారు. మెట్టభూములన్నింటికీ భూమిశిస్తు నూటికి 75 వంతులు పెంచి, ఎకరానికి అర్థరూపాయి కనీస పరిమితి విధించారు.

## ప్రజాభిప్రాయానికి అనుగుణంగా...

చట్టం చేయకముందు, చేసిన తర్వాత చివరి భూములకూ, చవిటిపర్ర భూములకు యీ చట్టంవల్ల పన్నుభారం ఎక్కువవుతుందని శాసనసభ్యులు అభిప్రాయం వెలిబుచ్చారు. రాష్ట్రంలోని ప్రజాభిప్రాయం కూడా ఆ విధంగానే ఉంది. విధించిన కనీస పరిమితులుకూడా రైతులకు భారమయ్యే కొన్ని ప్రత్యేక సందర్భాలు కూడా చూపబడినవి. ఈ ప్రజాభిప్రాయాన్ని మన్నించి, రైతుల ఆర్థిక స్థితిని దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వం యీ విషయాలన్నిటినీ కుణ్ణంగా పరిశీలించి 1962 సం.పు అదనపుశిస్తు చట్టానికి తగు విధంగా సవరణలు చేసింది. నీటి వనరుల విభజనను ఇంకా విశాలదృష్టితో విస్తృత పరచడం సెటిల్‌మెంటు రివిన్యూ రికార్డులలో ఆయా భూములకు చేయబడిన తరం, భగన విభాగాలకు అనుగుణంగా ఉండేటట్లు పెరిగిన భూమిశిస్తును మార్పు చేయడం యీ సవరణ ఉద్దేశం.

చట్టంలో చేసిన సవరణవల్ల దిగువ

| * | ఒకపంట మాగాణి | | రెండుపంటలు మాగాణి | |
|---|---|---|---|---|
| | గరిష్ట పరిమితి | కనీస పరిమితి | గరిష్ట పరిమితి | కనీస పరిమితి |
| 1. చట్టం షెడ్యూలులో పేర్కొనబడిన ప్రభుత్వ సేద్యపునీటిపారుదల వనరుల క్రింద నీరు పొందే మాగాణిభూములు | రు. 26 | రు. 20 | రు. 39 | రు. 30 |
| 2. 20 ఎకరాలు, అంతకు తక్కువ ఆయకట్టుగల సేద్యపునీరుపారుదల వనరుల క్రింద మాగాణి భూములు కాక, ఇతర మాగాణి భూములు. | 15 | 9 | 22-50 | 13-50 |

పేర్కొన్న విభజన పద్ధతి అమలులోకి వచ్చింది.*

తక్కువ రకంగల భూములు, తక్కువ సారవంతమైన భూములకు శిస్తు నిర్ణయంలో సౌకర్యం చూపబడినట్లు యీ పట్టికద్వారా తెలుస్తుంది. పెద్దపెద్ద సేద్యపు నీటి వనరులక్రింద గల సారవంతమైన భూములతో పోల్చి వీటినొక ప్రత్యేక వర్గంగా పరిగణించడం జరిగింది. అంతేకాక సేద్యపునీటి పారుదల వనరుల శక్తినిబట్టి, ఆయాభూముల తరం, భగన విభజనల ననుసరించి శిస్తురేట్లు నిర్ణయించబడినవి. సంవత్సరానికి సుమారు రు. 200 లక్షలవరకు తగ్గింపు లభించేవిధంగా యీ విభజన జరిగింది. ప్రజాభిప్రాయానికి అనుగుణంగా ప్రభుత్వం చర్యలు తీసుకున్న దనడానికి ఇదే నిదర్శనం.

## ప్రత్యేక పన్నులు రద్దు

ఈ చట్టం, కొందరన్నట్లు, రైతుల మీద అదనపు శిస్తుభారాన్ని వెయ్యడానికి ఉద్దేశించినట్టిదికాదు. భూములమీద రకరకాల పన్నులు విధించబడి ఉన్నవనీ కట్టవలసినమొత్తం శిస్తును గురించి అయోమయం పరిస్థితి ఏర్పడి ఉన్నదనీ ప్రజాభిప్రాయం ప్రకటించబడిన కారణంగా 1962 సం.పు అదనపు శిస్తు విధింపుచట్టం జరిగినతర్వాత భూమిశిస్తు మీద సర్చార్జి, వ్యాపార పంటలమీద ప్రత్యేకపన్ను, అదనపు మాగాణి పన్ను వంటి ప్రత్యేకపన్నులు రద్దు చేయబడినవి. ఈ చట్టంక్రింద సాలుకు సుమారు రు.570 లక్షల శిస్తువసూలు జరుగుతుందనీ అంచనా. పైనచెప్పిన మూడు ప్రత్యేక పన్నులు తీసివేసిన కారణంగా సంవత్సరానికి రు. 90 లక్షల ఆదాయం తగ్గుతుంది. కాబట్టి అదనంగా వసూలయ్యే శిస్తు రు. 4.80 కోట్లు మాత్రమే.

పసుపు, అరటి, కొబ్బరి, ఉల్లి మొదలగు వ్యాపారపంటలు పండించే భూములకు ఎకరానికి 3 నుండి 5 రూపాయల వరకు ప్రత్యేకశిస్తు రేటు వర్తిస్తుంది. ఈ భూములకు సగటు మెట్టరేటు రు. 1 నుంచి రు. 5 ల వరకు ఉంటుంది. అదనపు శిస్తు విధింపుచట్టం క్రింద ఉద్దేశించిన 75 శాతం పెరుగుదలప్రకారం, యీభూములశిస్తు ఎకరానికి రు. 2 నుండి రు. 8 వరకు ఉంటుంది. ఇప్పటిరేటు రు. 6 నుండి రు. 10 వరకు ఉంది. వ్యాపారపంటలు పండే భూములమీద ప్రత్యేకపన్ను తొలగిపోయినందున, ఇప్పటి పెరుగుదల నామమాత్రంగానే ఉందిగాని ఎక్కువగా లేదు.

## శిస్తులో నికరంగా పెరుగుదల

అదనపు భూమిశిస్తుచట్టం అమల్లోకి రాకముందు, భూమిశిస్తు విధింపుమొత్తం రు. 826.71 లక్షలు. ఈ చట్టంవల్ల ఇది రు. 1307.56 లక్షలకు పెరుగుతుంది. నికరంగా పెరుగుదల రు. 480.85 లక్షలు మాత్రమే. అంటే 58 శాతం. ధరలో వచ్చినంత పెరుగుదల ఇందులోకూడా వచ్చిందని చెప్పడానికి వీల్లేదు. ధరలకంటే శిస్తురేటు పెరుగుదల తక్కువగా ఉంటే, ఆ లాభం రైతులకే కలుగుతుంది.

ఆందోళన చేస్తున్న నాయకులు, అందరికంటే రైతే ఎక్కువగా పన్నుల భారంలో కుంగిపోతున్నాడని చెప్తున్నారు. ఇదికూడా నిజంకాదు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో నూటికి 70 మంది కంటే ఎక్కువగా ప్రజలు వ్యవసాయ కృషిలో నిమగ్నులై ఉన్నారు. వీరందరూ కలిసి 1961–62 లెక్కలప్రకారం రాష్ట్రం మొత్తం ఆదాయంలో 19 శాతంకంటె తక్కువగానే చెల్లిస్తున్నారు. అమ్మకాల

## *సవరించిన విధానం

| మాగాణిభూమి | ఒకపంటపండే మాగాణిభూమికి ఎకరానికి చెల్లించవలసిన శిస్తురేటు | | | |
|---|---|---|---|---|
| ప్రభుత్వసేద్యపు నీటిపారుదల వనరులక్రింద ఆయకట్టు విస్తీర్ణం. | సెటిల్‌మెంటు తరం సంఖ్య | సెటిల్‌మెంటు విభజన –భగన | కనీస పరిమితి రు. | గరిష్ట పరిమితి రు. |
| (1) | (2) | | | |
| 1. 30,000 ఎకరాలు అంతకుపైన | ఎ 1–5 వరకు | 16నుండి 12 | 20.00 | 24.00 |
| | బి 6–8 వరకు | 11½ " 9 | 15.00 | 18.00 |
| | సి 9అంతకుపైన | 8½అంతకుతక్కువ | 12.00 | 15.00 |
| 2. 5,000 ఎకరాలు, అంతకుపైన 3,000 కు లోపుగా | ఎ 1–5 వరకు | 16 నుండి 12 | 15.00 | 18.00 |
| | బి 6అంతకుపైన | 11½అంతకుతక్కువ | 12.00 | 15.00 |
| 3. 50 ఎకరాలు, అంతకుపైన 5,000 కు లోపుగా | అన్నితరసులు | అన్నిభగనలు | 9.00 | 14.00 |
| 4. 50 ఎకరాలలోపు | " | " | 6.00 | 12.00 |

రెండుపంటలుపండే భూములకు అన్ని విభాగాలలోనూ నూటికి 50వంతులు ఎక్కువ.

పన్ను చెల్లించేవారు జనాభాలో తక్కువ శాతమే అయినా రాష్ట్రాదాయంలో వారు 29 శాతానికిమించి పన్ను కడుతున్నారు. ఇది నిజంగా రైతులు సంతృప్తి నొంద వలసిన విషయం.

## రైతులకే తక్కువ పన్నులు

నిర్బంధ పొదుపు పథకం తయారు చేసిన సందర్భంలో సాలుకు రు. 1500 లకు మించిన ఆదాయం కలవారి నంద రినీ ఆ పథకం క్రిందికి తీసుకురావాలని ఉద్దేశించారు. అది అమలు జరిగినట్లయితే రు. 1500 ఆదాయంవచ్చేరైతు రు.45 లు నిర్బంధంగా చెల్లించవలసి వచ్చేది. తర్వాత ఆ పథకంలో చేసిన సవరణవల్ల రైతులను పూర్తిగా మినహాయించడం జరిగింది. బస్తీలలో ఉండి సంపాయించు కునేవారికి లాగా రైతులకు ఎక్కువ పన్నుభారం లేదనేది గుర్తించదగిన విషయం. బస్తీలలోనివారు ఆదాయం పన్ను చెల్లిస్తారు. అమ్మకాల పన్ను చెల్లిస్తారు. ఇంకా సర్చార్జీ, నిర్బంధపు పొదుపు మొత్తాలు కూడా చెల్లిస్తుంటారు. ఉదాహరణకు చూడండి. సంవత్సరానికి రు. 5000 లు ఆదాయం వచ్చే వ్యక్తి రు. 42 లు ఆదాయపుపన్ను, రు. 1–05 లు ఆదాయపన్నుమీద సర్చార్జీ, రు 148–70 నిర్బంధపొదుపుమొత్తం, రు. 49-58 లు అదనపు సర్‌చార్జి చెల్లిస్తాడు. మొత్తం రు. 241–33 లు. సాలుకు రు. 5000 లు ఆదాయం యివ్వగల వ్యవసాయభూమి మీద అదనపు శిస్తుచట్టం ప్రకారం విధించ బడే శిస్తు రు. 120 లు. పైగా ఆదాయపు పన్ను, ఆదాయం పెరిగినకొలదీ ఎక్కువగా పెరుగుతుంటుంది.

## పంచవర్ష ప్రణాళికలు

మనరాష్ట్రం వ్యవసాయ రాష్ట్రం. కాబట్టి మన ప్రణాళికలుకూడా వ్యవసాయ కార్యక్రమాల ప్రాధాన్యం కలిగి ఉంటాయి. చట్టాన్ని వ్యతిరేకించి సత్యాగ్రహం చేస్తామని బెదిరిస్తున్నవారుకూడా ప్రణాళికలు రైతుల ప్రయోజనంకోసం కాదని వాదించలేరు. అలా వాదించే వారికి యీ క్రిందపేర్కొన్న విషయాలే సమాధానం. రెండో పంచవర్ష ప్రణాళికలో జరిగిన మొత్తం ఖర్చు 18,501 లక్షలు. ఇందులో రైతులకే అధిక ప్రయోజనంగల సేద్యపు నీటి పారుదల పథకాలకు రు.5,743 లక్షలు, వ్యవసాయ పథకాలకు రు. 3,737 లక్షలు ఖర్చు జరిగింది. అంటే యీ రెంటికీకలిసి ప్రణాళిక మొత్తంలో సుమారు సగం ఖర్చు యింది. అలాగే మూడోపంచవర్ష ప్రణాళిక మొత్తం రు. 31,266 లక్షలలో, సమాజాభివృద్ధి, సహకార కార్యక్రమంతో సహా వ్యవసాయ పథకాలకు రు. 7,984 లక్షలు, సేద్యపు నీటిపారుదల, వరద నివారణ పథకాలకు రు. 7,533 లక్షలు ఖర్చవుతాయి. ఈ రెంటికీకలిసి మొత్తంలో రు. 49.6 శాతం కేటాయించబడింది.

మైనర్ ఇరిగేషన్ పథకాలుకూడా రైతుకు నేరుగా ప్రయోజనం కలుగజేస్తాయి. రివిన్యూ, ఇరిగేషన్ శాఖల అధ్వర్యానగల చెరువులు, కాలువలు బాగుచేయించడం, గండ్లుపడిన చెరువు కట్టలు మరమ్మతుచేయడం, పంపింగ్ పథకాలు, వరదకట్టల నిర్మాణం, లిఫ్ట్ ఇరిగేషన్ పథకాలు, సేద్యపు నీటి పారుదల వసతులకోసం ఆయిల్ ఇంజన్లు మోటారుపంపుసెట్లు నెలకొల్పడం, కొత్తగా బావుల త్రవ్వకం, పాతబావులు బాగుచేయించడం, బోరింగ్ బావులు, గొట్టపుబావులు, బావులసబ్సిడీపథకాలు, ఫిల్టర్ పాయింట్లు మొదలగునవన్నీ రైతులకు అత్యంత ఉపయోగకరమైన కార్యక్రమాలు. రెండో పంచవర్ష ప్రణాళికకాలంలో మైనర్ ఇరిగేషన్ కార్యక్రమాలకోసం రు 811.47 లక్షలు ఖర్చు జరిగింది. మూడో ప్రణాళికలో దీనికై రు. 282.6 లక్షలు కేటాయించారు.

ఇదేవిధంగా తక్కావీ ఋణాలు కూడా రైతులకు చాలా ప్రయోజనకారులు. వీటిద్వారా రైతులు ట్రాక్టర్లు, ఆయిల్ ఇంజన్లు, రసాయనిక ఎరువులు మొదలగు ఆధునిక వ్యవసాయ ప్రక్రియలను అమలుపరచి వ్యవసాయాన్ని అభివృద్ధి పరచుకోవడానికి అవకాశం ఉంటుంది. రెండో ప్రణాళికకాలంలో రివిన్యూ, వ్యవసాయశాఖల తక్కావీ ఋణాల పద్దుక్రింద రు. 1456.76 లక్షలు ఋణాలు మంజూరుచేయబడినవి. మూడో ప్రణాళికలో 1961-62, 1962-63 సం. లో రివిన్యూ ఋణాలక్రింద రు. 351.96 లక్షలు, వ్యవసాయశాఖ ఋణాలక్రింద రు. 490 83 లక్షలు ఖర్చు జరిగింది. సస్యరక్షణ ప్రక్రియల ప్రదర్శన, వ్యవసాయ పరిశోధన, మేలురకం విత్తనాల వడ్లు మొదలగు కార్యక్రమాలక్రింద జరిగిన ఖర్చు కాక, పైన పేర్కొన్న మొత్తాలు ఋణాలుగా మంజూరు చేయబడినవి.

వ్యవసాయ కార్యక్రమాలు కాక విద్య, వైద్యసేవ, ప్రజారోగ్యం, నీటి సప్లయి, పారిశుద్ధ్యం మొదలగు గ్రామీణ పట్టణ ప్రజలకు ఉపకరించే సాంఘిక సంక్షేమ పథకాలక్రింద కూడా తగు మొత్తాలు ఖర్చు చేయడం జరిగింది. రెండో ప్రణాళిక ఖర్చు మొత్తం రు. 18,501 లక్షలలో సాంఘిక సంక్షేమ

పథకాలకు 3,305 లక్షలు ఖర్చయింది. అలాగే మూడో ప్రణాళిక మొత్తం రు. 31,266 లక్షలలో యీ పథకాలకు రు. 4,667 లక్షలు కేటాయించబడినవి.

మూడో ప్రణాళిక మధ్యకాల పరిశీలన వల్ల వ్యవసాయోత్పత్తి, భూమి అభివృద్ధి కార్యక్రమాలు సంతృప్తికరంగా కొనసాగుతున్నట్లు స్పష్టమయింది. వ్యవసాయోత్పత్తి, భూమి అభివృద్ధి, భూసార పరిరక్షణ, భారీ ప్రాజెక్టులు, మైనరు ఇరిగేషన్ మొదలగు వివిధ పథకాలు అమలుపరచినందువల్ల మూడో ప్రణాళిక కాలంలో అదనంగా 27.28 లక్షల టన్నుల అదనపు వ్యవసాయోత్పత్తికి అవకాశం వుంటుందని అంచనా. మొదటి సంవత్సరాల్లో 1961-62, 1962-63: 7.68 లక్షల టన్నుల అదనపు ఉత్పత్తి సాధించబడింది. 1963-64 లో యింకా అదనంగా 5.12 లక్షల ఉత్పత్తి జరుగుతుందని అంచనా. రెండో ప్రణాళిక చివరకు రాష్ట్రంలో మొత్తం ఆహారధాన్యాల ఉత్పత్తి 63.19 లక్షలు వుంటుంది.

## ట్రాక్టర్ల పంపిణీ

భూమి అభివృద్ధి కార్యక్రమాలక్రింద దిగువ పేర్కొన్న మూడు పథకాలను అమలు పరచడానికి నిర్ణయం జరిగింది. పురోగాములు, ఉత్సాహవంతులైన వ్యవసాయదార్లకు తక్కావీ ఋణాల పై ట్రాక్టర్లను పంపిణీచేయడం; వ్యవసాయ కార్మికుల కిచ్చిన బంజరు భూములను సేద్యయోగ్యం చేయడం; ప్రభుత్వ ట్రాక్టర్ల వ్యవస్థద్వారా భూములను సేద్యయోగ్యం చేయడం. వీటిలో మూడవ పథకాన్ని యీ సంవత్సరం అమలు పరుస్తున్నారు. దీనికి ప్రణాళికలో రు. 4.0 లక్షలు కేటాయించారు. దీని క్రింద 53,080 ఎకరాల భూమి సేద్యయోగ్యం చేయబడుతుంది. తృతీయ ప్రణాళిక కాలంలో మొత్తం 4.89 లక్షల ఎకరాలను సాగుకు లాయకుచేయడం లక్ష్యంగా పెట్టుకున్నారు. దీనికిగాను మూడో ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో 3.05 లక్షల ఎకరాల విస్తీర్ణాన్ని సేద్యానికి అనువుగా అభివృద్ధి పరచడం జరిగింది.

అభివృద్ధి కార్యక్రమం జోరుగా సాగాలంటే, ఈ సంక్షేమ రాజ్య పథకాలను నిర్విఘ్నంగా అమలుపరచేందుకు తగినన్ని ఆర్థిక వనరులను జాగ్రత్తగా సమకూర్చుకొని పథకాలను తెలివిగా అమలుపరచుకోవలసి వుంటుంది. ఉదాహరణకు రాష్ట్ర ప్రభుత్వం రూ. 18,501 లక్షల రెండవ ప్రణాళికా వ్యయాన్ని భరించడానికి స్వంత సాధన సంపత్తులనుంచి రు. 8,418 లక్షలుసమకూర్చింది. మిగతా రు.10,083 లక్షలు భారతప్రభుత్వం ఇచ్చిన ఋణాలు, గ్రాంట్లద్వారా లభించింది. ప్రస్తుత సూచనలను బట్టి ఆంధ్రప్రదేశ్‌లో రు. 31,266 లక్షల తృతీయ ప్రణాళికను అమలు పరిచేందుకు స్వంత సాధన సంపత్తులనుంచి రు. 10,960 లక్షల వరకు సేకరించుకోవలసిన అవసరం వుంటుంది.

ఈ మొత్తంలో రు. 5,300 లక్షలు పూర్తిగా అదనపు పన్నులద్వారా సేకరించుకోవాలి. అయితే ఇప్పటివరకు తీసుకున్న చర్యలవల్ల ఇంత మొత్తం లభ్యం కాదు. దాదాపు రు. 400 లక్షల కొరత ఏర్పడవచ్చు. ఈ లోటును అదనపు పన్నులద్వారా భర్తీచేసుకోవాలి. దీనిని భర్తీ చేయవలసింది మనమే. ప్రణాళిక నిరాటంకంగా అమలు జరగాలంటే ఇది మనం తప్పనిసరిగా చేయవలసినకర్తవ్యం. ఈ విషయాన్ని మనం గుర్తించినట్లయితే మన ప్రణాళిక లక్ష్యాలు నెరవేరజాలవు. ప్రణాళికా పథకాలు విఫలమైనట్లయితే అందువల్ల నష్టపడేది ఎవరు?— ప్రధానంగా వ్యవసాయదారులే కదా.

బ్రహ్మాండమైన నాగార్జున సాగర్ ప్రాజెక్టుకోసం మూడవ ప్రణాళిక ముగింపునాటికి రు. 9,000 లక్షలు వెచ్చించవలసి వుంటుంది. ఈ ప్రణాళికా కాలంలోనే అనేక భారీ, మధ్యరకం నీటిపారుదల పథకాలకు సుమారు రు. 2,500 లక్షలు ఖర్చు జరుగుతుంది. పైగా చిన్నరకం నీటివనరుల కార్యక్రమాలకు రు. 2,800 లక్షలు, విద్యుచ్ఛక్తి పథకాలకు రు. 7,800 లక్షలు కూడా ఖర్చు జరుగుతుంది. ఈ కార్యక్రమాలన్నీ చాలాభాగం వ్యవసాయాభివృద్ధికి ఉద్దేశించినవే. వీటివల్ల ప్రయోజనం పొందేవారు రాష్ట్రంలోని లక్షలాది వ్యవసాయదారులే.

## ముఖ్యమైన చర్యలు

ప్రణాళికలు, ఇతర భారీ ప్రాజెక్టులతో పాటుగా మన రాష్ట్రంలో కొన్ని ముఖ్యమైన సాంఘిక భద్రతా చర్యలను కూడా ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఇటీవల గైకొన్న కొన్ని ముఖ్యమైన చర్యలు వృద్ధులకు ఫించన్లు లభింపజేయడం; బాలికలకు ఉచిత విద్యాసౌకర్యాలు కల్పించడం; ఉపకార వేతనాల సంఖ్యను పెంచడం. వెనుకబడిన తనాన్ని కులాన్ని బట్టికాక ఆర్థిక పరిస్థితిని బట్టి నిర్ణయించే పద్ధతిని ప్రభుత్వం యిప్పుడు అవలంబించింది. ఈ చర్యలతో చాలావాటివల్ల పట్టణవాసులకంటే వ్యవసాయదార్లే ఎక్కువగా ప్రయోజనం పొందు

# లేవోయి! లేవోయి!

—సురభి నరసింహము

లేవోయి, లేవోయి,
యువ భారతీయుడా!
నవశక్తి నీలోన
నాట్యమాడగ నింక ॥లేవోయి॥

గతిలోన, మతిలోన
గంభీరతను గలిగి,
జాతి జీవనవనుల
కాంతిరేఖల నింప ॥లేవోయి॥

స్వాతంత్ర్య జీవనము
స్వర్గసౌఖ్యము నొసగ,
దేశమ్ము నవకాంతి
తేజమ్ముతో నెసగ ॥లేవోయి॥

మాతృపూజను సేయ
మల్లియల గొనిరమ్ము;
దేశరక్షణ సేయ
దీక్షబూనగ లెమ్ము ॥లేవోయి॥

ఏ విపత్తులనైన
ఎదిరించి గెలుపొంది,
నవ్యభారత శ్రీల
నల్దెసల వెదచల్ల ॥లేవోయి॥

నవనవోదయ శోభ
చివురింప వలెనోయి,
యువకళా సంపదలు
ఉదయింప వలెనోయి ॥లేవోయి॥

నీలోన నిదురించు
నిఖిలశక్తుల నెల్ల
కదిలించి, కవ్వించి
పదవోయి ముందునకు ॥లేవోయి॥

కార్యదక్షత గలిగి,
కదలి ముందుకు సాగి,
దిగ్విజయమును కనగ
దీక్షబూనుము పడిగ ॥లేవోయి॥

'జై హింద్' నాదములు
జగమెల్ల పర్వంగ,
నడు, ముందు, ధృతిపూని
నాయకత్వము నొంద ॥లేవోయి॥

యువశక్తి చివురించి
నవదీప్తి గనునాడె
దేశమ్ము రహిమించి
తేజమ్ము గనునోయి ॥లేవోయి॥

లేవోయి, లేవోయి,
యువ భారతీయుడా!
విజయ మంగళగీతి
వినిపించు వీరుడా!

---

తారు. నిజానికి ఈ చర్యలను తీసుకోవడంలో ముఖ్యోద్దేశమేమంటే, ఇప్పటివరకు పట్టణవాసులతో సమానంగా అవకాశాలు పొందలేకుండావున్న పల్లె ప్రజలను పట్టణ ప్రజల స్థాయికి తీసుకొనివచ్చి ఇకముందువారు పట్టణ ప్రాంతాలలోని తమ సోదరులతో చేయి చేయి కలిపి, సమాన హోదాతో పురోగమించడానికి అవకాశం కల్పించడమే.

ఈ కార్యక్రమా లన్నింటినీ అమలుపరచడానికి డబ్బు సమకూర్చుకోవాలి. ఇతోధిక సౌకర్యాలకోసం మనం ఆందోళన చేస్తున్నప్పుడు వాటికి అవసరమైన పన్నులను చెల్లించడానికి మనం నిరాకరించలేము.

## బంజరుభూముల పంపిణీ

సేద్యయోగ్యమైన బీడు భూములు లేక బంజరుభూముల పంపిణీకి సంబంధించి ఒకే రకమైన విధానం 1958 లో ఆచరణలోకి వచ్చింది. ప్రస్తుత నిబంధనల ననుసరించి కలెక్టర్లు, కుల ప్రయోజనాలకూ, ప్రభుత్వం, పబ్లిక్ ప్రయోజనాలకూ అవసరమైనభూములను మొదట ప్రత్యేకించి వాటిని ప్రత్యేకంగా ఒక రిజిష్టరులో నమోదుచేయాలి. ఆ తరువాతనే మిగతా భూముల పంపిణీకి ఏర్పాట్లు చేయాలి. భూవసతిలేని బీదవ్యక్తికి ఒక కుటుంబానికి 2½ ఎకరాల మాగాణి లేక 5 ఎకరాల మెట్టభూమి పొందడానికి అర్హత వుంటుంది. ఈ విధంగా పంచబడిన భూములను వంశపారంపర్యంగా అనుభవించవచ్చు. కానిమరొకరికి మార్చడానికి వీలుండదు.

అయితే ఈ భూములను, అప్పుతీసుకునేందుకుగాను, ప్రభుత్వానికి కానీ సహకార పరపతి సంఘాలకుగానీ, భూమి తనఖా బ్యాంకులకు కానీ తాకట్టు పెట్టడానికి ప్రభుత్వం అనుమతించింది.

(మిగతా ౬౮వ పేజీలో)

# ఆస్ట్రేలియన్ చిత్రకళ

క. దివ్యజ్ఞాన సరోజినీ దేవి

ఆస్ట్రేలియన్ ఖండపు ఆదిమవాసుల చిత్రకళగాక, అక్కడకు రెండు శతాబ్దముల కాలమునాడు వలసపోయి, స్థిరపడి పోయిన ఐరోపియన్‌ల చిత్రకళే నేడు ఆస్ట్రేలియన్ చిత్రకళగా పేరుగాంచినది. ఈ చిత్రకళ పదునెనిమిదవ శతాబ్దమున ఆస్ట్రేలియా ఖండమును కనుగొనటముతో ఆరంభమైనదని చెప్పవచ్చును. ఆనాడా ఖండమునకు వలసవచ్చిన ఐరోపియనులు తమతోబాటు తమ పూర్వదేశ (ఐరోపా) కళా సంస్కృతులను గూడా తీసుకొని వచ్చిరి. అందుచే ఆస్ట్రేలియన్ చిత్రకళ ప్రారంభదశలో ఐరోపియన్ చిత్రకళనే పోలి యుండెడిది. పందొమ్మిదవ శతాబ్దపు తుదివరకు ఈ చిత్రకళ తన ప్రత్యేకతను యేర్పరచుకొనలేక పోయినది.

మొట్టమొదటి ఆస్ట్రేలియన్ చిత్రకారులు ఐరోపానుండి వినూతన ఖండమైన ఆస్ట్రేలియాను దర్శించి, అక్కడి చిత్రవిచిత్రములనెల్ల తమ కుంచెలతో చిరస్థాయిగా చిత్రించుటకు వచ్చినవారు మాత్రమే. వారు కొన్ని సంవత్సరముల కాలము ఆస్ట్రేలియా పర్యటించి, అక్కడి ఆదిమవాసులను, పశుపక్ష్యాదులను, వృక్షజాతులను చిత్రించి తిరిగి తమ స్వదేశమునకు బోయి ఆ చిత్రములను ప్రదర్శించుటయో, పుస్తకరూపమున అచ్చువేయుటయో చేసెడివారు. ఆనాటి వారు ఆదిమవాసులను వీరులుగా భావించుచుండిరి. అందుచేతనే గాబోలు ఆనాటి చిత్రకారులు సైతము తమ చిత్రములందు ఆదిమవాసులను వీరులైన గ్రీకుల రూపురేఖలను కలిగి యుండునట్లు చిత్రించెడివారు. కానిత్వరలోనే ఆస్ట్రేలియాకు వలసవచ్చిన వారిలో ఆదిమవాసుల పట్లవుండే భావము మార్పుచెందసాగినది. వారా పూర్వీకులను వీరులుగా గాక అనాగరికులైన మృగతుల్యులుగా భావింపసాగిరి. దానితో వారిని ఆనాటి చిత్రకారులు సైతము వీరులైన గ్రీకులవలెగాక అనాగరికులవలె చిత్రింపసాగిరి. భావన యెంత బలీయమైనది!

ప్రప్రథమముగా ఆస్ట్రేలియన్ చిత్రములు అందుండే చిత్రకళా నైపుణ్యమునకు గాక, అందు చిత్రింపబడిన వింతైన పశుపక్ష్యాదులకొరకు, అరుదైన వృక్షజాతుల కొరకు ప్రశంసింపబడెడివి. అందుచేతనే గాబోలు ఆనాటి ఆస్ట్రేలియన్ చిత్రములలో ఐరోపా చిత్రకళా ఛాయలున్నను ఆ (ఐరోపా) చిత్రకళా నైపుణ్యము మాత్రము కానరాదు. మరియు, త్వరితముగా చిత్రింపగలుగుట వలనను, ఒకచోటనుండి ఒకచోటకు సులభముగా తీసుకొనిపోగలుగుట వలనను, ఆనాడు తైలవర్ణ చిత్రములకన్న నీటివర్ణ చిత్రములే బహుళ ప్రచారములో నుండెడివి.

ఆనాటి ఆస్ట్రేలియన్ ప్రకృతి నిర్జీవముగాను, నిర్మానుష్యముగాను వుండుటచే మొట్టమొదటలో చిత్రకారుల నాకర్షించెడిది గాదు. కాని ఆటుపిమ్మట కొంతకాలమునకు చిత్రకారులు ఆ ప్రకృతినే క్రొత్తపంథాలో చిత్రింపసాగిరి. వారు దేశములనైన వున్నది వున్నట్లుగాక సుందరముగాను, అతి సహజముగాను వుండునట్లు, తాము ఆస్ట్రేలియాలో మరెక్కడో రెండుమూడు చోట్ల ప్రకృతిని చూచి చిత్తుగా చిత్రించుకొనిన తమ చిత్రముల నాధారముగా ఆ కల్పిత ప్రకృతి చిత్రపటములను చిత్రింపసాగిరి.

1821 పిమ్మట ఆస్ట్రేలియాకు వలసవచ్చినవారు లోపలి ప్రదేశములకు చొచ్చుకొనిపోసాగిరి. పంటభూములెక్కువవసాగినవి. నేల ఫలపుష్ప వృక్షజాతులతో సస్యశ్యామలమవసాగినది. దానితో ఆస్ట్రేలియా ప్రకృతి చిత్రకారుల నెక్కువ ఆకర్షించసాగినది. ఆ చిత్రకారులు చూచినది చూచినట్లు చిత్రింపసాగిరి. వారి చిత్రములలో సహజత్వమెక్కువైనది. ఆ చిత్రకారులు

ప్రకృతి చిత్రం    చిత్రకారుడు : హేన్స్ హైసెన్





మార్గరెట్ ఒల్లే రూపచిత్రం చిత్రకారుడు : విలియం దోబెల్

ఆదిమవాసులనే గాక, అక్కడకు వలస వచ్చినవారి ప్రతిరూపములను, నిత్యజీవితమునుగూడ చిత్రింప సాగిరి. ఆస్ట్రేలియన్‌లు సాధారణముగా కంగారును వేటాడుతున్నట్లునో, ఆదిమవాసులతో యుద్ధము చేస్తున్నట్లునో చిత్రింప బడెడివారు.

ఆ కాలములోనే ఆస్ట్రేలియన్ చిత్రకళలో మరియొక మార్పుగూడ రాసాగినది. చిత్రపటములు అందు చిత్రింపబడిన వస్తువులను బట్టిగాక, చిత్రింపబడిన విధానమును బట్టి ప్రశంస లందుకొన సాగినవి. కానీ చిత్రకళలో యింకను ఐరోపా చిత్రకళా ఛాయలే కానరాసాగినవి. ఆనాటి చిత్రకారులు కేవలము ఆస్ట్రేలియాను చూచిపోవుటకు మాత్రమే వచ్చినవారు గాదు. వారు సాధారణముగా ఐరోపాలో శిక్షణ పొంది ఆస్ట్రేలియాకు వచ్చి అక్కడ స్థిరనివాస మేర్పరుచుకొన్నవారో, లేదా ఐరోపానుండి ద్వీపాంతరవాస శిక్ష నిమిత్తమై ఆ ఖండమునకు పంపబడిన నేరస్థులోనై వుండెడివారు. వీరిలో నేరస్థులైన చిత్రకారులు తమకు ప్రపంచముమీద గల కసిని ఆ ఆదిమవాసులపై తీర్చుకొనెడివారు. అందుచేతనే వారిచిత్రములలో సైతము ఆ ఆదిమవాసులను అపహాస్యముచేస్తూ చిత్రించెడివారు. మరియు ఈ చిత్రకారులు ఇదివరకెన్నడు చిత్రింపబడని ఆ ఖండమందలి కొంగ్రొత్త స్థలములను చిత్రింపవలయునని వువ్విళ్ళూరుచు నుండెడివారు.

1820 వరకు ఈ ఆస్ట్రేలియన్ చిత్రములు కేవలము ఐరోపియన్‌ల కొరకే చిత్రింపబడెడివి. అప్పుడప్పుడే స్థిరపడుతున్న ఆస్ట్రేలియన్‌లకి చిత్రకళ మీద మక్కువగాని, చిత్రించే సమయముగాని, చిత్రములు కొనుటకు తగిన ధనముగాని వుండెడివి గాదు. 1830, 1851 ల నడుమ ఆస్ట్రేలియన్‌లకు కళాభిరుచి అంకురించసాగినది. అక్కడక్కడ చిత్రకళా ప్రదర్శనములు జరుపబడసాగినవి. బంగారు గనులు బైటపడటముతో, నలుగురి చేతులలో డబ్బాడటమువలన కళాపోషణకూడ కొంత ప్రారంభమైనది. అయినను ఆటుపిమ్మటనేక వత్సరములకుగాని ఆస్ట్రేలియన్ చిత్రకళ స్వదేశములో బహుళ ప్రచారము పొందుటగాని, తన ప్రత్యేకతను యేర్పరుచుకొనుటగాని చేయలేక పోయినది. చిత్రకళ కేవలము చిత్రకళ కొరకేగాక కొన్ని సాంఘిక అవసరములను తీర్చుటకు వినియోగపరచబడెడిది.

1851 వ సంవత్సరము పిమ్మట ఆస్ట్రేలియన్ చిత్రకళలో మరియొక క్రొత్తపోకడ కానరాసాగినది. తమ దేశ చరిత్ర చిరస్థాయిగా నుండునట్లు చరిత్ర సంబంధమైన చిత్రములు చిత్రింపవలయునన్న ఆకాంక్ష ఆనాటి చిత్రకారులలో బయలుదేరినది. కాని వారికి పూర్వచరిత్ర లేదుకదా. చక్రవర్తులు, సంగ్రామములు అంతకన్నా లేవుగదా. అందుచేత ఆ చిత్రకారులు ఆనాడు తమ దేశములో జరుగుతున్న సాంఘిక సన్నివేశములను చిత్రింపసాగిరి. ఆ కాలమునాటి చిత్రకారులలో కొందరు ఆస్ట్రేలియాలోనే పుట్టిపెరిగినవారు. కాని ఆనాటికిఆస్ట్రేలియాలో నింకా చిత్రకళా పాఠశాలలు లేకపోవుటచే వారు చిత్రకళా శిక్షణకై ఐరోపా దేశములకు పోయెడివారు. పందొమ్మిదవ శతాబ్దపు తుదియందు ఆస్ట్రేలియా యందే చిత్రకళా పాఠశాలలు నెలకొల్పబడినను, ఆ పాఠశాలలందలి అధ్యాపకులు ఐరోపాలోనే జన్మించి, శిక్షణపొందినవారగుటచేతనో, ఐరోపియన్ చిత్రకళపై నింకా వ్యామోహము తగ్గకపోవటమువలననో, ఆస్ట్రేలియా చిత్రకారులు చిత్రకళా శిక్షణకింకను ఐరోపాకే పోయెడివారు. వారిలో కొందరు శిక్షణపిమ్మట తమ స్వదేశమునకు తిరిగివచ్చి చిత్రములు చిత్రించెడివారు. మరి కొందరు ఐరోపాలోనే వుండిపోయి తమ చిత్రకళావ్యాసంగము సాగించెడివారు. కాని

వారు స్వదేశములో వున్నను, ఐరోపాలో వున్నను అప్పటికే చిత్రకళలో ఒక ప్రత్యేకత ప్రవేశించుటవలన వారు పూర్వ చిత్రకారులవలె ఐరోపియన్ చిత్రకళకు దాసులు మాత్రము గాలేదు.

ఆ నాటి ఆస్ట్రేలియన్ చిత్రములు ఐరోయపిన్ యింప్రషనిస్టుచిత్రములను పోలియున్నను, స్వతఃసిద్ధమైన ఒక ప్రత్యేకతను గూడ కలిగి యుండెడివి. మరియు, ఆ కాలమునందే తైలవర్ణ చిత్రములు ఆస్ట్రేలియాలో బహుళప్రచారము పొందసాగినవి. ఆనాటి చిత్రకారులు తమ ప్రకృతి చిత్రములందు మానవ రూపములను గూడ చిత్రింపసాగిరి. అందుకై వారు చిత్రింపదలచుకొన్న స్థలములందు, మనుష్యులను చిత్రింప దలచుకొన్న భంగిమలలో నిలబెట్టి దానిని తదేక దీక్షతో చూస్తూ అతి సహజముగా చిత్రించెడివారు. అట్టి చిత్రకారులలో రాబర్ట్సు ప్రఖ్యాతి గాంచినాడు.

పంతొమ్మిదవ శతాబ్దపు తుదియందు ఆస్ట్రేలియన్ చిత్రకళలో సాంకేతిక చిత్రీకరణ ప్రారంభమైనది. ఈ సాంకేతిక చిత్రీకరణకొరకై ఆ నాటి చిత్రకారులు నగ్న మానవరూపముల నెక్కువగా చిత్రించెడివారు. ఇట్టి సాంకేతిక చిత్రకారులలో కాన్‌డా ముఖ్యుడు.

ఆస్ట్రేలియన్ చిత్రకారులు సిరాతోగూడ పలువిధ చిత్రములను అతి సహజముగాను తైలవర్ణ చిత్రములను పోలియుండునట్లును చిత్రించెడివారు. అట్టి చిత్రములు చిత్రించుట యందు నార్‌మన్ లింటాన్ ప్రఖ్యాతి గాంచినాడు.



మాస్టర్ లాంబ్లన్ రూపచిత్రం. చిత్రకారుడు : థామస్ లారెన్స్ (1828)

1900 నాటికి మరల ఆస్ట్రేలియన్ చిత్రకళలో ఐరోపాచిత్రకళా ఛాయ లెక్కువగా కానరాసాగినవి. ఆస్ట్రేలియన్ చిత్రకారులు పలువురు ఐరోపాలోనే స్థిరపడ సాగిరి. సుమారు 1915వ సంవత్సరము నుండి ఐరోపియన్ అధునాతన చిత్రకళ ఆస్ట్రేలియన్ చిత్రకళలోకి చొరిచేసుకొనసాగినది. ఆస్ట్రేలియన్ చిత్రకారులే కారణమువల్లనైతేనేమి, తమ చిత్రములలో ఐరోపియన్ యింప్రషనిసమ్ అవలంబించినంత త్వరగా అధునాతన చిత్రకళను అవలంబించలేదు. అందుచేత 1935 వ సంవత్సరానంతరమే ఆస్ట్రేలియన్ చిత్రకళలో అధునాతన చిత్రకళ ప్రవేశించుటకు అవకాశము లభించినది. ఆ కాలములోనే ఆస్ట్రేలియాలో చిత్రకళ బహుళప్రచారముగూడ పొందసాగినది.

(ఈ వ్యాసంలోని చిత్రాల ప్రతికృతులు శ్రీ శీలా వీర్రాజు)

# వెలుగు బాటలు

వెలగా వెంకటప్పయ్య

కలిసి బ్రతుకటానికి, కలుపుగోలుగా జీవించటానికి మానవుడు చిరకాలం నుంచీ అలవాటు చేసుకొన్నాడు. దానినే సంఘజీవనం అంటారు. సంఘజీవనానికి సహకారప్రాతిపదిక, సహకారం ఒక జీవిత విధానం. నాటినుండీ నేటివరకు ఒకరికొకరు పరస్పరం సహాయం చేసికోవటం వలననే మన సమాజం యింతగా అభివృద్ధిచెందింది.

నేడు సహకారం జీవితపు అన్ని మలుపుల్లోనూ ఉంది. సహకారమే లేకపోతే అనేక కార్యాలు అసంపూర్ణంగానే నిలిచిపోతాయి. కనుక పరిశ్రమలు, వ్యవసాయం, విద్య మొదలయిన అనేక శాఖలు యీ సహకార విధానానికి స్వాగతం చెబుతున్నాయి. అలాగే గ్రంథాలయాలు గూడ సహకార విధాన అవసరం గుర్తించి దానిని నిత్యకార్యకలాపాలలో వినియోగించుకొని సత్ఫలితాలు పొందటానికి ప్రయత్నం చేస్తున్నవి. ఆ సంబంధమయిన వివరాలు ప్రస్తుతం కొన్ని తెలుసుకొందాం. ప్రజలలో విజ్ఞాన వికాసాలను పెంపొందించే సంస్థలలో గ్రంథాలయాలు ప్రధానమైనవి. తాము బాగుపడి యితరులను బాగుపరచవలెననే పవిత్ర సంకల్పంగల గ్రంథాలయాలు ఏదోఒక రూపంలో అనాదినుంచీ ఉన్నవి. సరస్వతీ నిలయాలై కాలమాన భేదాలు, దూరతీర భేదాలు లేక మానవుని సర్వతోముఖ వికాసానికి తద్వారా విశ్వమానవ కళ్యాణానికి తోడ్పడుతున్నవి.

గ్రంథాలయం ఎంత సమగ్రమయినదయినప్పటికీ చదువరి జ్ఞానతృష్ణను తీర్చవలయు నంటే సహకార విధానానికి స్వాగతం చెప్పక తప్పదు. ఒకకోటి యిరవై లక్షల గ్రంథాలు గల మాస్కోలోని లెనిన్ స్టేట్ లైబ్రరీ, కోటి గ్రంథాలున్న వాషింగ్టన్‌లోని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్, యాభై లక్షల పుస్తకాలు గల బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీ మొదలయిన జగత్ప్రసిద్ధ గ్రంథాలయాలు సైతం సహకార విధానం వలన ఉపయోగాలు పొందుతున్నవి. సహకార విధానాన్ని అనుసరించనిదే ఏ గ్రంథాలయమూ పూర్తి ఫలితాలను యివ్వలేదంటే ఆశ్చర్యం లేదు. మనదేశం యిప్పటికీ యీ విధానాన్ని చాల తక్కువగా వినియోగించుకొంటున్నది. ఎన్నో సంవత్సరాలుగా విదేశాలలోని గ్రంథాలయాలు పుస్తకాలను ఎరువుగా యిచ్చి పుచ్చుకోవడం వలన ఎన్నో సత్ఫలితాలను పొందుతున్నారు. ఉదాహరణకు నెదర్లాండ్స్ దేశాన్ని తీసుకుందాం. సహకార విధానానికి నెదర్లాండ్స్ పెట్టింది పేరు. అచటగల పౌర గ్రంథాలయాలు, విద్యాలయ గ్రంథాలయాలు, ప్రత్యేక గ్రంథాలయాలు మొదలయిన వివిధ తరగతుల గ్రంథాలయాలు ఎల్లప్పుడు పుస్తకాలను ఎరువుగా యిచ్చి పుచ్చుకొంటాయి. చదువరి ఏ విషయంపై గ్రంథం కావాలన్నా యిట్టే సంపాదించి పెడతాయి.

అంతేగాదు. పుస్తకాల కొనుగోలు విషయంలో ఎంతోశ్రద్ధ తీసుకొంటారు. స్థానికంగా ఉన్న గ్రంథాలయాలలో ఒకేపుస్తకం పలు గ్రంథాలయాలలో ఉండకుండా, అంటే విశేషంగా డూప్లికేషన్ జరుగకుండా చూస్తారు. ముఖ్యంగా ఖరీదుగల పుస్తకాలు కొనుగోలు చేసేప్పుడు ఎంతగానో పరిశీలిస్తారు. ఇందువలను తక్కువ ఖర్చుతో ఎక్కువ మంచి గ్రంథాలు సంపాదించగలుగుతారు. బలవత్తరమయిన సహకార విధానం వారి గ్రంథాలయ పద్ధతిలో యిమిడి ఉన్నది గనకనే వారీ విధంగా చేసి సత్ఫలితాలను పొందగలుగుతున్నారు. మనం గూడా సహకార విధానాన్ని అనుసరించి విశేషంగా ప్రయోజనాన్ని పొందే అవకాశాలు లేకపోలేదు. ఇందుకు తగిన ఏర్పాట్లు కొన్ని చేసుకోవాలి. గ్రంథాలయాల పాలక వర్గములు, ప్రభుత్వము, గ్రంథాలయ సంఘాలు కలసికట్టుగా పనిచేసి సమన్వయ కృషి చేయాలి.

సహకార విధానం ఒక పటిష్ఠమయిన రీతిలో నిర్వహించవలెననుకొన్నప్పుడు అందుకు ఒక నిర్దిష్టమయిన కార్యక్రమమును సిద్ధపరచుకొనవలెను.

1. రాష్ట్రస్థాయిలోగాని, జిల్లా స్థాయిలోగాని గల గ్రంథాలయాలన్నీ ఒకయూనిట్‌గా ఏర్పడాలి. ప్రస్తుత పరిస్థితులను బట్టి ప్రయోగాత్మకంగా జిల్లాలకు ఒక యూనిట్ ఏర్పడటం సమంజసంగా ఉంటుంది. ఎరువుగా పుస్తకాలు, యితర పఠన సామగ్రి పరస్పరం యిచ్చి పుచ్చుకొనే అవకాశం జిల్లాలోని గ్రంథాలయాలవరకే పరిమితం చేయబడిఉంటుంది.

2. యూనిట్‌లో గ్రంథాలయాలు సహకార విధానాన్ని ప్రారంభించేముందుగా ఆయా గ్రంథాలయాల ప్రతినిధు లందరు సమావేశమయి అందరికీ అందుబాటులో ఉండే విధంగా కొన్ని నిబంధనలను ఏర్పరచుకోవాలి. అంతేగాక యీ ప్రతినిధులు సంవత్సరానికి ఒకసారి లేదా రెండుసార్లు సమావేశమయి ఎప్పటి కప్పుడు ఎదురౌతున్న సమస్యలను కూలంకషంగా చర్చించుకొని పరిష్కారమార్గాలు ఆలోచించాలి. తమతమ అనుభవాలను, అనుభూతులను

తరవిడి చేసుకొని ఆశాజనకమైన భవిష్యత్ కార్యక్రమానికి సోపానాలు ఏర్పరచుకోవాలి.

3. సహకార విధానం సఫలం కావాలంటే యూనిట్‌లోగల గ్రంథాలయాలలోని పుస్తకాలన్నిటికీ కలిపిన సమీకృత సూచి (యూనియన్ కేటలాగ్) ఎంతో అవసరం. ఒక నిర్ణీత ప్రాంతంలోగల రెండుగాని అంతకంటె ఎక్కువగా గాని గల పుస్తకాలయాలలోని గ్రంథాలకు నిర్ణీత విధానంతో తయారుచేసిన దానిని సమీకృత సూచి అని నిర్వచనంచేస్తారు. ఇదిచాల వ్యయ, ప్రయాసలతో కూడుకొన్న పని. గ్రంథాలయాలందు ప్రేమ, విరామమెరుగక పరిశ్రమించే సుశిక్షితులైన గ్రంథపాలకుల వలననే యీ భారమైన పని సాధ్యమవుతుంది. యూనిట్‌లో గ్రంథాలయాలు ఆర్థికంగానూ, శ్రామికంగానూ సహకరించినప్పుడే యీపని పూర్తవుతుంది.

అదృష్టవశాత్తూ ఆంధ్రదేశంలోగల ప్రసిద్ధ గ్రంథాలయాలలోని పుస్తకసంచయానికి ఒక యూనియన్ కేటలాగును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గుంటూరులోగల ప్రాంతీయ గ్రంథాలయం ద్వారా రూపొందిస్తున్నది. నాలుగయిదు సంవత్సరాలుగా నిరంతరం యీ పనిసాగుతూ నేటికి ఒక కొలిక్కి వచ్చింది. దీనిని ముద్రించే భారం గూడ ప్రభుత్వం వహిస్తుందని మనం ఆశింప వచ్చును. సహకార విధానానికి యీ కేటాలాగును పూర్తిగా వినియోగించుకొన వచ్చును. ఈ కేటలాగులో చేరని గ్రంథాలయాలు ఎవైనా ఉంటే వాటికి సంబంధించిన వివరాలు చేర్చుకొన్న యెడల యూనిట్‌కు సంబంధించిన యూనియన్ కేటలాగ్ సమగ్రము కాగలదు.

4. జిల్లా స్థాయిలో కల గ్రంథాలయ సంఘం యీ కార్యక్రమాలకు తగిన ప్రచారం చేస్తూండవలెను. సాంకేతికమైన సలహాలు, అవసరమైనపుడు ప్రణాళికలు తయారు చేస్తూండవలెను.

పై నిబంధనలు అనుసరించటంలో గ్రంథాలయాలు ఎంతో శ్రద్ధ వహించినపుడే విధానం జయప్రద మౌతుంది. ఈ విధానమును అమలుపరచటానికి గూడ మన గ్రంథాలయ పద్ధతి ఎంతో అనుకూలంగా ఉంది. నేడు ఆంధ్రప్రదేశ్‌లో జిల్లా స్థాయిలో ప్రధానంగా రెండు తరగతుల గ్రంథాలయాలు పనిచేస్తున్నాయి.

1. పౌర గ్రంథాలయాలు
2. విద్యాలయ గ్రంథాలయాలు.

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల చట్ట పరంగా ప్రతి జిల్లాలోనూ గ్రంథాలయవ్యవస్థను నిర్వహించుటకు ఏర్పడిన స్థానిక గ్రంథాలయ సంస్థ ఆధ్వర్యములో జిల్లా ప్రధానస్థానంలో జిల్లాకేంద్రగ్రంథాలయము, తాలూకా ప్రధాన స్థానములలోనూ, యితర ప్రధాన గ్రామాలలో శాఖా గ్రంథాలయాలు పనిచేస్తున్నాయి. అంతేగాక స్థానిక గ్రంథాలయ సంస్థపరంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యిచ్చేవిరాళంతో మరికొన్ని పౌర గ్రంథాలయాలు పనిచేస్తున్నాయి.

వీటితోపాటుగా పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ గ్రంథాలయాలు లేకపోలేదు. విద్యార్థులనుంచి వచ్చు రుసుము, పాలకవర్గంలోవారి విరాళము, ప్రభుత్వమువారి సహకారముతో యీ విద్యాలయాలలో గ్రంథాలయాలు విద్యార్థులకు ఉపాధ్యాయులకు ఉపయోగ పడుతుంటాయి.

విద్యాలయానికీ గ్రంథాలయానికీ ఎంతటి సంబంధం ఉందో అలాగే పై రెండు తరగతుల గ్రంథాలయాలకు అంతటి సన్నిహిత సంబంధం ఉంది. ఒకప్రాంతంలోని లేదా ఒక యూనిట్‌లోని పౌర గ్రంథాలయాలు, విద్యాలయ గ్రంథాలయాలు కలసికట్టుగా పనిచేసిన ఎడల ఎంతో అభివృద్ధిని సాధించటానికి అవకాశం ఉంది.

ఈ అదను గమనించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పౌరగ్రంథాలయశాఖవారు ఎరువు పద్ధతిమీద స్థానిక గ్రంథాలయ సంస్థవారి జిల్లాకేంద్ర గ్రంథాలయమునుండి, శాఖా గ్రంథాలయములనుండి కళాశాలల, పాఠశాలల గ్రంథాలయాలు పుస్తకాలను యిచ్చిపుచ్చుకొనే అవకాశం కల్పించారు. వాస్తవానికి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ శాసనంలోనే యిందుకు తగిన అవకాశం ఉంది.

అయితే యీ విధంగా ఒకసంస్థనుండి మరొకసంస్థ పుస్తకాలను యిచ్చిపుచ్చుకొనునపుడు— చాల జాగ్రతలు తీసుకోవాలి. సాధారణంగా యీ దిగువతెగలకు చెందిన పుస్తకాలను మాత్రం ఎరువు యిస్తూండాలి.

1. కల్పనా సాహిత్యం: వాఙ్మయంలో నవలలు, కథలు వేలాదిగా ఉంటాయి. ఏదైనా ఒక భాషలోగల నవలలు, కథలు మొత్తం తెప్పించటం ఏ గ్రంథాలయానికైనా సాధ్యముకాని పని. ప్రసిద్ధరచయితల కల్పనా సాహిత్య మంతా సాధించాలన్నప్పటికీ కష్టసాధ్యమయిన పని. కనుక చదువరి కావాలనిన గ్రంథాన్ని గ్రంథాలయంలో లేని పక్షంలో సహకార విధానంవలన యితర గ్రంథాలయాలనుండి తెప్పించి యివ్వవచ్చును.

*2. పాఠ్య గ్రంథాలు*

బోధనకు ఉపయోగించే పాఠ్యగ్రంథాలలో అనేక ముద్రణలుంటాయి. ఒకేరచయిత వ్రాసినప్పటికీ టీకా టిప్పణులలో భేదాలుంటాయి. పాఠాంతరాలుంటాయి.

పాఠశాలలోనూ కళాశాలలోనూగల గ్రంథాలయాలు అన్నిరకాల ముద్రణాలనుతెప్పించటం సాధ్యంకాదు. ఒకరినుంచి మరొకరు అరువుద్వారా తెప్పించుకోవటంవలన అన్ని రకాల ముద్రలను పరిశీలించే అవకాశం కలుగుతుంది.

3. పత్రికల సంపుటాలు:

పత్రికల సంఖ్య ఎప్పుడూ అపారంగా ఉంటుంది. ముఖ్యమయిన పత్రికలను సంపుటాలుగా చేసేఅలవాటు చాలాకొద్ది గ్రంథాలయాలకే ఉంటుంది. ఈ సంపుటాల విలువ అమూల్యమయినది. ఈసంపుటాలను నిలువ చేసిన వారినుంచి అరువు తెచ్చుకొన్న ఎడల చదువరులకు మరింత ప్రయోజనం చేకూర్చవచ్చును.

పైన వివరించిన మూడు తరగతుల పుస్తకాలను ఎరువు ఇచ్చి పుచ్చుకునేటప్పుడు అవి మంచి స్థితిలో ఉన్నప్పుడే యీ విస్తరణ కార్యక్రమాలకు వినియోగించాలి. అయితే యితరులకు ఎరువివ్వ గూడనివి కొన్ని పుస్తకాలు లేకపోలేదు.

1. ఎంతసొమ్మువెచ్చించినా సంపాదించటానికి సాధ్యంకాని గ్రంథాలు ఎరువు లివ్వరాదు.

2. మన గ్రంథాలయంలోనే విశేషంగా వాడుకలోగల గ్రంథాలు యితర గ్రంథాలయాలకు ఎరువివ్వటం మంచిదిగాదు. ఎందుచేతంటే ముందుగా మన గ్రంథాలయమునకు వచ్చు చదువరులకు అవకాశం యిచ్చిన పిదపనే యితరుల పని చూడాలి.

3. కొన్ని పుస్తకాలలో ఏ మాత్రం పటుత్వం ఉండదు. కాగితంలో శక్తి నశిస్తుంది. పేజీ త్రిప్పితేనే తునాతునకలై పోతుంది ఇలాంటి పుస్తకాలు బయటికి పోనివ్వరాదు.

అయితే అమెరికా, ఇంగ్లండ్ మొదలయిన దేశాలలో అరువివ్వ గూడని పై విధమయిన పుస్తకాలను చదువరి ఖర్చుమీద మైక్రో ఫిల్ముగాని, మైక్రోకార్డుమీదగాని పునర్ముద్రించి యిస్తారు. ఇందుకు ఖర్చు వందపేజీల పుస్తకానికి మూడు రూపాయల కంటె ఎక్కువగా ఉండదు. ఇలాటి అపురూపమైన ఏర్పాట్లు మనదేశంలోని పెద్ద గ్రంథాలయాలలో ప్రారంభమయింది.

ఆంధ్రదేశంలోని గ్రంథాలయ కార్యకర్తలు పై సూచనలను దృష్టిలో ఉంచుకొని గ్రంథాలయాలలో సహకార విధానానికి సత్వరం స్వాగతం చెప్పి విజ్ఞాన ప్రచారానికి దోహదం చెయ్యడం ప్రతి ప్రగతివాదీ చెయ్యవలసిన కర్తవ్యం.

## ప్రభుత్వ నిర్ణయాలు

★ రెండు ఎకరాల మాగాణి లేక అయిదు ఎకరాల మెట్టకంటే తక్కువ భూవసతికల రైతులకు హామీపద్ధతిపై వడ్డీలేకుండా తక్కావీ ఋణాలు ఇవ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

★ వృద్ధులకు పింఛను ఇవ్వడానికి సంబంధించిన పథకాన్ని సడలించి, 60 సంవత్సరాల వయస్సు గల వికలాంగులైనవారికి కూడా ఈ పథకాన్ని వర్తింపజేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

★ ఉన్నత పాఠశాల విద్యార్థులకు ఇచ్చే మెరిట్ స్కాలర్‌షిప్పుల సంఖ్యను 246 నుంచి 7500 కు హెచ్చించడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

★ రాష్ట్రంలో నిర్మించిన ఉత్తమ చిత్రాలకు బహుమతులు ఇవ్వడంద్వారా, కొత్త స్టూడియోలను నెలకొల్పడానికి ఋణాలు మంజూరు చేయడంద్వారా రాష్ట్రంలో చలనచిత్ర పరిశ్రమను ప్రోత్సహించడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

★ సాహసకృత్యాలకుగాను వీర, మహావీర, పరమవీర చక్రాలను పొందే ఆంధ్రప్రదేశ్ వాస్తవ్యులు రాష్ట్ర ప్రభుత్వ అవార్డులను కూడా పొందుతారు

# ఆహ్వానము

వి. పాలవెల్లి

వైభవోన్నత శిఖరాల పరిఢవిల్ల
మాతృదేశ చరిత్రలో మనదు నామ
ములు స్థిరతనొంది యుత్సాహ ముజ్జ్వలింప
తరలి రండోయి ! యువక రత్నమ్ములార !

దేశరక్షణ విధియందు దీక్షతోడ
పోరు సాగించి పొడిచిన పొడువబడిన
శౌర్యవంతమై భాసించి సౌఖ్య మొసగు
తరలి రండోయి ! యువక రత్నమ్ములార !

పాఠశాల కళాశాల భవనమందు
వివిధశాస్త్ర పరిజ్ఞాన విషయ మరసి
తీవ్రముగ కృషి యొనరించి తీరవలయు
తరలి రండోయి ! యువక రత్నమ్ములార !

గాఢ గాఢముఁ ద్రచ్చగ జ్ఞానఖనుల
ననుదినము పరిశ్రమమును నవిరళముగ
జేసి వెలికి దీయగ రత్నరాసు లవని
తరలి రండోయి ! యువక రత్నమ్ములార !

స్వీయకర్తవ్య మార్గాన స్వేచ్ఛ బుద్ధి
శీలమే నిజసౌఖ్య సంసిద్ధి గూర్ప
జంకు లేకయె ముందుకు సాగిపోవ
తరలి రండోయి ! యువక రత్నమ్ములార !

మాసిపోవని అందమై వాసి గాంచు
మానవుని నడువడియె పో ! మహిని యెందు
శీలవంతుడె సృష్టించు నేల దివము
తరలి రండోయి ! యువక రత్నమ్ములార !

చేయి చేయియు గలుపుచు జేరవారి
మనసు మనసులు గలుపుచు మమత లూరి
యెట్టి కష్టంబునైనను నెట్టివేసి
తరలి రండోయి ! యువక రత్నమ్ములార !

పయనముల బడలిక లెక్కవదలి కదలి
జీవితానంద మరయంగ, చిత్రమైన
దేశదేశాల శాంతికై దీక్షబూని
తరలి రండోయి ! యువక రత్నమ్ములార !

(J. Montgomary గారి "Aspirations of Youth" ఆధారం.)

---

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1963 నవంబరు నెలలో దిగువ పేర్కొన్న సంస్థలు, గ్రామాలలో కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పారు :-

హైద్రాబాదు జిల్లా : కుమార్ బండ, ఘూడెర, కందుకూరు; మెదక్ జిల్లా : కర్త్వేర్ పంచాయతీ; ఆదిలాబాదు జిల్లా : మర్రిగూడ, గజ్జాం, కొమ్మోడి, కొస్తాపూర్, ములకాల్; కరీంనగర్ జిల్లా: మల్లాపూర్; శ్రీకాకుళంజిల్లా: ఆముదాలవలస, రామలింగాపురం, ఎండువ, పిరిపి, ఇటకర్లపల్లి, కరకం, పత్తికాయవలస, ఎరపడుగురండి, దుగ్గుపురం, నేరడి, బత్తిలి, పెదదిపిలి, బాలేరు, గులుమూరు, కొర్లవలస, తాళతంపర, సారధి, పానుగూటివలస, పెంట, మర్రివలస, అవలింగి, లింగాలవలస, సోమగండి, మాటుమూరు, ఆంధ్ర, పలగార, వెలగవలస, సీతిల్లి పెద్దవలస, నారాయణవలస, కురపం జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల, జిల్లా సమాచార కేంద్రం, శ్రీకాకుళం; విశాఖపట్నం జిల్లా : తునివలస, బొత్తనపూడి అగ్రహారం, మామిడిపాలెం, గండిగుండం, పెదగండిలి, పరదేశిపాలెం; గుంటూరు జిల్లా : కార్మిక శిబిరం, నాగార్జునసాగర్ కాలువలు, కారెంపూడి, జిల్లా సమాచార కేంద్రం, గుంటూరు, మల్లవరప్పాడు, రాంకూరు, ఉప్పుగుండం, అన్నంగి, పొందూరు, ఎండ్లూరు, ఇనమన మెల్లూరు-1, ఇనమన మెల్లూరు-2. కందలూరు; చిత్తూరు జిల్లా : కంగుండి, కొత్తపల్లి.



స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, భారత దేశం వ్యవసాయానికి ప్రాధాన్యం ఇస్తూ, ఎక్కువ పండించడానికి తగిన సదుపాయాలు తాను చేస్తూ, రాష్ట్రాల ద్వారా కూడా చేయిస్తూ వచ్చింది. అయినప్పటికీ కావలసినంత ఎక్కువ పంట పండించలేక పోయింది. భారత ప్రభుత్వం ఈ విషయంలో ఎక్కువ శ్రద్ధ తీసుకొని, ఫోర్డ్ ఫౌండేషను నిపుణులతో సంప్రదించి, వారి సలహా ప్రకారం అధికోత్పత్తికి గాను ఒక ప్రణాళికను తయారుచేసింది. తర్వాత ఫోర్డు ఫౌండేషను ధన సహాయంతో ఈ కొత్త ప్రణాళికను రాష్ట్రానికొక జిల్లా చొప్పున 7 రాష్ట్రాలలో ప్రారంభించారు. దీనినే సాంద్ర వ్యవసాయ పథకం అంటారు. దీనిని అమలు పరిచేటప్పుడు ముఖ్యంగా, నీటి సదుపాయం, సారవంతమైన భూమి, మంచి వాతావరణం కలిగిన ప్రదేశం, ఎక్కువ ఉత్సాహవంతులైన కర్షకులు గల జిల్లాలనే ఎంచుకున్నారు. మన రాష్ట్రం విషయంలో పశ్చిమ గోదావరి జిల్లా ఎంపిక చేయబడింది.

ఈ సాంద్ర వ్యవసాయ పథకం లేదా ప్యాకేజీ పథకం పశ్చిమ గోదావరి జిల్లాలో 1960 వ సంవత్సరం దాళ్వాపంట కాలంలో ప్రారంభించబడింది. ఇది జిల్లాస్థాయిలో పరిషత్ ద్వారానూ, బ్లాకుస్థాయిలో పంచాయతీ సమితి ద్వారానూ నిర్వహించబడుతున్నది. మొత్తం 25 బ్లాకులకు మొదట 20 బ్లాకులలో వరి చెరకు, అరటి, మిరప పంటలకు ఇది వర్తింపచేయబడింది. అక్కడి వరిసాగు విస్తీర్ణంలో మొదటి సంవత్సరం నూటికి 40 వంతులు, రెండవ సంవత్సరము 75 వంతులు, మూడవ సంవత్సరంలో పూర్తిగా ఈ పథకం క్రిందకు వచ్చాయి. దరిమిలా పొగాకు, పళ్ళు, కూరగాయలు వరి పొలాల్లో మొదటి పంట తర్వాత వేరుశనగ, కొబ్బరి పంటలుకూడా ఈ కార్యక్రమంలో చేర్చబడ్డాయి. ఈ ప్రణాళిక 1963-64 ఖరీఫ్ నుంచి పశ్చిమ గోదావరి జిల్లాలోని మొత్తం 25 బ్లాకులలోను అమలు జరపబడుతున్నది.

ఈ కార్యక్రమంలో ప్రతిరైతు కమతానికి తగిన "సేద్య ప్రణాళిక" ఒకటి మొదట తయారు చేయబడుతుంది. దాని



ప్రకారం మేలురకపు విత్తనాలు, ఎరువులు, క్రిమి కీటకాలకుమందులు, సాగుపనులకు కావలసిన ఋణం మొదలయినవి అందుబాటులో ఉండేటట్లుగా దగ్గరలోఉన్న సహకార సంఘాల ద్వారా ఏర్పాటుచేయబడుతున్నాయి. ఎప్పటికప్పుడు సలహాలిస్తూ, సాగులో క్రొత్త పద్ధతులను అమలు పరచే మార్గాలను చూపించి బోధించడానికి వ్యవసాయ ప్రచారక ఉద్యోగులున్నారు. ప్రతి కమతంలో సేద్య ప్రణాళికను అమలు పరచటానికి కావలసిన సామగ్రి, సాంకేతిక సహాయం సకాలంలో సమృద్ధిగా అందజేసి అధికోత్పత్తిని సాధించాలని ఈ పథకం ముఖ్యాశయం.

డా॥ బి. వి. రెడ్డి

చెప్పితే విన్నదానికంటే చేసినది చూస్తే నమ్మకం ఎక్కువ. రైతులు వారివారి సేద్య ప్రణాళికలను దృఢ నిశ్చయంతో ఆచరణలో పెట్టడానికి వీలుగా చిన్న, పెద్ద, మధ్య తరహా కమతాలలో ప్యాకేజి పద్ధతుల్ని ఆచరణలో పెట్టి చూపించే ఆదర్శ క్షేత్రాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ విధంగా ప్రతి బ్లాకులో 10 వివిధ రకాల కమతాలలో ఏర్పాటు చేయబడ్డాయి. పంటకు సాగునీటి ఏర్పాట్లు ఎంత అవసరమో, మురుగునీరు పోయే పరిస్థితులు కూడా అంతే అవసరం. పశ్చిమ గోదావరి జిల్లాలో నీటి వసతులు ఎక్కువగా ఉన్నప్పటికీ మురుగు నీరు పోయే పరిస్థితులు తక్కువ. రైతులు ప్యాకేజీ పథకాన్ని ఆచరణలో పెట్టి పంటను పెంచాలంటే ఈ జిల్లాలో మురుగు నీరు పోయే కాలువల్ని బాగుపర్చాలి.

మూడవ పంచవర్ష ప్రణాళికా కాలంలో రెండుకోట్ల రూపాయల ఖర్చుతో దీన్ని కొనసాగించడానికి ఒక పథకాన్ని తయారు చేశారు. ఇప్పటిదాకా 20లక్షల రూపాయలు ఈ పథకం క్రింద మురుగు కాలవల మరమ్మతుకని వెచ్చించబడ్డాయి. ఈ సంవత్సరానికి 37 లక్షల రూపాయలు కేటాయించబడింది.

మంచిపంట సాగుకు పనిముట్లు కూడా ఎంతో అవసరం. ఆధునిక వ్యవసాయ పనిముట్లు- అంటే తేలికరకపు రెక్క నాగళ్లు, రిడ్జిమడకలు, వీడర్లు - ప్రతి బ్లాకులోను రైతులకు సరఫరా చేయబడుతున్నాయి. ఈ సంవత్సరం ప్రతి బ్లాకులో ఒక్కొక్క ట్రాక్టరూ, దానికి అనుగుణంగా పనిముట్లూ సరఫరా చేయడానికి నిశ్చయించారు.

జిల్లాలోని వేర్వేరు పంటలకు, ప్రాంతాలకు పనికివచ్చే పనిముట్లను పరీక్షించి రైతులకు తగిన సలహాలను యిస్తూ, బ్లాకులలో వున్న జీపులను, యివ్వబోయే ట్రాక్టర్లను

(మిగతా 28 వ పేజీలో)

# సంఘ సంస్కరణ కవిత్వం - 3

డా॥ సి. నారాయణరెడ్డి

గాంధీగారు నడిపిన ఉద్యమాల్లో అస్పృశ్యతా నివారణ మొకటి. శ్వపచులుగా, పంచములుగా, అస్పృశ్యులుగా హిందూ సంఘంచేత నిరాదృతులైన వారికి 'హరిజను'లనే పేరును రూఢం చేసింది గాంధీగారే. అయితే గాంధీగారి ప్రభావం భారతదేశమంతటా ఎంత బలీయంగా ఉన్నా తరాలుగా వేళ్ళు పాతుకొనివున్న అస్పృశ్యతా సమస్య నిర్మూలం కాకపోయింది. ఈ స్థితిలో తెలుగు దేశంలోని నవ్యకవులు అస్పృశ్యతా నివారణ సిద్ధాంతాన్ని కావ్యకాహళముల ద్వారా ఉద్ఘోషించడానికి పూనుకున్నారు. కవిత్వేతర ప్రక్రియల్లో ఉన్నవ వారి మాలపల్లి హరిజన సమస్య వస్తువుగా తీసుకొని వ్రాయబడిన కళాఖండం. గాంధీజీ హరిజనోద్యమాన్ని ప్రారంభించే ముందే గురజాడ వారు 'లవణరాజు కల' లో 'మంచి యన్నది మాలయైతే మాలనే యగుదున్' అని ఉద్ఘాటించారు. గురజాడ తర్వాత 1920 నుంచి ఈ ఉద్యమం గాంధీగారి చేతి చలవవల్ల భారతదేశ మంతటా వ్యాపించింది. తెలుగు కవులనేకులు హరిజనోద్ధరణనూ హరిజన దేవాలయ ప్రవేశాన్నీ సమర్థిస్తూ గీతాలూ, పద్యాలూ వ్రాశారు. వేంకట పార్వతీశ్వర కవులు 'పంచమాభినందనము' అనే ఖండికలో

'మమత దప్పిన యూతడు మాలగాక<br>
మాటదప్పిన యాతడు మాలగాక<br>
అన్నెమును పున్నె మెఱుగని యట్టి మాల<br>
మాలయే? దేవుమెడ పూలమాలగాక.'1

అని అస్పృశ్యతా నివారణకు గొంతెత్తారు.

బ్రహ్మభట్ట పట్టాభిరామశర్మగారు

"మాలలు మాలలా! భరత<br>
మాతృగళస్థ చిరత్నరత్న సం<br>
లాలిత మాల; లాంధ్రమహి<br>
శాకచ కల్పిత నవ్యమల్లికా<br>
మాల, లనార్య సంతతి వి<br>
మాన శిరోగ్ర లసత్పతాకినీ<br>
మాలలుగాని, వట్టి కసుమాలపు<br>
మాలలు గారు కారిలన్"2

అంటూ పంచమోద్ధరణకు కల మెత్తారు.

మంగిపూడి వెంకటశర్మగారు 'నిరుద్ధ భారతము' అనేపేర అస్పృశ్యతా ఖండన కావ్యమునే రచించారు. పంచములు 'గొఱ్ఱె మందలో వంచినమై చరించు నల వ్యాఘ్ర కిశోరము రీతి' అగ్రవర్ణుల చేత వంచితులయ్యారని వాపోయారు.

'వ్యాసమునిచంద్రు గన్న పరాశరుండు<br>
మాలదానికి బుట్టి బ్రహ్మర్షి యయ్యె<br>
వేశ్యకును బుట్టి మాలెత బెండ్లియాడి,<br>
యా వసిష్ఠ మహర్షి బ్రహ్మర్షి యయ్యె

అంటూ పంచముల్ని సమర్థించడానికి పౌరాణికాధారాలను త్రవ్వి తండముల కెత్తారు.

హరిజనులు దేవాలయ ప్రవేశార్హత లేక కుమిలిపోయిన స్థితిని, వారి నివేదన రూపంలో కొందరు కవులు గీతాలు రచించారు. పురిపండా అప్పలస్వామిగారి గీతం చూడండి.

"గుడిలోని దైవమా ఆలించవోయి<br>
గుడిలోని దయ్యమా పైకి రావోయి<br>
నీ పాద పూజకై వెదకితెచ్చిన పూలు<br>
నీపాద సేవకై నింపితెచ్చిన నీళ్ళు<br>
పనికి రావంటారు<br>
మైలపడె నంటారు॥ ॥గుడి॥<br>
మాల మెట్టిన నేల మాలముట్టిన నీరు<br>
మాల పాడిన పాట మాల లాడిన మాట<br>
మైలపడె నంటారు<br>
పనికిరా దంటారు॥"3 ॥గుడి॥

ఈ గీతంలో మాలల కున్న భక్తి తాత్పర్యాలూ, వారికి సమాజం చేసే అవరోధాలూ చిత్రింపబడినవి.

హరిజన దేవాలయ ప్రవేశ విషయమై, అస్పృశ్యతా నివారణ విషయమై, ఇటీవలి కాలంలో — ముఖ్యంగా 1945—55ల నడుమ అనేక గీతాలూ, ఖండకావ్యాలూ వెలువడినవి. వాటి నన్నిటిని తడిమే కంటె అన్నిటిలో తలమానికం లాంటి 'గుడిగంటలు' అనే ఖండకావ్యం గురించి ముచ్చటించడం సముచితమని భావిస్తున్నాను.

'గుడిగంటలు' కాటూరి వెంకటేశ్వరరావుగారు పద్యాల్లో వ్రాసిన ఖండకృతి.

---

1. కావ్యకుసుమావళి : ప్రథమభాగము. 2. ఆంధ్రపత్రిక : 1920 ఉగాది సంచిక

3 గుడిలోని దైవమా ఆంధ్రభూమి 1933 జూన్

ఈకావ్యంలో కవిలక్షలాది హరిజనుల ముక్త కంఠం నుంచి వెలువడిన వేదనాస్వరాలకు శబ్దరూపం కల్పించి, ఏడుకొండల మీద 'శ్రీ నీళలు జోలపాడ శయనించిన దేవర'కు నివేదించాడు. కవి స్వయంగా హరిజనులతో పొందిన తాదాత్మ్యం ఈ కావ్యంలో గోచరిస్తుంది. హజారపు కొల్వు వాకిట కూడిన హరిజనులకు ద్వారకవాటాలు తెరిపించవలసిందిగా కవి తానుగా భగవంతునికి విన్నవించాడు. ఏ మాలడు ఆలను గాచి, క్షీరములు పిదికి నీకర్పిస్తాడో, ఎవడు తాను పండించిన ధాన్యాన్ని నీగరిసెల్లో నింపుతాడో, ఎవడు ఒక్కప్రొద్దు లిడి ముప్పొద్దు నిన్నర్చిస్తాడో, అట్టివానికి మోముచూపవెందుకని ఏడుకొండలవాణ్ణి సూటిగా ప్రశ్నించాడు. హరిజనులకుండే దైవభక్తిని ఇంకా ఈవిధంగా వెంకటేశునికి విన్నవించాడు.

'తిన్నాడొ పస్తులే యున్నాడొ, ముప్పొద్దు
గుడువబెట్టును నీకు కడుపునిండ
కట్టెనో మైగోచి పెట్టెనో, దువ్వలు
వలువెచ్చి నీకిచ్చు తలకు మొలకు
నీరాడెనో ధూళి పారాడెనో, సుగంధి
నీరమ్ము లార్చు నిన్ రేపుమాపు
ఎండెనో తడిసెనో, ఎండవానలు సోక
కుండ నీకిడు గుళ్ళు గోపురములు
నేడు కాదుగదా యితం దూడిగమ్ము
సలుపు; టొకనాడు కోరిక తెలియనడుగ;
వడుగవచ్చిన గుడి దూరి గడియ వైచి
కూరుచుంటివి కొండెక్కి గొప్పదొరవు.'

ఈ పద్యంలో కవి హరిజనుల భక్తి ప్రపత్తిని వ్యాజస్తుతిగర్భితంగా నివేదించాడు. ఇంతలో రమారమణుని అంఘ్రిసరోజయుగ దర్శనం కలిగింది. హరిజనులు-పిల్లలూ, పాపలూ, ఆల్మగలూ, వృద్ధులూ-శ్రీపాద దర్శనంతో చరితార్థులయ్యారు. భక్తి ప్రధానమైన రచనగా భాసించినా దీనిలోని వస్తువు హరిజనులకు సంబంధించిందే. ఆ హరిజనోద్ధరణ సమస్య గాంధీయదృక్పథ సంబంధియే యని వేరే చెప్పనక్కరలేదు.

కాటూరివారి పౌలస్త్య హృదయము అనే కావ్యంలో గూడా రేఖామాత్రంగా గాంధీతత్త్వ ప్రభావమే ఉంది. ఈ కావ్యంలో రావణుడు ద్వేషభక్తి ద్వారా రాముణ్ణి దర్శించి సాయుజ్యం పొందినట్లు చిత్రింపబడింది. ఇది అపూర్వ విషయం. రాముడు సాగరతీరంలో విడిది చేశా డన్న వృత్తాంతాన్ని వినిపించిన సముద్రునితో రావణుడన్న క్రింది పద్యంలో గాంధీతత్త్వం చక్కగా స్ఫురిస్తుంది.

''చూడుము నెచ్చెలీ! విభుని
జూచితి వేకద! చెప్పుమెట్టు లు
న్నాడొ రఘూద్వహుండు; లల
నా విరహవ్యథ గ్రాగి చిక్కియు
న్నాడొ? దశాస్య కంఠదళనప్రవ
ణాగ్రహవృత్తి వెల్గుచు
న్నాడొ? అధిజ్యధన్వ దరు
ణద్యుతిరంజితనేత్రకోణుడై.''

గాంధీజీ దృష్టిలో శత్రువులు లేరు. ఆయన కందరు మిత్రులే- జగత్తు సర్వం ఆయన దృష్టికి ప్రేమమయంగా, పరమేశ్వర మయంగా భాసించింది. లోక విద్రావణుడైన రావణునికి గూడ రాముడు మనోభిరాముడైనాడు. ఆయన చేతిలో మడిసిపోవడము అతని జీవితధ్యేయం. అలాగని రాముని కాళ్ళమీద పడడానికి ఇతడు రాయో రప్పో కాదు (శిలా రూపంలోని అహల్య); కోతి కాదు (సుగ్రీవాదులు); గ్రద్దకాదు (జటాయువు). పోరులోతప్ప అతని చేత మరణించడానికి వీలులేదు. అందు చేతనే రావణుడీ 'ద్వేషభక్తి' మార్గాన్ని అనుసరించాడు. ఈ కావ్యం జీవునికీ పరమాత్మకూ ఉండే విలక్షణ బంధాన్ని దృష్టిలో పెట్టుకొని వ్రాయబడింది. అంటే ప్రధానంగా ఇది భక్తి రచన. కాని రావణుని మనస్తత్త్వ విశ్లేషణం చేస్తే గాంధీతత్త్వచ్ఛాయలు కనిపిస్తుంటాయి.

ఇంతవరకు సంఘ సంస్కరణ కవిత్వంలో ముఖ్యమైన అంగాలను గూర్చి వివరించాను. ఇవికాక మద్యపాన నిరసనం, వ్యభిచార నిరసనం మొదలైన వాటిని గూర్చి అనేక గేయాలు వెలువడ్డాయి. ముఖ్యంగా మద్యపాన నిషేధం గురించి వ్రాసిన గీతాల కంతులేదు. వీటిల్లో దాదాపు అన్నిగేయాలూ ప్రచార పరిధిలోనే ఉండిపోయాయి. ఉన్న వాటిల్లో కొంచెం మెరుగ్గా ఉన్న గరిమెళ్ళ గీతాన్ని ఉదాహరించి ఈ విషయం ఇంతటితో ముగిస్తాను.

'కల్లు త్రాగబోకు- కడుపు మాడ్చుకోకు
నీ యిల్లు గుల్ల సేయకోరి తమ్ముడ-
పిల్లాజెల్లాలేడ్వ- తల్లీదండ్రులు వగవ
నీ ముల్లె వ్యర్థము సేయకోరి తమ్ముడ-
ఇల్లాలు సురుపొంద- ఇతరు లెల్లరు తిట్ట
కల్లు త్రాగబోకురోరి తమ్ముడా-

ఈ విధంగా సుదీర్ఘంగా సాగిపోయిందీ గీతం.

# గ్రామస్తులకు విలువైన ఆహారం

కె. నాగభూషణరెడ్డి

"ఆరోగ్య పరిరక్షణకు ఆహారం అవసరం" నిజమే. మనం తీసుకునే ఆహారం మనం ఆరోగ్యాన్ని కాపాడాలి. కాని మనం తీసుకునే ఆహారమంతా మన ఆరోగ్యాన్ని కాపాడుతుందనడంలో నిజం లేదు. ఒకరి ఆరోగ్యం మెరుగు పడడం, పాడు కావడం అనేది అతను తీసుకునే ఆహారం మీద ఆధారపడి వుంటుంది. అంటు వ్యాధులు, ప్రమాదాలు కాక సాధారణంగా సంభవించే చావులు, రోగాలలో 90 శాతం ఆహారంలో లోపం వల్ల వస్తాయని సర్ విలియం ఓస్లెర్ అభిప్రాయం. ఆరోగ్యాన్ని మెరుగు పరచడమే ప్రధానంగా గల ఆహారమే సరియైన ఆహారం. జబ్బులు కల్గించడమే ప్రధానంగా గల ఆహారమే చెడు ఆహారం అని సర్ రాబర్ట్ మెక్‌కారిసన్ అన్నారు. కాని మనలో ఎంత మంది సరియైన ఆహారాన్ని తీసుకుంటున్నారు? ఎంత మందికి అలాంటి ఆహారాన్ని తీసుకోవడానికి సాధ్యమౌతుంది? తల్లులకు, గర్భిణీ స్త్రీలకు, చంటి పిల్లలకు తప్పని సరిగా అన్ని పోషక పదార్థాలూ గల సంపూర్ణ ఆహారం అవసరం. దీన్ని సాధించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యునెసెఫ్; ఆహార, వ్యవసాయ సంస్థ; ప్రపంచ ఆరోగ్య సంస్థల సహకారంతో రాష్ట్రంలో కొన్ని నిర్ణయించిన బ్లాకుల్లో విస్తృతీకృత పౌష్టికాహార కార్యక్రమాన్ని 1960-61 సం॥లో ప్రారంభించింది.

కోళ్ళు, కోడిగ్రుడ్లు, చేపలు, పండ్లు, కాయగూరలు మొదలయిన పుష్టికరమైన ఆహారాన్ని గ్రామాలలోను, పాఠశాలలలోను అధికంగా ఉత్పత్తి అయ్యేటట్టు చూడడం; ఈ రకంగా పండించిన పౌష్టికాహారాన్ని స్త్రీల సంఘాలద్వారా గాని, లేదా మరి ఏ యితర సమాజ బృందాలద్వారాగాని గ్రామంలోని గర్భిణీ స్త్రీల, చంటిపిల్లల తల్లుల, చంటిపిల్లల ఆరోగ్యాన్ని మెరుగుపరిచేందుకు పంపిణీ చేయడం; పాఠశాలల ద్వారా, క్లబ్బుల ద్వారా, తల్లులద్వారా, ఆరోగ్యశాఖకు సంబంధించిన వ్యక్తులద్వారా యీ పౌష్టికాహారాన్ని గురించీ, వాటిని ఉత్పత్తి చేసే విధానాలను గురించీ గ్రామస్తులకు తెలియజెప్పడం; పై పనులకు అవసరమయిన వివిధవ్యక్తులకు శిక్షణ యివ్వడం ఈ విస్తృతీకృత పౌష్టికాహార కార్యక్రమం యొక్క ముఖ్యోద్దేశం.

ఈ పథకం క్రింద యునెసెఫ్ సాంకేతిక సహాయాన్ని, పరికరాలను, స్టయిపెండ్లకు, పర్యటనలకు 2,17,000 షిల్లింగుల మేరకు ఆర్థికసహాయాన్ని యిస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వం ఈ పథకాన్ని మూడేళ్ళపాటు నిర్వహించడానికి అవృత ఖర్చు క్రింద రూ.14,94,336లను, అనావృత ఖర్చు క్రింద రూ. 15,88,350 లను మంజూరు చేసింది.

ఈ పథకం 1960-61 సం॥లో ఆదిలో రాష్ట్రంలోని నాలుగు సమితి బ్లాకులలో ప్రారంభించబడి ఆ తర్వాత 1961-62లో 12 సమితి బ్లాకులు ఆవరించియున్న 120 గ్రామాలలో విస్తరింపజేయబడి ఆ పైన 1962-63 లో 20 సమితి బ్లాకులు (జిల్లాకు ఒక్కొక్క బ్లాకు చొప్పున) ఆవరించివున్న 200 గ్రామాలకు విస్తృతీకరింపబడినది.

కృష్ణాజిల్లాలో విస్తృతీకృత పౌష్టికాహార కార్యక్రమం 1962-63 సం॥ కాలంలో అమలు పరచడానికి నూజివీడు సమితి బ్లాకు ఎన్నిక చేయబడింది. ఆ తర్వాత అది మరిమూడేళ్ళపాటు పొడిగించబడుతుంది. నూజివీడు సమితిబ్లాకులో యీ పథకం యీదిగువ పేర్కొన్న పది గ్రామాలలో అమలు జరుగుతున్నది. 1. నూజువీడు, 2. ఈనామదళ, 3. రవిచెర్ల, 4. గొల్లపల్లి, 5. ఈదర, 6. బాపులపాడు, 7. అడివినక్కలం, 8. అగిరిపల్లి, 9. సురవరం, 10. కృష్ణవరం.

ఒక్కొక్క గ్రామంలోనూ 15 మంది గర్భిణీస్త్రీలు, 30 మంది పాఠశాలకు వెళ్ళగలిగే వయసులేని చంటిపిల్లలు చొప్పున పై పది గ్రామాలలోనూ మొత్తం 450 మంది యీ పథకం ద్వారా లాభాన్ని పొందడానికి ఎన్నిక చేయబడ్డారు. పై నాలుగువందలయాభై మందికి పౌష్టికాహారం యివ్వబడుతుంది.

పౌష్టికాహారం కావాలనుకున్న ఈ ప్రాంతంవాళ్ళు, సర్వసాధారణంగా

తీసుకునే బియ్యం, కాయధాన్యాలే కాక కాయగూరలు, పాలు, చేపలు, గ్రుడ్లు మొదలయిన వాటినికూడా తప్పనిసరిగా తీసుకోవాలి. విస్తృతీకృత పౌష్టికాహార కార్యక్రమం క్రింద నూజివీడు సమితి బ్లాకులోని పైన పేర్కొన్న గ్రామాలలో లాభం పొందే 450 మందికి వారి ఆహారంలో చేపలు, కాయగూరలు, పాలు చేర్చడానికి తగిన చర్యలు తీసుకోవడం జరిగింది.

తాజా కూరగాయలు పండించడానికని ఎన్నుకోబడిన గ్రామాలతాలూకు ఆయా పంచాయతీలు ఉదారంగాయిచ్చిన స్థలాలలో పాఠశాలల తోటలు పెంచబడుతున్నాయి. ఈ తోటల్లో టమాటా, వంకాయలు, బెండ, చిక్కుడు, బీర యితర తీగకాయలు పెంచడం జరుగుతున్నది. పాఠశాలల ఉపాధ్యాయులకు అగిరిపల్లిలో పదిహేను రోజులపాటు తోటపనిలో తోటపనికి సంబంధించిన అసిస్టెంటు శిక్షణ యిచ్చారు. ఈ తోటలన్నిటిలోనూ వీటిని సంరక్షించడానికి సంయుక్త తోటమాలి, వాచ్‌మన్‌లను ఏర్పాటుచేయడం జరిగింది. యునెసెఫ్ వారు యిచ్చిన 4 ఆయిలు ఇంజన్లను రావిచెర్ల, కృష్ణవరం, సురవరం, గొల్లపల్లిలలో బావులకు తగిలించడం జరిగింది. మరొక ఆయిలు యింజను యీనామదళలోను, నూజువీడు, బాపులపాడు, అగిరిపల్లి, ఈదర, అడివినక్కలం గ్రామాలకు అయిదు ఎలక్ట్రిక్ మోటారులను 1963 సంవత్సరాంతానికి యునెసెఫ్ అందజేయవచ్చు. ఈ ఆయిలు ఇంజనులు, ఎలక్ట్రిక్ మోటారు బావులలోని నీటిని తోటలలోకి తోడటానికి ఉపయోగించబడతాయి. 1962-63 సం॥లో బావుల త్రవ్వకానికి, ఆయిలు ఇంజన్ల షెడ్డులను నిర్మించడానికి, తోటలకు దళ్ళుకట్టడానికి, తోటమాలీల జీతాలకు, కూరగాయల విత్తనాల కొనుగోలుకు, క్రిమిసంహారక మందులకు యింకా యితరవాటికి మొత్తం రూ. 15,000 ఖర్చు చేయబడింది.

1963-64 సం॥ కాలానికి ఈ ఖర్చుల క్రింద రూ. 7,500లు కేటాయించబడ్డాయి. 1963-64 సం॥ కాలంలో 652 కిలోగ్రాముల కాయగూరలను, 1963-64 సం॥ కాలంలో 1963 అక్టోబరు నెల వరకు 4348 కిలోగ్రాముల కాయగూరలను పౌష్టికాహార కార్యక్రమం క్రింద లాభం పొందడానికి ఉద్దేశించబడినవారికి పంపిణీచేయడం జరిగింది.

కోడిగ్రుడ్లను అందజేయడానికని పై గ్రామాలలో కోళ్ళక్షేత్రాలు ప్రారంభించబడ్డాయి. కోళ్ళ పెంపకంలో ఆసక్తిగల 26 మంది రైతులను ఎన్నికచేసి, వారికి విశాఖపట్టణంలోని ప్రాంతీయ కోళ్ళ క్షేత్రంలో ఆరువారాలపాటు శిక్షణ యివ్వటం జరిగింది. పై గ్రామాల నుండి యీ రైతులను ఎన్నుకోవడం జరిగింది. గ్రామానికి 3 కోళ్ళక్షేత్రాలు చొప్పున మొత్తం 30 కోళ్ళక్షేత్రాలు ప్రారంభించబడ్డాయి. ఒక్కొక్క కోళ్ళ క్షేత్రంలోనూ 20 పెట్టలు, 2 పుంజులు వున్నాయి. కోళ్ళక్షేత్రాలను ప్రారంభించడానికి శిక్షణ యివ్వబడిన రైతులకు ఒక యూనిట్టుకు రు. 200, రెండింటికి రు. 400, మూడింటికి రు. 600 లు చొప్పున గ్రాంట్లు యివ్వబడ్డాయి. అగిరిపల్లిలో మూడు యూనిట్లక్షేత్రం ఒకటి; బాపులపాడు, నూజివీడులలో ఒక్కొక్కచోట రెండు యూనిట్లక్షేత్రం ఒకటి, ఒక యూనిటుక్షేత్రం ఒకటి చొప్పున మొత్తం రెండు యూనిట్ల క్షేత్రాలు రెండూ, ఒక యూనిటు క్షేత్రాలు రెండూ. కృష్ణవరం, ఈదర, అడివినక్కలం, సురవరం, గొల్లపల్లి, రవిచెర్ల, ఈనామదలలో మూడేసిచొప్పున ఒక యూనిటు క్షేత్రాలూ ప్రారంభించబడ్డాయి. ఇంతవరకు 21 యూనిట్లకు కోళ్ళను అందజేయడం జరిగింది. మిగిలిన 9 యూనిట్లకు 1963 డిశంబరు మాసాంతానికి అందజేయబడతాయి. కోళ్ళతోపాటు వాటి ఆహారం క్రింద గింజలు మొదలయిన వాటినీ, వలలనుకూడా అందజేయడం జరిగింది. దీనికి ప్రతిగా వారానికి 30 కోడిగ్రుడ్లు చొప్పున సంవత్సరానికి ఆరు వారాలపాటు యివ్వవలసి వుంటుంది. అలా ఈ పథకంక్రింద లాభం పొందేవారికి ఉద్దేశించబడిన కాలంపాటు యివ్వవలసి వుంటుంది. ఇలా యిచ్చినవారికి కోడిగ్రుడ్డు ఒక్కంటికి 5 నయాపైసల చొప్పున సబ్సిడీ యివ్వబడుతుంది. 1963 అక్టోబరు మాసాంతం వరకూ 256 కోడిగ్రుడ్లు పంపిణీ చేయబడ్డాయి. ఈ తక్కువ సంఖ్యకు గల కారణం కోళ్ళను 1963 సెప్టెంబరు నెలలో అందజేయడం వలన చాలా తక్కువ వ్యవధి ఉండడమే.

పౌష్టికాహారంలో చేపలకు కూడా ప్రధాన స్థానం వుంది. ఎక్కువ చేపలను పొందడానికై నూజివీడు, బాపులపాడు, సురవరం, ఈదర, అడవి నక్కలం గ్రామాలలోని చెఱువులలో మూడులను పెంచడం జరుగుతున్నది. పై చెఱువులలో పట్టిన చేపలు ఆ పది గ్రామాలలోనూ పెంచడం జరుగుతుంది. చేపల వేటలో 16 మంది బెస్తలకు మోటూరులో శిక్షణ యివ్వబడింది. ఇక్కడ బ్లాకులో ఒక

మత్స్యశాఖ ఇనస్పెక్టరు, అతనిక్రింద పని చేయడానికి నెల సరి ప్రతి ఫలంపై యిరువురు జెస్తలు వున్నారు. జెస్తలు చేపలు పట్టిన దానిలో 50 శాతం శ్రమకు ప్రతిఫలంగా వారికి యివ్వబడుతుంది. మిగిలిన 50 శాతాన్ని ఈ పథకం ప్రకారం లాభం పొందడానికి నిర్దేశించబడిన వారికి పంచడం జరుగుతుంది. 1962 – 63 లో 34,000 తూడులను నాటడం జరిగింది. మొత్తం 9010 పౌనుల చేపలను పట్టగా 4664 పౌనుల చేపలను పౌష్టికాహార కార్యక్రమం క్రింద పంచడం జరిగింది. కాగా, యిక మిగిలిన 520 పౌనుల చేపలను వేలంపాటలో రూ 260 లకు అమ్మివేశారు. చేపలను గ్రామాలలోనికి తీసుకు వెళ్ళడానికిగాను యునెసెఫ్ వారు 3 సైకిళ్ళను అందజేశారు.

చేపల్నీ, కోడిగ్రుడ్లు మొదలయిన వాటినీ పంపిణీ చేసేపనిని ప్రాంతీయ మహిళా మండలులు చేపట్టాయి. పై గ్రామాలకు చెందిన 10 మంది గ్రామ లక్ష్మిలు, 10 మంది మహిళా మండలుల ప్రతినిధులు నూజివీడులో ఆరు వారాల పాటు ఆహార విలువలు, ఆహారాన్ని పళ్ళను భద్రపరచడం, కోళ్ళ పెంపకం పెరటితోటల నిర్వహణ, వివిధ ఆహారంలో గల పోషకపదార్థాలు, పోషకపదార్థాలు నశించి పోకుండా కోడిగ్రుడ్లను, చేపలను వండడం మొదలయిన విషయాలలో శిక్షణ పొందారు. వీరికి ముఖ్యసేవిక శిక్షణ యిచ్చింది. పంపిణీ చేయడమే కాకుండా గ్రామలక్ష్మిలు, మహిళా మండలుల సభ్యురాళ్ళు గ్రామాలలోని స్త్రీలకు ఆహారంలోని పోషక పదార్థాల విలువలను గురించి, పోషక పదార్థాలు నశించి పోకుండా కోడిగ్రుడ్లను, చేపలనువండడం గురించీ తెలియజెప్పుతారు.

పౌష్టికాహారపథకం అమలుజరుగుతున్న పై పది గ్రామాలలోనూ రవిచెర్ల, బాపులపాడు, రేగుంట (ఈనామదల గ్రామం) ఈదర, కృష్ణవరం, అగిరిపల్లి, సురవరం, గొల్లపల్లిలలో గ్రామస్తుల రేడియో గోష్ఠి నిర్వహించబడుతున్నది.

ఈ పథకాన్ని ఆచరణలో పెట్టడం వల్ల లాభం పొందడానికై వుద్దేశించబడినవారికి పౌష్టికాహారం లభిస్తున్నది. ఆరోగ్యాన్ని కాపాడుకోవడానికి పౌష్టికాహారంయొక్క ఆవశ్యకతను గ్రామస్థులు గుర్తిస్తున్నారు. ఆరకవు ఆహారాన్ని పండించడం తెలుసుకొంటున్నారు.



(18 వ పేజీ తరువాయి)

అవసరమయినపుడు, మరమ్మతు జేపి మంచిస్థితిలో ఉంచడానికి వీలుగా తాడేపల్లి గూడెంలో ఒక వర్కుషాపు నిర్మించడానికి పని ప్రారంభమైంది.

ముఖ్యంగా భూసారాన్ని బట్టే పంటల దిగుబడులు ఆధారపడి ఉంటాయి. జిల్లాలోని అన్ని ప్రాంతాలనుండి మట్టి నమూనాలను తెప్పించి బాపట్లలో ఉన్న భూసార పరీక్షా కేంద్రానికి పంపించి, ఆయా నేలలలో భూసార లోపాలను సరిదిద్దడానికి వీలుగా ఎరువులు రైతులకు సరఫరా చేయబడుతున్నాయి. ఇంతవరకు దాదాపు 10,000 మట్టి నమూనాలు పరీక్షించడం జరిగింది. రైతులకు అందుబాటులో వుండే విధంగా తాడేపల్లి గూడెంలో ఒక భూసార పరీక్షాకేంద్రం నెలకొల్పబడుతున్నది.

పంటకు పనికివచ్చే మంచి విత్తనాలను మన్ను, పొల్లు లేకుండా శుభ్రపరచడానికి వీలుగా ఫోర్డు ఫౌండేషన్ వారు కొన్ని యంత్రాలను ఈజిల్లా ఉపయోగానికై ఇచ్చారు.

ఏ ప్రణాళికైనా, పథకమైనా సఫలం కావాలంటే ప్రజాదరణ, సహకారం ఉండాలి. వీటిని రాబట్టాలంటే, వివిధ ప్రాంతాలలోవున్న ప్రజలకు వారికి తెలిసిన భాషలో నచ్చచెప్పడానికి వీలుగా తగిన ప్రచార సిబ్బందిని కూడా ఏర్పాటు చేశారు.

ఫలితాలు.

గత మూడు సంవత్సరాలుగా ఈ జిల్లాలో ప్యాకేజీ పథకం అమలులో వున్నందువల్ల కలిగిన ఫలితాలు చాలా ఆశాజనకంగా వున్నాయి. 1960–61 దాళ్వా పంటలో ఎకరానికి వరి 3 బస్తాలు, ఎండు మిరపకాయలు 125పౌనులు, అరటి 10,000 పౌనులు ఎక్కువగా పండినట్లు తేలింది. 1961 సార్వాపంటలో ఎకరానికి వరి 776 పౌనులు, చెరకు 10.67 టన్నులు ఎక్కువగా పండింది. 1961–62 దాళ్వా పంటలో మొదటి మూడు సంవత్సరాల సగటుకన్న వరి ఎకరానికి 254 పౌన్లు, ఎండుమిరప 250 పౌనులు, అరటి 10,000 పౌనులు దిగుబడి ఎక్కువగా వచ్చింది. 1962 సార్వా పంటకు వాతావరణ పరిస్థితులు అనుకూలంగా లేకపోయినప్పటికీ, మొదటి మూడు సంవత్సరాల సగటుకన్న వరిపంట దిగుబడిలో 222 పౌనులు ఎక్కువగా వుంది.

ఈ ఫలితాల్ని బట్టిచూస్తే పంట దిగుబడులు పెంచడానికి ప్యాకేజీ పద్ధతి చాలా ముఖ్యమని విశదమవుతోంది. మొన్న మొన్న రాష్ట్రంలోని, పది జిల్లాలలో ప్రవేశపెట్టబడిన, చిన్న సాంద్ర వ్యవసాయ పథకము కూడా ఈ పశ్చిమ గోదావరి జిల్లాలో అమలులో నున్న ప్యాకేజీ పథకం యొక్క ఫలితమే అని చెప్పవచ్చు.



# స్వయంకృషిలో ఆదర్శప్రాయమైన గ్రామం "నాగోలు"

—పి ఎస్ వి రావు

ఢిల్లీకి నిజాముద్దీన్ ఎంతదూరంలో వుందో హైద్రాబాదుకు నాగోలు కూడా అంతే దూరంలో వుంది. ఈ గ్రామం ఉస్మానియా విశ్వవిద్యాలయావరణ నుంచి కేవలం ఆరు కిలోమీటర్ల దూరంలోనే వున్నప్పటికీ ఇది ఇంతకాలంగా సందడిగా వుండే రాజధాని జీవితంతో సంబంధం లేకుండా వుంది. ఈ గ్రామం జనాభా 900.

ఉత్తర దక్షిణ దేశాలను కలిపే జాతీయ రహదారికి నాగోలు రెండు కిలోమీటర్ల కన్న తక్కువదూరంలోనే వుంది. అయితే తారు, సిమెంటుతో కూడిన ఘనమైన ఈ రోడ్డువల్ల నాగోలు గ్రామస్తులకు 1963 జనవరి 26వ తేదీవరకు కూడా ప్రత్యక్ష ప్రయోజన మేమీ కలుగలేదు. అప్పటివరకు అది వారి కో అపూర్వమైన అంశంగా మాత్రమే వుంది.

ప్రతి గ్రామంలోనూవాలంటీరు దళాలను నెలకొల్పాలని ప్రధానమంత్రి చేసిన విజ్ఞప్తిని నాగోలు గ్రామప్రజలు తక్షణమే ఆచరణలో పెట్టారు. గ్రామంలో ప్రతి కుటుంబంనుంచి స్త్రీకానీ, పురుషుడు కానీ కనీసం ఒకవ్యక్తి నిర్మాణాత్మక కార్యక్రమంలో పాల్గొనడానికి తమ సంసిద్ధత ప్రకటించారు. శ్రామిక బ్యాంకు అవతరించింది. గ్రామంలోని దర్జీకి దళపతిగా శిక్షణ గరపటం జరిగింది. సమిష్టి ప్రయోజనానికై ఈ శ్రామిక బ్యాంకువారిని వినియోగించుకునే భారం సర్పంచ్ పై పడింది. సర్పంచ్ ఎంతమాత్రం విలంబన చేయలేదు. జాతీయ రహదారిపై వాయు వేగంతో వయ్యారంగా శకటాలు పరుగెత్తడాన్ని రోజూ చూస్తున్న అతని కి రోడ్డును గురించిన ఆలోచన గలిగింది. (కచ్చారోడ్డు అయినా ఫరవాలేదు) రోడ్డు నిర్మాణానికి పంచాయతీ సమ్మతించింది. గ్రామీణ శ్రామిక బలగాన్ని సమీకరించడానికి దళపతి సన్నద్ధుడయ్యాడు. వారంతా పదేసిమంది చొప్పున 15 బృందాలక్రింద ఏర్పడ్డారు. వంతుల వారీగా నిరంతరాయంగా పనిచేసి 90రోజులలో రెండు కిలోమీటర్ల రోడ్డును పూర్తిచేశారు.

ప్రభుత్వం నాగోలు పంచాయతీకి రూ.6,000-/లను- అంటే రోడ్డుకు అయిన ఖర్చులో నాలుగింట మూడవ వంతును- చెల్లించింది.

రోడ్డు నిర్మాణాన్ని పూర్తిచేయడం ద్వారా స్వయంకృషి కార్యక్రమంలో తమకు గల శక్తిసామర్థ్యాలను ప్రదర్శించుకున్న ఈ గ్రామ పంచాయతీ ఆ వెంటనే మరో కార్యక్రమాన్ని - పాఠశాల భవన నిర్మాణం- చేపట్టింది. దృఢకాయులైన 150 మంది గ్రామీణ స్వచ్ఛంద సేవాదళం సభ్యులు తిరిగి దళపతి యాదగిరి నాయకత్వాన తమ కార్యక్రమానికి ఉపక్రమించారు. పునాదులుత్రవ్వడం, స్థానికంగా తయారుచేసిన ఇటుకలు, రాళ్ళతో గోడలు నిర్మించడం, తలుపులు, ద్వారబంధాలు అమర్చడం అంతా చకచకా సాగిపోయింది.

పని ప్రారంభమైన 40 రోజులలో గా పాఠశాల భవనం గోడలు లేచాయి. తరువాత 15 రోజులకు పైన కప్పు పడింది. 6-10 సంవత్సరాలమధ్య వయస్కులైన నాగోలు బాలలు 90మంది ఈ నూత్న భవనంలో ఇద్దరు ఉపాధ్యాయులతో నడుస్తున్న పాఠశాలలో విద్యాభ్యాసం చేస్తున్నారు.

నాగోలు పంచాయతీ అధ్యక్షుడు, న్యాయవాది అయిన శ్రీ మదుసూధనరెడ్డి తమ గ్రామానికి మరికొన్ని సదుపాయాలను సమకూర్చ దలిచారు.

కనుక రోడ్డు, పాఠశాల భవనాలనిర్మాణం పూర్తయ్యాక వారు ఒకబావి త్రవ్వారు.

గ్రామీణ స్వచ్ఛంద సేవాదళం ప్రథమ వార్షికోత్సవం సందర్భంలో హైద్రాబాదు సమీపంలోని నాగోలుగ్రామం "స్వయం సహాయం" సూత్రంలో ఇమిడివున్న మూడు ఉద్దేశాలను నెరవేర్చింది. దీనిని సాధించిన వారు గ్రామీణ స్వచ్ఛంద సేవాదళంసభ్యులు. తమ అంగబలం, అర్థబలాన్నంతటినీ సమీకరించడం ద్వారా జాతీయ కృషికి తోడ్పడడానికిగాను ఒక సంవత్సరంక్రితం వారు గైకొన్న ప్రతిజ్ఞను నెరవేర్చేందుకు వారు తమ సమయాన్నీ, శ్రమనూ అర్పించారు. ★

# ప్ర బో ధ గీ తి క

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

లేవవోయి భరతయువకుడా - లేచి
సాగవోయి మంచుకొండ చరియలలో
సమరానికి లేవవోయి....

పాహియాను హూౌనత్సాంగ్
వర్ధిల్లిన దేశమ్మట
పంచశీల సూత్రాలను
వలచినట్టి రాజ్యమ్మట
మన పవిత్ర భూభాగము
తనదే యని వాదించుచు
మరఫిరంగి సైన్యాలను
మనపై తరలించుచుండె
లేవవోయి....

ధరనెల్లరు గురుతించిన
తర తరాల సరిహద్దుల
అంతర్జాతీయ మైన
న్యాయమ్మును ధిక్కరించి
సాయుధ బలగర్వముతో
సామ్రాజ్యాశా పిశాచ
చైనా కమ్యూనిస్టులు
సంగ్రామము చాటినారు
లేవవోయి....

భరతమాత శిరసుపైని
మణి కిరీట ఘృణుల నీని
దేవతాత్మ గా విశ్రుతి
కావ్యాలను గడియించిన
హిమగిరికే యెగ్గుదలచె
దురాక్రమణ పెచ్చు పెరిగె;
తగినశాస్తి యగునట్టులు
ముగిసిపోవ దౌర్జన్యము
లేవవోయి....

దిన దినమును పెరుగుచున్న
తన దేశపు జనసంఖ్యకు
తిన తిండియు కట్ట బట్ట
చాలినంత సమకూరక
శాంతి గూర్చు సత్పథమున
అభివృద్ధిని పడయుచున్న
భరత ధరణి భాగములను
కబళింపగ కాంక్షించెను
లేవవోయి....

సత్యాహింసలె బలముగ
సాధించిన స్వాతంత్ర్యము
త్యాగములే ఆయుధముగ
సమకూరిన స్వాతంత్ర్యము
నిలుపుకొనగ ప్రతిన చేసి
ప్రతిభారత పౌరుండును
తుది రక్తము దొరలువరకు
నిలువ వలయు నిర్భీతిగ
లేవవోయి....



# అద్దెయిల్లు

దక్షిణప్రాంతం నుండి వచ్చిన రైలుదిగి, సామాను, పిల్లలను తీసుకొని స్టేషన్ ప్లాట్‌ఫారం గుమ్మందాటి బయట అడుగు పెట్టిన ఉద్యోగి సదాశివాన్ని — "నాన్నా! మన కొత్త యిల్లెక్కడ?" అని ప్రశ్నించింది కూతురు మందాక్రాంత. ఆ పిల్లకంటే రెండేళ్ళు చిన్నవాడైన శార్దూల విక్రీడితుడు ఉత్సాహంతో స్టేషన్లో గంతులు వేస్తూ "మనయిల్లు!" "మనయిల్లు!" అంటూ

ఒరియా కథ

మూలం :
గోపీనాథ మహంతి

అనువాదం :
అడుసుమల్లి రామచంద్రరావు

అనువాదభారతి

కేరింతలు కొట్టాడు. దానితో చిన్నకొడుకు అనుష్టుప్, చిన్నకూతురు గాయత్రికూడా సంతోషంతో చప్పట్లు చరిచారు. అంచేత వాళ్ళిద్దరు భుజాలమీద చేతులు వేసుకొని "ఇది మనయిల్లు!" "ఇది మనయిల్లు!" అనిగంతులువేసుకుంటూముందుకునడిచారు. వారివెనుక తల్లి దమయంతి వస్తూ "ఏమండీ!

కూజా రైల్లోనే ఉండిపోయిందా యేమిటి?" అని ప్రశ్నించింది.

"లేదు, ఉంది!" అని సమాధాన మిచ్చాడు సదాశివం. ఇటు పిల్లల్ని ఓదార్చుతూ — "ఇదుగో పిల్లలూ! అల్లరి చేయకండి!" అని అన్నాడు.

వాళ్ళదగ్గర చాలా సామాను ఉంది. అంచేత చుట్టూ ఉన్నవాళ్ళంతా విరగబడి చూస్తున్నారు. "బండి కావాలా బాబూ, బండి?'' అంటు బండి వాళ్ళంతా గుమిగూడి ముట్టడించారు.

మందాక్రాంత మళ్లా అడిగింది "నాన్నా! ఇక్కడికి మనయిల్లు ఎంతదూరం?" అని.

దానికి ఏమీ సమాధాన మివ్వకుండా సామాను వగైరా బండిలో సర్ది పిల్లల్ని, భార్యను తీసుకొని గుఱ్ఱబ్బండిలో బయలు దేరాడు సదాశివం. బండిలో తన అర్ధాంగివైపు చూచాడు. ఆమె కొద్దిరోజుల్లో ప్రసవిస్తుందని స్పష్టమైంది. ఎలావుంది నీకని ప్రశ్నించాడు భార్యని.

"తేలికగానే వుందిలెండి!" అన్న దామె.

"అబ్బాయిలూ - అమ్మాయిలూ? మీరు మీ అమ్మ నేమీ వేధించకండేం?" అంటూండగానే శార్దూల విక్రీడితుడు "మన కొత్తయిల్లు" అని స్లోగాన్ చేశాడు. బండిలో ఎదురెదురుగా కూర్చొనివున్న దంపతులు ఒకరివైపు ఒకరు చూచుకున్నారు.

దమయంతి నవ్వింది. సదాశివం ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు.

పండ్రెండు సంవత్సరాల అనంతరం అతనికి రాజధానికి బదిలీ జరిగింది. ఒకటిరెండు సంవత్సరాల లోపున అతనెప్పుడూ రాజధానికి రాలేదు. కాని పరివార సమేతంగా బదిలీ జరగటం ఇదే ప్రథమం. అతడు చిన్ననాడు చదువుకొన్నదికూడా కటక్‌లోనే. ఆ కటక్‌కే నేడతడు బదిలీ అయ్యాడు. కటక్‌కు నాల్గుక్రోసులదూరంలో ఒక నది వుంది. ఆ నదికి అవలి ఒడ్డునే ఒక చిన్న గ్రామం వుంది. అదే అతని పుట్టినఊరు.

తనవూళ్ళో సారవంతమైన భూములున్నాయి. అందు మిరప వంగ నాటి వుంటారు. అవి బాగా ఫలించి వుంటాయి. పైరులతో పచ్చగా కళకళ లాడుతూ వుంటుంది తన జన్మభూమి.

## 2

ఇంటిమీద ఇల్లు తయారవుతూ ఉంది. ఇంకా ఎన్నో ఇళ్ళు నిర్మాణదశలో ఉన్నాయ్. ఇటుకల గుట్టలు యిసుకరాసులు పడి వున్నాయి. ఇటుకలతోను, ఇనుప వూచలతోను నిండిన ట్రక్కులు ఇటూ — అటూ వస్తూపోతూ ఉన్నాయి. ఎవరైనా మోటారు క్రిందపడి మరణిస్తే లక్ష్యమేలేదు. ఇలా కాకపోతే మరో విధంగానైనా చావు తప్పదు గదా! ప్రగతి ఎంతమాత్రం ఆగటంలేదు. భయ్, భయ్ మంటూ కార్లు పరుగెత్తుతున్నాయి. ఎంత గొప్ప గొప్పవాళ్ళున్నారు!

మేలుకొంది కటక్. ఎంత వృద్ధిపొందింది కటక్? వివిధ జాతులతో విలసిల్లుతూ సిరి సంపదలతో తులతూగుతూవుంది కటక్.

పన్నెండేళ్ళక్రితం అత నిక్కడనుండి వెళ్ళిపోయాడు. సువిశాలమైన ఒరిస్సాలో ఒక జిల్లానుంచి మరొక జిల్లావరకు తిరిగాడు. మందాక్రాంత బాలేశ్వరంలోపుట్టింది. శార్దూల విక్రీడితుడు కోరాపుట్టిలో పుట్టాడు. అనుష్టుప్ బోడానంబర్‌లో జన్మించాడు. గాయత్రి ఛంజభూమిలోని రసల్‌కుండలో ఉద్భవించింది. ఇప్పుడు పుట్టబోయేసంతానం: కటక్ మహానగరంలో ప్రప్రథమంగా సూర్య దర్శనం చేసుకుంటుంది.

కాని ఎక్కడ? దానికి ఇల్లెక్కడ? సదాశివం తన భార్యతో — "ఈ పట్టణం గొప్పవాళ్ళకోసమే, మనలాంటివాళ్ళ కిచ్చట స్థానంలేదు" అన్నాడు.

"పోనిస్తురూ!" అంది భార్య.

సదాశివం దుఃఖంతో — "అసలు విషయమేమంటే ఈ యుగంలో చావవలసినవాళ్ళు చావటంలేదు!" అన్నాడు.

దమయంతి ఊరడిస్తూ — "ఎందుకలా చింతపడతారు?" ఒక్క ఇల్లు దొరకదా ఏమి?" అంది.

సదాశివం పండ్లు కొరుకుతూ - తప్పకుండా దొరుకుతుంది. కాని కొంచెం ఆలస్యమౌతుంది. అంతే!" అన్నాడు.

అతని మందే చూపులు. వేడి నేడి ఊర్పులు వ్యర్థకోపంలో దారిలోని దుమ్ముపై దండెత్తినయ్. ఒకదానివెనుక ఒకటి కార్లు వస్తూ పోతూ ఉన్నాయి.

## 3

ఇప్పుడిక వెళ్ళవలసినది రత్నాకరుని యింటికి. కటక్‌లో అతడు ఇనుపవ్యాపారం చేస్తున్నాడు. బజారు ప్రక్కన అతని కొక చిన్నయిల్లు ఉంది. అదికాక దానిప్రక్క మరొక రెల్లుపాకకూడా వుంది. దాన్లో ఒక మంచము, దానిక్రింద దొంతర్లుగా సామాను పేర్చిఉంది. ఇక మిగిలిన స్థలంలో రత్నాకరుని పిల్లలు గాలి పీల్చటానికి అతి కష్టం మీద సరిపోతుంది. రత్నాకరుడు, అతని అర్ధాంగి, అయిదుగురు బడికిపోయి చదువు కొనే పిల్లలు — కుటుంబ సభ్యులు. వీరుకాక ఇంట్లో కుక్క, పిల్లి, ఎలుకలు, గేదెలు, ఆవులు వగైరాకూడా వున్నాయి.

ఇటువంటి పరిస్థితిలో దూరపు బంధువైన సదాశివాన్ని ఆహ్వానించడం ఆశ్చర్యకరమైన విషయమే! కాని ప్రపంచంలో ఆశ్చర్యకరమైనవి మరియు అసంభవమైన సంగతులే ఎక్కువగా జరుగుతూ ఉంటాయి.

ఆశకు అతీతమైన ఔదార్యములు, అంతులేని నిష్ఠుర కార్యములు, ఆకస్మికమైన సంఘటనలు గోచరిస్తూ ఉంటాయి. ఇలా ఆకస్మికమైన వాటి విషయంలో విశ్వాస ముండకపోతే జీవించటం ఎలా సంభవిస్తుందని ఆలోచిస్తాడు సదాశివం.

తాను ఏ వృత్తి నవలంబించి జీవయాత్ర సాధించ దలచాడో దాని ఫలస్వరూపమే ఉపవాసాలు, ఋణబాధ, నిరాశా జీవితము: బహుశః అందుకే అతనికి గ్రీకు విషాదగాథ లంటే ఎక్కువ ప్రీతి.

"పది పదిహేను రోజులు, లేక ఒకనెల మా యింట్లో ఉండటానికి ఎలాంటి అభ్యంతరమూ లేదు." అని రత్నాకరం ఉత్తరం ద్వారా తెలియజేసి తన సాహసాన్ని ప్రదర్శించాడు.

అతని యింటిని అంటుకొనివున్న చిన్న రెల్లుపాక సదాశివం రాకను నిరీక్షిస్తూఉంది.

మట్టిగోడలు, పైన రెల్లుకప్పు. కిటికీలు శూన్యం. వెదురుతడికెలతో నిర్మించబడ్డ తలుపులు. ఇంటినిండా ఇనుపసామాను. వాటికి తోడు కొంత కొయ్యసామాను. పిల్లల పుస్తకాలు పెట్టే మూడు అల్మేరాలు, రెండు బెంచీలు, అయిదుకుర్చీలు, మూడుమంచాలు, మిగిలినది కొంచెం కాళీస్థలం మాత్రమే ఉంటుంది.

"ఇదేనా యిల్లు?" – అని సదాశివం ప్రశ్నించాడు.

"అవును ఇదే!" – అంటూ ముందు రత్నాకరం, వెనుక అతనిభార్య – పిల్లలు వాళ్ళను చూస్తూ వచ్చారు.

## 4

భయంకరమైన చీకటి: జోరున వర్షం: ప్రక్కలు పరచుకొని అంతా నిద్రాదేవత కౌగిలిలో ఉన్నారు హఠాత్తుగా సదాశివం నిద్రకు భంగంకలిగింది. కారణం తెలియ లేదు: బయట కారుచీకటి, మేఘాక్రాంతమై వుంది ఆకాశం. ఇటువంటి చలిరాత్రిలో ఇల్లులేని దరిద్రులు మరణించటం అతిసహజమైన విషయం. కాని వాళ్ళు చావటంలేదు. ఏ చూరుక్రిందో ఏ చెట్టుక్రిందో తలదాచుకొని జీవితాలను పట్టుకొని వ్రేలాడుతున్నారు.

సదాశివం తన అదృష్టానికి మురిసిపోతున్నాడు. రత్నాకరానికి మనస్సులో కృతజ్ఞతాభి వందనాలు సమర్పించాడు: మళ్లా తటాలున దిగులు కల్గింది. ఈ పదిహేను దినాలు గడిచాక ఏమిజరగాలి?

గబాలున ఒక ఎలుక అతని చేతిమీదుగా పరుగెత్తింది. ఉలిక్కిపడ్డాడు. ఇటువంటి ఇంట్లో దీపం వెలిగించి పెట్టినా ఎలుకలు స్వేచ్ఛా సంచారం మానజాలవు. చీకటిలోనికి దృష్టి ప్రసరించాడు. ఇంట్లో రకరకాల శబ్దాలు వినబడుతున్నాయి. తను పడుకున్న మంచం క్రింద 'కట కట' మని చప్పుడు శృతిగోచరమైంది. దానితో పాటుగా ఒక రకమైన దుర్గంధం ముక్కుపుటాలను పగలగొడుతూ ఉంది. తల క్రింద పెట్టిన టార్చిలైట్ తీసి వెలిగించి చూచాడు. ఒక ముసలికుక్క మంచంక్రింద దురద పోగొట్టుకునే ప్రయత్నంలో కనుపించింది. నఖశిఖ పర్యంతం ఎక్కడా వెంట్రుకలు లేవు దానికి. అన్నీ రాలిపోయినయ్: దీనికి కూడా ఆ ఇంట్లో ప్రవేశముంది. ఆ కుక్కను వెళ్ళగొట్టటానికి సదాశివం చాలా ప్రయాసపడ్డాడు కాని అదిమాత్రం కదలలేదు. మొండికేసింది. ఆ వర్షపురాత్రిలో పోనంది. ఈ మూలనుండి ఆ మూలవరకు అంతాసామానే. మంచాలు, అల్మేరాలు, కుర్చీలు వగైరా. ఇటుకొడితే అటు; అటుకొడితే ఇటు దేని క్రిందో దూరేది. అర్ధగంట ప్రయాసపడి ఓటమిని అంగీకరించి సదాశివం ప్రక్కమీద మేను వాల్చాడు చేసేదిలేక. కుక్కకూడా గుర్రుపెట్టి నిద్రలో పడింది. నికృష్ట జీవనానికి ఒడబడ్డ సదాశివం పాపం ఏం చేస్తాడు?

తెల్లవారింది. సూర్యకిరణాలు ముఖం మీద పడుతున్నాయి. అతనిని కుంభకర్ణునిగా భావించి, పరిహాసం చేసి అతనికి నిద్రాభంగం చేయడాని కన్నట్లు కర్ణములను భేదించే రణగొణధ్వనులు చేస్తోంది పట్టణం. పట్టణ పరిభాషలో అది మేలుకొలుపు: తల ఎత్తి చూచాడు. రోడ్డుమీద గొఱ్ఱెలమందా ఎడ్లబండ్లూ పోతూ కన్పించినయ్.

## 5

సదాశివం ఇల్లు వెదకటంకోసం నడుం కట్టాడు. ఒక డబ్బానిండా తాంబూల సామగ్రి, ఒక బీడీకట్ట, ఒక అగ్గిపెట్టె ఇవే అతని జేబులో ఉన్నవి. ఈరోజు ఆదివారం. అనిర్దిష్టమైన దిశగా సైకిలుమీద బయలుదేరాడు. రాజధానిని నాలుగు భాగాలుగా విభజించుకున్నాడు. నాలుగురోజుల్లో అన్వేషణ కార్యక్రమం సిద్ధపరచుకున్నాడు.

కిల్లీషాపులవారు, బజారులో నివసించే నాగరికబృందం తన ప్రయత్నానికి సహకరిస్తారు. వీరుకాకుండా ప్రభుత్వోద్యోగులు సహాయపడటానికి ఎలాగో లభిస్తారుగదా!

సదాశివం గృహాన్వేషణలో చాల వాస్తవ విషయాలు సంగ్రహించాడు. ఎన్నో క్రొత్త ఇళ్ళ చిరునామాలు సంపాదించాడు. ఎంతో మంది నూతనవ్యక్తుల పరిచయం లభించింది. కబురు అందంగానే నోటుబుక్కులో వ్రాసుకొని అక్కడకు పరుగెత్తేవాడు. కాని ఏమిలాభం?

"ఇక్కడ ఇల్లు కాళీలేదు, ఎవరో ఒక వ్యక్తి ఈ యిల్లు తనకు నిర్ణయించుకొని వెళ్లాడు" – అని సమాధానం వచ్చేది.

ఒక్కొక్కచోట– "ఈ కట్టేయిల్లు పూర్తి కాగానే అద్దెకు ఇస్తాము' – అనేవారు

మరికొన్ని విచిత్రసమాధానాలు వచ్చేవి.

“అడ్వాన్సుతీసుకొని, ఇటుకలు కొని పునాదులు కట్టారు. క్రొత్త అడ్వాన్సులు లభిస్తే త్వరగా పూర్తిచేస్తారు” అని.

చివరికి అతనికి ఇల్లు దొరకలేదు. కాని పట్టణ భౌగోళిక విషయంలో అతను చాల విజ్ఞానం గడించాడు.

ఎంత పెద్దపట్టణం ? ఎన్నివీధులు ! ఎన్ని భవనాలు ! తన గవేషణలో చాలా విషయాలు గమనించాడు. క్రొత్త క్రొత్త రోడ్లు నిర్మింపబడుతున్నాయి. నూత్న భవనాలు నిర్మిస్తున్నారు. లక్ష్మి ఒకరిచేతి నుండి ఇంకొకరి హస్తగత మవుతూవుంది. చీకటి రాత్రులలో వేలాది నిర్మాణాలు కొనసాగుతున్నాయి. కాని తనకుమాత్రం ఇల్లు దొరకలేదు.

నగరం ఎటుచూచినా విస్మయాన్ని కొల్పుతోంది. బాతులు ఈదే నీటిగుంటలలో ఇప్పుడు నాలుగు అంతస్థులమేడ వెలసింది. పాముల పుట్టలుండే ప్రాంతమంతా క్రొత్త బజారుగా రూపొందింది. సదాశివం ఇంకా అన్వేషణలోనే సతమత మవుతున్నాడు. అంతా సదాశివాన్ని చప్పట్లుకొట్టి మరీ పరిహసిస్తున్నారు.

“మా కీ ప్రాంతమంతా తెలుసు. కూలీలకు, చిన్న ఉద్యోగులకు ఇక్కడ ఇల్లు దొరకదు తిరిగిపోవచ్చు !'' అని చెప్పారు.

పూర్వం తను చదువుకునే రోజుల్లో అత నొక ఇంట్లో ఉండేవాడు. ఆ వీధివెంట వెళుతూవుంటే పూర్వపు విషయాలు స్మృతికి వస్తున్నాయి...ఒక పెద్ద వేపచెట్టు ఉండేది. దానిచెంతనే అతను నివసించిన ఇల్లు. వెదుకుతూ ముందుకు నడిచాడు. కొంచెం మారినట్టు కనిపించినా ఆ చెట్టుదగ్గరలో వున్న ఇంటికి వెళ్లాడు. గుమ్మంవరకు వెళ్లాడు. ''ఈ యిల్లు ఎవరిది ?'' అని ప్రశ్నించాడు.

''ఇది హోమియోవైద్యశాల. పూర్వం ఉన్నవారివద్ద దీనిని మేము కొన్నాము” — అని సమాధాన మిచ్చారు.

మరో బజారులో ఇంకొక యింట్లో తను వుండేవాడు. అత డప్పుడు నాలుగేళ్ళు ఆ ఇంట్లోనే ఉన్నాడు. సదాశివం అచటికి పోయి ఇంటిముందు నిలబడగానే అన్ని భాగాలూ గుర్తుకు వచ్చినయ్. ప్రథమ యవ్వనపు దృశ్యాలు మనోఫలకంలో తారట్లాడినాయి.

తాను చదువుకునేగది,దాన్నంటుకొనిఉన్న ప్రక్క యిల్లు, వెన్నెలరాత్రి, హార్మోనియం మీద ఆ యింటివారి అమ్మాయిపాటలు !...

అత డలా నిలబడి ఆలోచిస్తూ చూస్తూ ఉన్నాడు. ''ఏమిటిక్కడవెదుకుతున్నావ్ ?” — అని ఒక లావుపాటి పెద్దమనిషి కర్కశంగా గద్దించి అడిగాడు.

అది వినేసరికి సదాశివం తృళ్ళిపడ్డాడు.

“రమేశ్ బాబు ఇక్కడ ఉంటున్నారండీ ?”

“లేదు, ముందుకుపోయి విచారించండి.”

తలవంచుకొని ముందుకు నడిచాడు. వెనుక మోటారు వస్తూఉంది. హారన్ విని తప్పుకుంటూ ఉండగానే బురదగుంటలోని నీళ్ళువచ్చి తనమీద చిందిపడ్డాయి. పాపం ! వీపు అంతా బురదనీటితో తడిసిపోయింది. ఆ కార్లో తెల్లని గ్లాసుకోపంచి — కోటు ధరించిన పెద్దమనిషి ఉన్నాడు. అతని కేమి తెలుసు సదాశివం దురవస్థ ? ఆ వ్యక్తి తన విషయంలో తాను మునిగి ఉంటాడు.

దారిలో బురదనీరు పడగానే సదాశివం మనసు చివుక్కుమన్నది. సిగ్గుపడ్డాడు. కాని ఏమిచేస్తాడు ? ఈ నగరంలో అతని కొక చిన్నయిల్లు అద్దెకుదొరకలేదు. ఈ నగరంలో నన్నమాటేమిటి. ఏనగరంలోను అతనిలాంటి వారికి ఇళ్ళు దొరకవు !

ఎన్నిచోట్లో అతనికి కడుపు మండింది. ఎన్నిచోట్లో అతనుకూర్చొని చెమటతుడుచుకున్నాడు. ఎన్నిచోట్లో విశ్రాంతి తీసుకున్నాడు. ఆ కఠోర పరిస్థితులకు రాటుతేలిపోయాడు విధిలేక. ఒక్కొక్కప్పుడు చచ్చిపోదామనుకున్నాడు. కాని జీవితాశ అతనిని చావనీయలేదు. పగలంతా తిరిగి సాయంకాలానికి తిరిగి వస్తున్నాడు. ఆకాసం మబ్బుక్రమ్మి వుంది. ఒక రోజు గడిచింది. కాని ఇల్లు దొరకలేదు.

నాలుగురోజులు ఈ మూలనుండి ఆమూల వరకు పట్టణమంతా గాలించివేశాడు. మధుకణంకోసం తిరిగే తెనెటీగలాగా ఆఫీసుకు వెళ్ళి ఉద్యోగం చేసేవాడు. మళ్లా ఇంటికోసం వెదికేవాడు.

ఇలా పరిశ్రమ చేయగా చివరికొక ఇంటివరండా అద్దెకు ఇస్తా మన్నారు. అది తిన్నగా నాల్గుగజాలు ఉండదు. ఒక చెంప ఇంటివారిమేకలు, ఆవులు కట్టిఉన్నవి. మేకపెంటికలు, ఆవుపేడ ఒకటేకంపు ! అయినా అవి క్షయరోగ క్రిములను అడ్డగిస్తా యని సమాధాన పరుచుకున్నాడు. కాని మేకపిల్లల అరపు విని నివాసయోగ్యం కాదని వదిలివేశాడు ?

## *6*

సదాశివం తన ఆఫీసులో పనిచేస్తున్న వారితో అద్దెఇల్లుచూచిపెట్టమని నివేదించాడు.

“ఇది మా బాధ్యతకాదు” — అని సమాధాన మిచ్చారు. తర్వాతమళ్లా వ్యక్తిగతంగా ప్రయత్నం మొదలుపెట్టాడు. వ్యక్తిగత ప్రయత్నంలో కంపెనీ లెన్నో తెరుస్తున్నారు. ఎన్నో మేడలు కడుతున్నారు. పెద్దపెద్ద వ్యాపారసంస్థలు నడుపుతున్నారు. అలాంటప్పుడు తాను వ్యక్తిగతంగా చిన్నయిల్లు అద్దెకు సంపాయించలేడా ? దొరక్కుంటే అది అతని ప్రయత్నలోపం, అస

(మిగతా 32 వ పేజీలో)

# భారత ప్రగతి

## పశ్చిమ బెంగాలు

*హాల్దియావద్ద సహాయక రేవు:*

పశ్చిమ బెంగాలులోని హాల్దియ సహాయక రేవుగా అభివృద్ధి పరచబడుతున్నది. ఇది పూర్తిగా అభివృద్ధి చేయబడిన అనంతరం సంవత్సరానికి ఒకకోటి టన్నుల సరకుతో యీ రేవునుండి వర్తకం జరుగుతుంది. ప్రస్తుతం కలకత్తా రేవులో వున్న రద్దీనికూడా యిది తొలగిస్తుంది.

హాల్దియాను అభివృద్ధిపరచడంతో అక్కడొక చమురుశుద్ధి కార్మాగారంతోపాటు అనేక పరిశ్రమలను స్థాపించే ప్రతిపాదనలు వున్నాయి. హాల్దియా రేవువల్లా, యిక్కడ నిర్మించ దలచుకున్న పరిశ్రమలవల్లా పదేళ్ళలో సుమారు లక్షమందికి ఉద్యోగాలు చూపించవచ్చు.

శ్రీ రాజ్‌బహదూర్, శ్రీహుమాయూన్ కబీర్– యీ యిరువురు కేంద్రమంత్రులూ, పశ్చిమ బెంగాలు ముఖ్యమంత్రి శ్రీ పి. సి. సేన్ యిటీవలే హాల్దియాను సందర్శించారు. 1967నాటికి, అనుకున్నదానికన్న ఒకఏడాది ముందుగానే, యీ రేవు నిర్మాణానికి సంబంధించిన పని పూర్తికావచ్చుననే ఆశాభావాన్ని శ్రీ రాజ్‌బహదూర్ వ్యక్తపరిచారు.

*సాంద్ర వ్యవసాయ కార్యక్రమం:*

పశ్చిమ బెంగాలులో సాంద్ర వ్యవసాయ పథకం అమలు పరచబడిన బురద్వాన్‌లోని జిల్లాలో తీవ్రతర వ్యవసాయానికి సంబంధించిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమం బ్రహ్మాండమైన అభివృద్ధిని సూచిస్తున్నది.

ఎకరానికి సగటున ఆరు మణుగులు అధిక రాలుబడి చొప్పున మొత్తం ఆరు లక్షల మణుగుల అదనపు పంటను పండించడమే ఈ పథకంక్రింద సాధించిన గొప్ప అభివృద్ధి. ఎకరానికి సగటున పంటవుత్పత్తి 33 మణుగులు.

*దుర్గాపూర్ వద్ద ఉక్కు, తత్సంబంధమైన ఇతర వస్తువుల కర్మాగారం:*

ఇండియా, జపాను సమిష్టి సహకారంతో దుర్గాపూర్ వద్ద త్వరలోనే ఉక్కు, తత్సంబంధమైన వస్తువుల కర్మాగారం నెలకొల్పబడనున్నది. 2 కోట్ల రూపాయలు ఖర్చు కావచ్చునని అంచనా వేయబడిన యీ కర్మాగారం 500మందికి ఉద్యోగావకాశాలను కల్పిస్తుంది.

*ప్రణాళికా కేటాయింపు:*

1964–65 సం. కాలానికి యీ రాష్ట్రానికి ప్రణాళికా కెటాయింపు క్రింద రూ 71 కోట్లను ప్రణాళికా సంఘం కేటాయించింది.

*రాష్ట్ర గిడ్డంగిలో డిపాజిట్లు:*

పశ్చిమ బెంగాలు రాష్ట్ర గిడ్డంగి కార్పొరేషను నిర్వహిస్తున్న గిడ్డంగిలో 1962–63 సం. కాలంలో బంగాళాదుంపలు, కాయధాన్యాలు, తెలగపిండి వంటి చమురు కేకులు మొదలయిన పదార్థాల డిపాజిట్ల విషయంలో ఎంతో అభివృద్ధి కనుపించింది.

ఈ గిడ్డంగిలో వుంచినవాటిలో తొంభైఏడు శాతం రైతులకు, రైతుల సహకార సంఘాలకు సంబంధించినవి. వీలయినంత మంది ఎక్కువ రైతులకు సహాయ పడడమే గిడ్డంగి నిర్మాణంయొక్క ప్రాథమిక ఆశయం. అది యిక్కడ నెరవేరింది.

ధాన్యం, బియ్యంలకు సంబంధించిన గిడ్డంగిరసీదులపై ఋణాలను యివ్వడంలో రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా ప్రవేశపెట్టిన ఆంక్షల వలన యీ కార్పొరేషను వ్యాపారం బాగా దెబ్బతిన్నది. 1962–63 సం. కాలంలో యీ గిడ్డంగిలో భద్రపరచిన ధాన్యం, బియ్యంల పరిమాణం అంతకు ముందు భద్రపరిచిన పరిమాణంలో సగానికి యింకా తక్కువగానే వున్నది. ధాన్యం, బియ్యం మార్కెటులో వున్న అస్థిరత్వం కూడా యీతక్కువ డిపాజిటుకు ప్రధానమైన కారణమే.

## కేరళ

*భూసంస్కరణలు:*

డిశంబరు 4వ తేదీన కేరళ విధానసభ కేరళ భూసంస్కరణల బిల్లును ఆమోదించడం, దానికి డిశంబరు 31న రాష్ట్రపతి ఆమోదం లభించడం కేరళలో డిశంబరునెలలో సంభవించిన అతి ముఖ్యమైన సంఘటనలుగా భావించవచ్చు. 1960 సం.పు కేరళ వ్యవసాయ సంబంధమైన చట్టం స్థానే వచ్చిన యీ బిల్లు, రాష్ట్రంలో ఒక

సమగ్ర భూసంస్కరణను తీసుకురావడానికి ఉద్దేశించబడింది. ఈ బిల్లును రూపొందించే టప్పుడు భారత ప్రభుత్వం, ప్రణాళికా సంఘం లక్ష్యాలను దృష్టిలో వుంచుకోవటం జరిగింది. ఈ బిల్లు యితర విషయాలతో పాటు, కౌలుదారుని స్వాధీన కాలాన్ని, ఉచితమైన బాడుగను, భూమి యాజమాన్యంపై, భూమిపై పరిమితులను ఆంక్షలను విధించడం మొదలయినవాటిని నిర్ణయిస్తుంది. భూమిని దున్నేవాడిని రైతుయజమానిగా చేయడానికీ, కొద్దిమంది చేతుల్లో మాత్రమే భూమి అధికారం కేంద్రీకృతమయ్యే ప్రమాదాన్ని తొలగించడానికీ ఒక చట్టాన్ని తయారుచేయడం నిజంగా ప్రభుత్వం చేసిన ఒకగొప్ప పని.

1963 కేరళ కౌలుదారుల, కుడికిడప్పు కారనాస్ రక్షణ చట్టాన్ని మరో మూడు నెలలపాటు పొడిగిస్తూ ఒక ఉత్తరువును నెలాఖర్లోగా ప్రభుత్వం ప్రకటించింది. కాని కొత్త భూమి సంస్కరణ బిల్లుచట్టం అయ్యేవరకు మాత్రమే యిది అమలులో వుం వుంటుంది.

*పంచాయతీ ఎన్నికలు:*

పదేళ్ళ అనంతరం కేరళ రాష్ట్రంలో 922 పంచాయతీలకు జరిగిన ఎన్నికలు డిశంబరు నెలలో విజయవంతంగా పూర్తయ్యాయి. మొత్తం 7714 స్థానాలకు 18710 మంది అభ్యర్థులు పోటీ చేశారు. నాలుగు పంచాయతీలలోని సభ్యులందరూ, యితర పంచాయతీలలోని 538 మంది సభ్యులూ పోటీ లేకుండా ఎన్నికయ్యారు. మొత్తం పోటీ చేసిన 76మంది స్త్రీల అభ్యర్థులకూ 14మంది మాత్రమే గెలిచారు. కాని మొట్టమొదటి సారిగా యీ రాష్ట్రంలోని స్థానికి పరిపాలనా సంస్థల చరిత్రలో ఒక స్త్రీ అభ్యర్థిని పంచాయితీ అధ్యక్షురాలిగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడింది. (క్విలన్ జిల్లాలో చితారా పంచాయితీ). పంచాయతీలలో ఒక్క స్త్రీ అభ్యర్థిని కూడా ఎన్నుకోబడని చోట్ల ఒక్కొక్క పంచాయతీకి ఒక్కొక్క స్త్రీ సభ్యురాలు చొప్పున నియమించ బడతారు. కొన్ని కొన్ని పంచాయతీలలో 94 శాతం చొప్పున ఓట్లు పోలయ్యాయి. ఎక్కడా 75 శాతానికి తగ్గలేదు. పార్టీరహిత పద్ధతిలో జరిగిన పంచాయతీ ఎన్నికలు రాష్ట్రంలో ఊహించలేనంత అభిరుచిని కలిగించాయి.

# ఉత్తరప్రదేశ్

*తూర్పు యు. పి. తీవ్రతర అభివృద్ధి:*

తూర్పు ఉత్తర ప్రదేశ్ అభివృద్ధికి ప్రణాళికా సంఘం, రాష్ట్రప్రభుత్వాల సంయుక్త పరిశీలక బృందం ఒక ఏడేళ్ళ సమగ్ర ప్రణాళికను సిఫారసు చేసింది. వెనుకబడిన ప్రాంతాలలోని యితర జిల్లాలలో కూడా యిలాంటి ప్రణాళికనే అమలు పరచేందుకై రాష్ట్ర ప్రణాళికాకాలంలో ప్రత్యేక ప్రాంతాల విభాగాలను ఏర్పాటు చేయవలసినదని కూడా యీ పరిశీలక బృందం సూచించింది.

ఉత్తరప్రదేశ్‌లోని అనేక తూర్పు ప్రాంతపు జిల్లాలు బాగా వెనుకబడి వుండడంపై పార్లమెంటులో చర్చలు జరిగిన అనంతరం ప్రణాళికా సంఘం సలహాదారుడు శ్రీ బి. పి. పటేల్ అధ్యక్షుడుగా యీ సంవత్సరం ప్రారంభంలో యీ పరిశీలక బృందం ఏర్పాటు చేయబడింది. ఈ బృందం యించుమించు తన పరిశీలనలను పూర్తిచేసింది.

ఈ బృందం సిఫారసు చేసిన వాటిని అన్ని రంగాలలోనూ అమలు పరచాలంటే మొత్తం రూ 84 కోట్లు ఖర్చుకావచ్చు. దీనిలో రూ 10కోట్లు ప్రస్తుత ప్రణాళికా కాలంలోను, మిగతా 74 కోట్ల రూపాయలు నాలుగవ ప్రణాళికా కాలంలోను ఖర్చుచేయబడతాయి.

వ్యవసాయోత్పత్తికి ప్రాధాన్యత యివ్వాలని యీ పరిశీలకబృందం తనసిఫారసులో తెలియ జేసింది. ప్రస్తుతం అఖిలభారత స్థాయిలో సంవత్సరానికి ఒకరైతు తలసరి ఆదాయం అయిన రూ 330ల మేరకు యిక్కడి రైతుల ఆదాయాన్ని పెంచాలంటే వ్యవసాయోత్పత్తిని రెట్టింపు చేయాలి. ఇందుకు నీటి పారుదల సౌకర్యాల్ని అభివృద్ధి పరచాలి. దాళవా పంటను పండించాలి. రసాయనిక ఎరువుల్ని వాడాలి. సహకార పరపతి సంఘాల్ని స్థాపించాలి. ఇంకా యిలాంటి వాటినే ఎన్నో చేయాలి.

పరిశీలన కొనసాగించడానికి యీబృందం గోరఖ్‌పూర్ డివిజనులోని ధోరియా, అజామ్‌ఘర్ జిల్లాలనూ; వారణాసి డివిజనులోని జానుపూర్, గాజీపూర్‌లనూ ఎన్నుకుంది. ఈ జిల్లాలు తూర్పు ఉత్తర ప్రదేశ్‌లోని సమస్యలకు, లోపాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నట్టు వుండడం వలన యీ జిల్లాలను ఎన్నుకోవడం జరిగింది.

*గొర్రెల పరిశ్రమ అభివృద్ధి కార్యక్రమం:*

గొర్రెల కాన్పులలో వ్యవధిని మూడు నెలలు తగ్గించడానికి ఒకకొత్త పథకం ఒకటి ఎంపిక చేయబడిన రెండు గ్రామాలలోను, రాష్ట్రంలోని అన్ని ప్రభుత్వ గొర్రెలక్షేత్రాలలోనూ, ప్రవేశపెట్టడం జరిగింది. ఉత్తర ప్రదేశ్‌లో మాంసానికి, ఊలుకు గొర్రెలను అభివృద్ధి పరచడం దీని ఉద్దేశం.

మధురలోని పశు శాస్త్రం, పశుపోషణకు సంబంధించిన యు. పి. కళాశాలలో, సర్వసాధారణంగా 18–20 నెలలకాలంలో రెండు

(మిగతా 37 వ పేజీలో)

# పారిశ్రామిక విశేషాలు

## కేంద్ర రంగం

హైదరాబాదులో డిఫెన్స్ ఎలక్ట్రానిక్స్ ఫ్యాక్టరిని నెలకొల్పడానికై ప్రాజెక్టు నివేదిక నిమిత్తం సాంకేతిక వివరాలను రూపొందించడం దాదాపు పూర్తయింది. రాష్ట్రప్రభుత్వంచే న్యూఢిల్లీకి డిప్యూటు చేయబడిన ఇంజనీరింగ్ ఉద్యోగులు ఈ వివరాలను స్థిరీకరిస్తున్నారు.

## ప్రైవేటు రంగం

ఏలూరులోని శ్రీకృష్ణా జూట్ మిల్స్‌లో అదనంగా మగ్గాలను అమర్చుకోవడానికి కేంద్ర ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. ఈ మిల్లులో మగ్గాల సంఖ్యను 150 కు పెంచుతారు.

## సింగరేణి కాలరీస్

సింగరేణి బొగ్గు గనులలో 1963 అక్టోబరు నెలలో 312,992.9 టన్నుల బొగ్గును త్రవ్వి తీశారు. గత సంవత్సరం ఇదే నెలలో 274,265.0 టన్నుల బొగ్గును వెలికి తీయడం జరిగింది.

1963 అక్టోబరు మాసాంతంవరకు 2,732,487.2 టన్నుల బొగ్గును ఈ గనులనుంచి త్రవ్వి తీయగా క్రిందటి సంవత్సరం ఇదే నెలాఖరువరకు 2,524,418.9 టన్నుల బొగ్గును తీశారు.

## నిజాం చక్కెర ఫ్యాక్టరీ

ఈ నెలలో ఈ ఫ్యాక్టరీకి రైతుల నుంచీ, ఫ్యాక్టరీ క్షేత్రాలనుంచీ అందిన చెరకుగడ వివరాలు యీ క్రింద యివ్వబడ్డాయి. *

నవంబరు నెలలో మొదటి ఫ్యాక్టరీలో 39,487 మె.ట.ల చెరకుగడను, రెండవ ఫ్యాక్టరీలో 64,599 మె.ట.ల చెరకుగడను ఆడించారు.

ఈ మాసంలో మొదటి ఫ్యాక్టరీలో 39,082 సంచులు, రెండవ ఫ్యాక్టరీలో 62,215 సంచుల చక్కెర ఉత్పత్తి జరిగింది.

| | *ఫ్యాక్టరీ క్షేత్రాలు | రైతులు | మొత్తం |
|---|---|---|---|
| 1. కేంద్ర రైల్వే | — | 17,421 | 17,421 మె.ట. |
| 2. ఎల్‌టి. రైల్వే | 35,807 | 11,153 | 46,960 మె.ట. |
| 3. రోడ్డు | 18,961 | 21,676 | 40,637 మె.ట. |
| | 54,768 | 50,250 | 1,05,018 |

(29 వ పేజీ తరువాయి)

మర్థతకు చిహ్నం. లేదా అతని దురదృష్టం! ఇంటివిషయం అడిగితే తాంబూలం సేవిస్తూ నవ్వుతూ సభ్యత కనపరుస్తూ కొందరు — "సరేలెండి. ఈ విషయం తప్పకుండా దృష్టిలో వుంచుకుంటా. మీ కోసం ఇంత మహాపట్టణంలో ఇల్లే దొరకదా?'' అని వూరడిస్తున్నారు.

రెండవరోజు వారిని కలుసుకుంటే మరోవిధంగా మాట్లాడుతున్నారు.

"ఏమండి మీ రెక్కడన్నా విచారించారా?''

"ఏమిటండి అది?"

"నాకోసం మీరు ఇల్లు వెదికారా?''

"ఓహో! అదా! వెదకుతున్నాను. దొరకగానే చెప్పుతానులెండి!"

వాగ్దానం చేస్తున్నారు. కాని ఇల్లుమాత్రం దొరకలేదు. ప్రతిరోజు సాయంకాలం ఇంటికి రాగానే దమయంతి —

"ఇల్లుదొరికిందాండి?" అని అడుగుతుంది.

ప్రసవ సమయం సమీపిస్తోందని దమయంతి భర్తకు తెలియచెప్పింది.

ప్రసూతికోసం ఆసుపత్రిలో ఒక గది సంపాదించాడు ప్రయాసతో. తన పరివారాన్నంతా అచ్చటకు చేర్చాడు

శార్దూల విక్రీడితుడు గదిముందు పచ్చగడ్డిపై నృత్యం ప్రారంభించాడు — "మాయిల్లు! ఆహా! మాయిల్లు!" అనుష్టుప్, మందాక్రాంత, గాయత్రి సంతోషంతో కలిసి గంతులువేశారు.

మంచంమీద దమయంతికూడా నవ్వుముఖం పెట్టింది.

"ఆసుపత్రిలో పని ముగిసిన తర్వాత ఎక్కడికి పోవాలా?" అని సదాశివం ఆలోచిస్తున్నాడు.

క్రొత్తబిడ్డ లోకంలో ప్రవేశించటానికి ఇంకా మూడు రోజులు మాత్రమే వ్యవధి ఉంది 

# సంగ్రహప్రకటనలు

## బియ్యం రవాణాకు పర్మిటు

నెల్లూరుజిల్లా వెలుపల ఏ ప్రదేశానికైనా బియ్యం రవాణా చేసుకోవడానికి పర్మిట్లు జారీ చేసేందుకు నెల్లూరుజిల్లాలోని అందరు తహశీల్దార్లకు, రెవెన్యూ తాలూకా ఇండిపెండెంటు ఛార్జి గల డిప్యూటీ తహశీల్దార్లకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అధికారం యిచ్చింది. వర్తకం నిమిత్తంకాక ప్రజావసరాల కొరకు మాత్రమే బియ్యం రవాణా చేసుకోవడానికి వీరు పర్మిట్లు జారీ చేస్తారు.

## నియోను బోర్డుల వాడకం

నియోను బోర్డుల ప్రదర్శన విషయంలో యింతవరకూవున్న నిబంధనలను సడలిస్తూ రాష్ట్రమంతటా రాత్రి 7-30 గం. తర్వాత వాటి వాడకాన్ని అనుమతిస్తూ ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది.

## అంటురోగాల్ని వ్యాప్తిచేసే పదార్థాలు

1963 సం॥ పు ఆంధ్రప్రదేశ్ ఇన్ఫెక్టడ్ ఆర్టికల్స్ (పరిశోధన, పరిశీలన, నాశనము) నిబంధనలను ప్రభుత్వం ప్రకటించింది. ఈ నిబంధనలు రాష్ట్రంలోని నిజామాబాదు, మెదక్, ఆదిలాబాదు జిల్లాలకు వర్తిస్తాయి.

ఈ నిబంధనల ప్రకారం ఆహార, వ్యవసాయశాఖకు సంబంధించిన ఏ గజెటెడ్ అధికారి అయినా, లేదా రాష్ట్రప్రభుత్వం చేత యిందుకు అధికారం ఒసగబడిన ఏ అధికారి అయినా అంటువ్యాధుల వ్యాప్తికి తోడ్పడే ఏ పదార్థాన్నయినా జప్తుచేయవచ్చు. పరిశీలించవచ్చు. అంటురోగానికి సంబంధించిన పదార్థాలు మంచివాటిగా చేయడం సాధ్యమయితే ఈయన అందుకు తగిన చర్యలను కూడా తీసుకుంటాడు. అలా సాధ్యం కాకపోతే వాటిని నాశనం చేస్తాడు. అయితే, అలా నాశనం చేసే పదార్థాలను వ్యవసాయ అసిస్టెంటు హోదాకుతక్కువకాని ఆహారవ్యవసాయ శాఖకు చెందిన అధికారుల సమక్షంలో మాత్రమే జరిపించవలసి వుంటుంది.

1914 సం. పు క్రిముల సంహారం, తెగుళ్ళకు సంబంధించిన సెక్షను 3 లేదా సెక్షను 4 ఎ క్రింద (1964 సం. పు కేంద్ర చట్టం 2) కేంద్రప్రభుత్వం జారీచేసిన వివరణలో తెలియజేసిన ఏ పదార్థమయినా అంటువ్యాధుల్ని వ్యాప్తిచేసే పదార్థంగా పేర్కొనబడుతుంది.

ఈ నియమాలను ఉల్లంఘించిన వారికి రూ. 1,000 ల వరకు జుల్మానా విధించడం జరుగుతుంది.

## విద్యా రాయతీలు

ఇండియా - టిబెటు సరిహద్దులలోకిగాని, నాగాలేండులోకిగాని పంపబడిన రాష్ట్రపోలీసు శాఖకు చెందిన వ్యక్తుల పిల్లలకు యింతవరకూ మంజూరు చేసిన విద్యా రాయతీలను - పాఠశాలల్లో కట్టే జీతాల నుండి సడలింపు; స్టయిఫండు, స్కాలర్ షిప్పులు మొదలయినవి మంజూరు చేయడంలో ప్రత్యేకమైన పరిగణన మొదలయినవాటిని-నేఫా, నాగాలేండ్, జమ్మూ, కాశ్మీరు మొదలగు చోట్ల సేవ చేస్తున్న అన్ని సాయుధ పోలీసు దళాలకూ చెందిన పిల్లలకూ వారు ఈ రాష్ట్రంలోని సంస్థలలో చదువుతున్నప్పటికీ యిప్పుడు వారికి వర్తింపజేస్తూ ప్రభుత్వం ఒకప్రకటన విడుదలచేసింది. అయితే ఈసౌకర్యం ప్రస్తుత అత్యయికపరిస్థితుల్లో మాత్రమే, ఆయా ప్రదేశాలలో వారు నిజంగా పనిచేస్తున్నంతవరకూవుంటుంది.

## బియ్యం కంట్రోలు ఉత్తర్వు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, 1963 వ సంవత్సరపు బియ్యం (ఆంధ్రప్రదేశ్) కంట్రోలు ఉత్తర్వును 1963 డిశంబరు 19వ తేదీ ఆంధ్రప్రదేశ్ గజెటు అసాధారణ సంచికలో పునఃప్రకటించింది. ఈ ఉత్తర్వు రాష్ట్రంలో కృష్ణా, పశ్చిమ గోదావరి, గుంటూరు, నిజామాబాదు, వరంగల్, నెల్లూరు జిల్లాలలో తక్షణమే అమలులోకి వస్తుంది. ఈ ఉత్తర్వు క్రిందటోకుగా నాలుగు క్వింటాలులు, లేక అంతకు ఎక్కువ పరిమాణంలో ఆయా రకాల బియ్యాన్ని విక్రయించవలసిన గరిష్ఠధరలు నిర్దేశించబడినవి.

## పన్నునుండి మినహాయింపు

1963వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ వినోదపుపన్ను చట్టం క్రింద యీ దిగువ ప్రదర్శనలను 1-4-1964 తేదీ నుండి మరొక రెండు సంవత్సరాలు మినహాయిస్తూ ప్రభుత్వం ప్రకటించింది.

(1) నృత్య నాటకాలతో సహా అన్ని నాటక ప్రదర్శనలు.

(2) నృత్యం, సంగీతం, యింకా యిటువంటి వాటికి సంబంధించిన అన్ని

వినోద ప్రదర్శనలు; సంగీత, నృత్య ప్రదర్శనలు.

### బియ్యం ఎగుమతి

1959 వ సం॥పు ఆంధ్రప్రదేశ్ బియ్యం సేకరణ (లెవీ) ఉత్తర్వును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సవరించింది. దీని ప్రకారం రాష్ట్రం వెలుపలకు బియ్యం ఎగుమతి చేయదలచిన ప్రతివ్యక్తీ రాష్ట్రప్రభుత్వం కోరికను పురస్కరించుకొని ఎగుమతి చేయదలచిన బియ్యంలో 40 శాతం బియ్యాన్ని కంట్రోలు ధరకు రాష్ట్ర ప్రభుత్వానికి అమ్మవలసి వుంటుంది. అయితే అటువంటి బియ్యం యీ ఉత్తరువుక్రింద యింతకుపూర్వం లెవీకి తీసుకొనబడకుండా వుండాలి.

### గిరిజనుల అభివృద్ధి బ్లాకులు

వంకిడి (ఆదిలాబాదు జిల్లా) వరరామచంద్రాపురం (ఖమ్మం జిల్లా) కొవ్వూరు (విశాఖ జిల్లా) మొదటిదశ బ్లాకులను గిరిజనాభివృద్ధి బ్లాకులక్రింద మారుస్తూ ప్రభుత్వం ఒక ప్రకటనను విడుదల చేసింది. 2–10–1963 తేదీనుండి యిది అమలులోకి వచ్చింది.

### నరంజ నదిపై రెగ్యులేటరు వంతెన

మెదక్ జిల్లాలో నరంజనదిపై జహీరాబాదు బీదరు రోడ్డులో 4/1 మైలువద్ద ఒక రెగ్యులేటరు వంతెన నిర్మాణానికి రూ. 24,00,000 లను మంజూరు చేయడానికి ప్రభుత్వం తన సమ్మతిని తెలియజేసింది. దీనికి రెండు కాలువలు—ఒకటి కుడివైపున మరొకటి ఎడమ వైపున వుంటాయి. సుమారు 3,000 ఎకరాల పొలాలకు వీనివల్ల నీటి సౌకర్యం కలుగుతుంది.

### పంచాయతీలు

1964 ఏప్రిల్–జూన్ నెలలో అన్ని పంచాయతీలకు ఎన్నికలు జరపడానికి ప్రభుత్వం నిశ్చయించింది. కొత్తగా ఎన్నికయిన పంచాయతీలు 1–7–1964 నుండి పనిచేయడం ప్రారంభిస్తాయి.

1963 ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీ బిల్లు (సమీకృత పంచాయతీ బిల్లు)ను ఉభయసభలు ఆమోదించాయి. ఇక రాష్ట్రపతి అంగీకారంమాత్రం రావాలి.

సమీకృత పంచాయతీల చట్టం క్రింద కొత్త పంచాయతీలను ఏర్పాటు చేయడానికి యీ దిగువ సూత్రాలు రూపొందించబడ్డాయి.

(1) ప్రధాన గ్రామానికి 2 కిలోమీటర్ల లోపు దూరంలోవున్న గ్రామంలో గాని లేదా పల్లెలోగాని 1,000 జనసంఖ్య కలిగి మిగిలిన పంచాయతీలో 1000 మంది నివసిస్తూ వున్నట్టయితే ఆ గ్రామంలోగాని, లేదా పల్లెలోగాని వేరేనురొక పంచాయతీఏర్పాటు చేయబడుతుంది.

(2) ప్రధానగ్రామానికి 2కిలోమీటర్లకు మించివున్న గ్రామంలోగాని, లేదా పల్లెలోగాని 500 జనసంఖ్య కలిగివుండి, మిలిగిన పంచాయతీలో 750 జనసంఖ్య కలిగివున్నట్టయితే ఆ గ్రామంలోగాని, లేదా పల్లెలోగాని ప్రత్యేకంగా పంచాయతీ ఏర్పాటు చేయబడుతుంది.

(3) ఏజన్సీ ప్రాంతాలలో జనసంఖ్య 300 వుండాలి. పంచాయతీలమధ్య దూరం 5 కిలోమీటర్లు వుండాలి.

(4) పూర్వపద్ధతిలో వుండడానికే ఏకగ్రీవంగా ఏ పంచాయతీలోనైనా అంగీకరించడం జరిగితే, అలాంటి చోట్ల ఏ మార్పులూ వుండవు.

కొత్త పంచాయతీలను ఏర్పాటు చేయడానికై సమిష్టి పంచాయతీలనుండి అలాంటి ప్రాంతాలను విడదీయడానికి తగిన సత్వర చర్యలు తీసుకొనేందుకై జిల్లా కలెక్టర్లందరకూ తెలియజేయడం జరిగింది. 1964 జనవరి మాసాంతానికి పునర్వ్యవస్థీకరణకు సంబంధించిన ప్రతిపాదనలను పూర్తి చేయవలసిందిగా కూడా వారికి తెలియజేయబడింది.

ప్రతి పంచాయతీకి సంబంధించిన ఓటర్ల జాబితాల చిత్తుప్రతులు 1-3-1964 నాటికి, మేలుప్రతులు 1-4-1964 నాటికి అచ్చుకావాలని ఉద్దేశించబడింది. దీనికి సంబంధించినవారంతా తమపేర్లు చిత్తు జాబితాలో వున్నాయోలేవో తెలుసుకుని, లేనట్టయితే యివ్వబడిన సమయం లోపల తమ పేర్లను నమోదు చేసుకోవచ్చు.

ఓటర్లజాబితా అసలు ప్రతి అచ్చయిన తర్వాత నమోదయిన అదనపు ఓటర్లు ఓటు చేయడానికిగాని, పంచాయతీ ఎన్నికలలో పోటీ చేయడానికిగాని అర్హులుకారు.

### లఘుపరిశ్రమలు

20 హెచ్. పి.ల కన్న తక్కువగా వాడే లఘుపరిశ్రమల యూనిట్లకు మూడేళ్ళపాటు విద్యుచ్ఛక్తి సబ్సిడీని యిచ్చేపథకానికి ప్రభుత్వం సమ్మతించింది.

ఈ పథకం ముఖ్యాంశాలు: 20 హెచ్. పి.ల లోడ్ గల చిన్నతరహా పారిశ్రామిక యూనిట్లు 1963 సెప్టెంబరు 21 తేదీ నుండి యీ పథకంక్రింద విద్యుచ్ఛక్తి సబ్సిడీని పొందడానికి అర్హత కలిగి వున్నాయి. పరిశ్రమదారులు చెల్లించే వాస్తవికరేటుకు, ఒక కె.డబ్ల్యు.హెచ్.కు 9 నపై. చొ. చెల్లించే రేటుకు మధ్యగల వ్యత్యాసం సబ్సిడీగా వుంటుంది. అయితే

# పదినముత్యాలు

## తీర్చునా?

నావలచుట్టి
హార్షకలనా వలమాన
మనోంబుదంబుతో
నా వలవైరి బల్కు
నచలాగ్రణి మామక
శోకవార్థికిన్
నావ లతాంగి.
నబ్ధి రశనా వల యేశ్వరు
కేల గూర్చెదే!
నా వల పంతదీర్చెదె?
యనంత కృపారస
వాస వాసవా?

— భట్టుమూర్తి

## తుమ్మెదలు

వన తరువల్లికా
కుసుమ వాసన లోల్లక
శైల కన్యకా ఘన
ఘన వేణికా భరము
కమ్మని తావికి జిక్కి,
మ్రోయుచున్
వెనుచనియెన్
ద్వి రేఫములు వేములు
భావి వియోగ చింతచే
వనరుచు వెంటబోవు
మహీవల్లభు చూపుల
ప్రోవులో యనన్

— భట్టుమూర్తి

## వెన్నెల

జలజభవాండ మొప్పె
గళశంబు విధంబున;
నందులోన గుజ్వల మగు
చంద్రికాపటలి
సన్నుతి కెక్కె
బయఃప్రపూర్ణమై,
లలిత కళా కలాప
సదలంకృతి
చారు సుధామరీచి,
యింపుల గనియై తనర్చె –
బయి బొంపిరి గట్టిన
మీగడో యనన్

— అనంతుడు

## చంద్రోదయం

అమరు లమృతాంబు
నిధిలోని అమృతరసము
వెండి చేరుల
బటికంపు గుండ గట్టి
చేదుకొనియెదరో నాగ,
శీత రోచి
మెఱుగు మెయితోడ
యల్లన మిన్నుప్రాకె.

— తిమ్మన

## నూగారు

అలికులవేణి యారు -
నవ యౌవన మన్
వలరాచతోటలో -
బొలుచు నిత బ వేదికడ,
బొక్కిలి డిగ్గియ చెంత,
నీల సంకలిత
వలాంబు యంత్ర మగు;
గాని యెడన్
రసగుంభనంబు సంధిల
బుట మబ్బునే
నడుమ నిల్చి
ఘన స్తన సూనగుచ్ఛముల్

— భట్టుమూర్తి

## మేలుకో!

నిద్దుర మేలుకొమ్ము
రజనీ చర వంశ వతంస!
కుంకుమం బద్దిన భంగి
మింట నదె
యామిని చెల్లెలు
కుల్య సంధ్య రా
నుద్దిలు సేయుచున్న యది
యుష్ణ మయూఖ సుత
ప్రసూతికిన్
బ్రొద్దులు చొచ్చి
యున్న యవి
పూర్వ దిశా
సరసీరుహాక్షికిన్

— శ్రీనాథుడు

## హరుడూ గిరిజా

నుడిగొన్న చిగురాకు
జొంపంబు కెంపార
దలమీద మల్లికా
దాచు మడచి;
నిడుద తామరతూడు
నెట్టెంబు జట్టి పై,
బటికంపు గడియంపు
భాగ మదిమి;
తోన యాత్రేవ
గెందొవ తేకు హత్తించి,
మెడ చక్కి కస్తూరి

మెదిచి పూసి
పాయ గొమ్మల
నల్లపట్టు దగిల్చి,
య క్కొకన యాకుపై
వెండి కోర వెట్టి;
ధవళ కేతక ధూళి
గాత్రమున దఱచి,
మోక మామిడి
కొక కొంత మ్రొక్కి నిలిచి,
యొడలిలో జక్కసగము
నా కొసగు మనుడు
నద్రి కన్యక తలవాంచె
హరుడు నవ్వె

— నాచన సోమన

## చూపులు

కలయం గూర్మి
జెమర్చు నంగముల
లగ్నంబైన సన్నంపు
మంజుల కౌశేయమందు
మించు కసుల
స్తోమంబుచే జూచె
నొక్క లతాతన్వి
చెలంగి పొంగు,
మది కాంక్షల్ దీర
మేనెల్ల గన్నులు గావించి
కుమారు జవ్వనము
చెన్నుం జూచు
చందంబునన్

— పెద్దన

## మంచము

మొలక మెఱుంగు
కెంపుమొన ముక్కులనిక్కు
కిరీటి పచ్చ డా చిలుకల
కోళ్ళలో,
చికిలి చెంద్రిక వన్నియ
పట్టు పట్టితో
దోలకు పసిండి
వ్రాత తెరలో,
నెఱతావుల మేలు కట్టులో
జలువలు చిందు
ముత్తియపు జన్పర
మంచముపై మహోన్నతిన్

— భట్టుమూర్తి

## చదురులేనివారు

మది సుఖము గోరి
దుఃఖం బొదవంగల
కార్యములకు
నుత్సాహము సేయుదు,
రొప్పని తృష్ణంబడి
చదు రేమియు లేనియట్టి
జను లాతురులై.

— తిక్కన

## వర్షర్తువు

గత సంతానము
శీతలీ కృత మహీ
కాంతాంగ,
మత్యుద్గతస్మిత
కుందోత్కర
కేతకీ కుటజ
రాజి భ్రాజితామోద,
మూర్ఛితవల్లీ ప్రకరంబు,
వర్ధిత శిఖిశ్రేణీ
ప్రమోదంబు-
రమ్యతరంబై
కుతలంబు నాబరగె
వర్షారంభ మత్యున్నతిన్.
చలిగాడ్పుల ముసరుల
మెయి వలిగొని,
ధాత్రీ పురంధ్రి
వలిబచ్చని కంబళి
గవిచికొన్న విధమున-
నొలువుగ
జిప్పరువు గలిసె
భూతల మెల్లన్.

— నన్నెచోడుడు

యీ చెల్లింపు ఒక కె. డబ్ల్యు. హెచ్. కు 9 నపైకు లోపు వుంటుంది.

సబ్సిడీ పొందడానికి తగిన లఘు పరిశ్రమలు :

ఇంజనీరింగు, వ్యవసాయపు పరికరాల తయారీ, ఉలులు, మెషినుపరికరాలు, పంపులు, ఇంజనీరింగు భాగాల తయారీ, సైకిళ్ళు, కుట్టుమిషన్లు, వాటి భాగాలు సహాయక పరికరాలతయారీ, ఉక్కు మరియు ఇనుములేని రోలింగ్ మిల్లులు, ఇంజనీరింగు, సైంటిఫిక్, డ్రాయింగు పరికరాలతయారీ, వైద్య, శస్త్రచికిత్సా పరికరాల తయారీ, మెటల్ ప్రెస్సింగ్, షీట్ మెటల్ వర్క్సు, తీగలు తీగవస్తువులు వైర్ డ్రాయింగ్ మరియు ఇన్సులేటెడ్ కాపర్ వైర్స్, బోల్టులు, నట్లు, స్క్రూలు, రివిట్లు మొదలయినవి. సాధారణ పనులకు ఉపయోగించే ఇంజనీరింగు వర్కుషాపులు, పోత మరియు వెల్డింగ్ షాపులు, ఆటో రిపేరు, వర్కుషాపులు, కార్ల విడి భాగాలూ, సహాయక ఉపకరణాలు, ప్రెస్ బటన్‌లతో సహా బటన్లు, షూటింజిలు, కత్తులు ఇనుపసామాన్లు మొదలగు రేజరు బ్లేడులు, బ్లేడుకు పదును పెట్టే సామానులు మొదలయినవి. యంత్రాలతో కూడిన ఆట సామానులు, పరిశ్రమలలోను గృహాల లోను ఉపయోగించే బ్రష్‌లు, గొడుగుల పరిశ్రమ. అల్యూమినియం వస్తువులు, ఇత్తడి, ఇత్తడిముల్లులు, బిరడాలు మొదలయినవి. స్టెయిన్ లెస్ స్టీల్ పాత్రలు, నీటిమీటర్లు, ఆయిల్ స్టవ్ లు, బర్నర్ లు, మెట్రిక్ తూకాలు, రంపాలు, గేల్వనైజింగ్ యూనిట్లు.

విద్యుచ్ఛక్తికి సంబంధించినవి : మోటార్లు, ట్రాన్స్‌ఫార్మర్ లు, స్విచ్ గేర్ లు మొ॥ ఎలక్ట్రోప్లేటింగ్ షాపులు, రేడియో రిసీవింగ్ సెట్ల నిర్మాణం, గ్రామఫోనులు, రేడియో గ్రాములు, ఆంప్లిఫైర్లు, దూరశ్రవణ యంత్రాలు. టేపురికార్డులు వాటిభాగాలు, సినిమా ప్రొజెక్టర్లు, ఎలక్ట్రిక్ బల్బులు. ఫ్లోరసెంట్ లైట్లు మొదలగు విద్యుచ్ఛక్తికి సంబంధించిన పరికరాలు, మీటర్లు, ఎలక్ట్రిక్ కేబులులు స్టోరేజిబేటరీలు.

కర్రపని : వడ్రపుపని, కర్రసామానుల తయారీ, రంపపు కోతమిల్లులు, టింబర్ సీజనింగ్ ప్లాంటులు, వెదురుగడలతో చేసే వస్తువులు ప్లాంటులు.

గాజు, ఎనామిలు : ఎనామిలు వస్తువులు, గాజు వస్తువులు, వాక్యూమ్‌ఫ్లాస్క్ పరిశ్రమ, శాస్త్రీయ, పరిశోధన శాలల గాజు పరికరాలు, గాజులు.

కుమ్మరపని, పింగాణి : రిఫ్రాక్టరీలు, శానిటరీ పరికరాలు, రాతిగొట్టాలు. ఇటుకలు, పెంకులు సిమ్మెంటు గొట్టాలు, ఇతర సిమ్మెంటు వస్తువులు, పలకల పరిశ్రమ, పెన్సిలు తయారీ, పింగాణి. కుమ్మరపు వస్తువులు.

కెమికల్స్, ఫుడ్ ప్రాసెసింగ్ : బట్టల రంగులు, అగ్గిపుల్లలు, స్టార్చి, రొట్టెల తయారీ, బిస్కట్ల తయారీ మొ॥ రంగులు, వార్నిషులు, పారిశ్రామిక, పరిశోధనాగార రసాయనిక పదార్థాలు మొ॥ ఫ్రూట్, ఫిష్ కేనింగ్, మంచుగడ్డ, వాయుప్రసార నీరు, అలంకరణ సామగ్రి, సౌందర్య లేపనాలు, టూత్ పౌడరు, పేస్టులు మొ॥ గ్లూ మరియు గేలటైన్, సిరాలు, రబ్బరు వస్తువులు, క్రిమి సంహారక మందులు, తెగుళ్ళ నిరోధకమందులు, ప్లాస్టిక్ మోల్డింగ్, ప్లాస్టిక్ ఆటవస్తువులు మరియు వస్తువులు, సబ్బుతయారీ.

ఇతరములైనవి : కాగితపుసంచులు, కవర్లు మొ॥ కాగితం, కార్డ్ బోర్డ్ తయారీ, స్టేషనరీ సామాను, ఆటవస్తువుల తయారీ, మేజోళ్ళు, కలాలతయారీ, నేత, నదుకు (ప్రత్తి, వూలు మొ॥), సంగీత పరికరాలు, చర్మశుద్ధి, వాటి పరికరాల తయారీ, చెప్పులు, బొనుమిల్లు యింకా బోర్డు అంగీకరించిన పరిశ్రమలు ఏవయినా సరే.



(31 వ పేజీ తరువాయి)

కాన్పులకు బదులు 14 నెలల కాలంలో రెండు కాన్పులను కలిగించడంపై పరిశోధనలు విజయవంతంగా కొనసాగాయి.

*సహకార విక్రయశాలలు:*

భారత ప్రభుత్వానికి సంబంధించిన ఒకానొక పథకం ప్రకారం ఉత్తరప్రదేశ్‌లో 60,000 పైచిలుకు జనాభాగల 27 పట్టణాలలో 27 హోల్ సేల్ సహకార విక్రయశాలలను ప్రారంభించడానికి ఉద్దేశించబడింది. దీనికి తోడు 1062–63, 1963–64 సం. కాలాల్లో పై పట్టణాలలో ప్రతి ఒక్కదానిలోనూ 20 ప్రాథమిక సహకార వినియోగదారుల అంగడుల ప్రవేశపెట్టబడ్డాయి గ్రామీణ ప్రాంతాలలోనూ, కొండ ప్రాంతాలలోనూ వినియోగదారుల అంగడులను స్థాపించే సూచనలు యింకా ఆలోచనల్లో వున్నాయి.

*కిషావ్ ఆనకట్ట:*

కిషావ్ ఆనకట్టను ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం నిర్మిస్తుంది. హిమాచల ప్రదేశ్, పంజాబ్, ఢిల్లీ, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాలు యీ ఆనకట్ట నిర్మాణ వ్యయాన్ని, లాభాలను పంచుకుంటాయి.

*రాష్ట్రంలో ఉద్యోగ విధానం:*

అర్థగణాంకశాఖ డైరెక్టరు నిర్వహించిన సర్వే ప్రకారం 1959–60 సం. రాష్ట్రంలోని పట్టణ ప్రాంతాలలో సగటున ప్రతి నూరుమందికి ఒకరు మాత్రమే నిరుద్యోగి. నిరుద్యోగులలో సగంమంది అవివాహితులు. 3/4వంతులు చదువుకున్న వారు. నాలుగో వంతుమంది మాత్రమే సర్వేచేసే సమయానికి ఉద్యోగ సాధక కేంద్రాలలో నమోదయి వున్నారు. ఉద్యోగంలేనివారిలో సగంమంది మొదటిసారిగా ఉద్యోగంగురించి ప్రయత్నిస్తున్నవారు. చాలామంది విషయంలో నిరుద్యోగ సమయం ఒక ఏడాదికన్న ఎక్కువ లేదు.



నాటిక :




'ప్రేమేంద్ర'

పాత్రలు :
నిత్యానందం
రామనాథం .... నిత్యానందం తండ్రి
నీరజ .... నిత్యానందం భార్య

(తెర లేచేసరికి రామనాథం వాలుకుర్చీ లాక్కుని వార్తాపత్రిక చదువుతూ వుంటాడు. అప్పుడే నీరజ లోపలి గది నుండి వస్తుంది.)

నీరజ : ఇంతవేళ అయ్యిందిగా ? యీయన యింకా రాలేదు మావఁగారూ :

రామ : (పేపరు మూసేసి) అదే నేనూ అనుకుంటున్నా నమ్మా ! ఎప్పుడూ వాడు యింత వేళవరకూ ఆఫీసులో వుండలేదే !

నీరజ: సినిమాకి వెళ్ళిపోయి వుంటారేమో !

రామ: చెప్పకుండా వెళ్తాడా? నాకు నమ్మకం చాలదు.

నీరజ : అదీ నిజమే! అవుతే, మరెక్కడికి వెళ్ళివుంటా రని !

రామ : మరో పది నిముషాలుగా చూసి, అప్పటికీ రాకపోతే, నేను వెళ్ళి వాకబు చేస్తాలే అమ్మా !

(నీరజ లోపలికి వెళ్ళిపోతుంది. రామనాథం మళ్ళీ పేపరు తీసి చదవడానికి వుపక్రమించే సమయానికి నిత్యానందం యెదంవేపునుండి వస్తాడు.)

రామ : ఏవిఁట్రా యింత ఆలస్యం ? ఇంతవరకూ ఆఫీసులోనే వున్నావా ?

నిత్యా : లేదు నాన్నా (చేతిలోవున్న సంచిని బల్లమీద పెట్టి వుస్సురనుకుంటూ విట్టూరుస్తాడు)

రామ : అవుతే మరెక్కడికి పోయావు ?

నిత్యా : చక్కెర నిండుకొందనినీరజ చెప్పింది నాన్నా వుదయం. అందుకు ఆఫీసునుండి వస్తూ దుకాణానికి వెళ్ళాను. అక్కడ 'క్యూ' లో నుంచున్నవారిని చూసి నాకు మతిపోయిందంటే నమ్మండి. కాని, యేంచెయ్యను; రేపు వుదయానికి కాఫీ కావాలంటే, చక్కెర వుండాలి. అందుకని 'క్యూ' లో నేనూ ఒకణ్ణి అయ్యాను.

రామ : (విస్తుపోయి) ఏవిఁటీ; చక్కెర కొనడానికి 'క్యూ' లో నిలబడ్డమా ? ఎన్నడూ వినలేమురా;

నిత్యా : ఇప్పుడు వింటున్నారుగా; నేను సుమారు ఓ గంటకాలం 'క్యూ'లో నుంచుంటేనే గాని, నాకు చక్కెర దొరకలేదంటే, అక్కడ యెంతమంది నుంచుని వున్నారో, మీరే వూహించుకోండి.

రామ : మనిషి పురోగమిస్తున్నకొద్దీ, జీవితావసరాలకు మరింత యాతన పడాల్సి వస్తుంది. అయినా, చక్కెరకు యింత కరువువచ్చిందేవిటి? అత్యవసర పరిస్థితి అమల్లోకి తీసుకురావడం కాదుగాని, సామాన్యకుటుంబీకులు నానా యిక్కట్లు పడాల్సివస్తుంది.

నిత్యా : అత్యవసర పరిస్థితి యేం చేసింది నాన్నా.

రామ : మరింకేమిటి ? ఎప్పుడూ లేనిది యిప్పుడే చక్కెరకు కరువు రావాలా?

నిత్యా : దానికి ప్రభుత్వం యేం చేస్తుంది చెప్పండి ; మనం ప్రతి విషయంలోనూ ప్రభుత్వాన్నే నిందించడం సబబుగా వుండదు. ఈ అత్యవసర పరిస్థితిని అవకాశంగా తీసుకొని, పెద్దపెద్ద వ్యాపారస్తులు అధిక లాభాలు గుంజడానికి వేసే యెత్తుల్లో యీ చక్కెర కరువు ఒకటి. ఈవేళ చక్కెర,రేపు బియ్యం, యెల్లుండి కిరసనాయిలు – ఒకటేవిఁటి ? ప్రతి వస్తువూ దొరకడం దుర్లభం కావచ్చు ననడం అతిశయోక్తి కాదు. అవుతే, వీటన్నిటికి ప్రభుత్వానిదే బాధ్యత అనడం సబబు కాదని నా వుద్దేశ్యం. ఈ అవాంతరాల్ని తప్పించడానికి, ప్రభుత్వం తగు చర్యల్ని తీసుకుంటున్నా, చప్పున అదుపులో పెట్టడానికి వీలులేకపోతోంది. ప్రజల్లో కాస్తంత వోపిక అవసరం.

రామ : (అదోలా నవ్వి) మొదట్నుంచీ అదే నినాదం వినిపిస్తోందిరా. 'ఓపిక వుండాలి ప్రజల్లో' అంటూనే వస్తున్నారు నాయకులందరూ. అవుతే, ఆ 'ఓర్మి'కి హద్దంటూ వుందా ? అయినా, నాకు తెలీక అడుగుతాను – చైనావాళ్ళు మరి దండెత్తరని స్పష్టమౌతున్నా యింక యెందుకీ అత్యవసర పరిస్థితి చెప్పు ? ఈ పరిస్థితిని ఆధారంగా తీసుకొని, చాలామంది స్వార్థపరులు ధరలు పెంచుతున్నారు..సరకుల్ని నిలువజేస్తున్నారు.

నిత్యా : అత్యవసర పరిస్థితి, ప్రస్తుతం అనవసరమని అనుకోవడం శుద్ధపొరపాటు నాన్నా. చైనీయులు చెప్పే మాటలకూ వారి చేతలకూ యెక్కడా సమన్వయం లేదు. ఇటీవల వారు మళ్ళీ సైన్యాన్ని ప్రోగు చేస్తున్నట్టు వార్తలు వస్తున్నాయామరి ; అదీగాక అక్కడ కొన్ని ప్రాంతాల్లో తిండికిలేక మలమల మాడే

ప్రజానీకం ప్రభుత్వంమీద విరుచుకుపడే స్థితికి వచ్చిందట. అటువంటి వారికి మార్గం చూపించాలంటే, పొరుగుదేశం మీదికి పంపడం వుత్తమంగా తోచవచ్చు. అందుకే మన ప్రభుత్వంకూడా అప్రమత్తతతో ప్రయత్నాలు సాగిస్తోంది. ఇప్పుడు మనం యెటువంటి దాడినైనా తిప్పి కొట్టగలిగేశక్తితో వున్నాం. ఈ పరిస్థితి వున్నన్నాళ్ళూ, అత్యవసర పరిస్థితే అమల్లో వుండడం యెంతో అవసరం. అవుతే, యీ సమయంలో ప్రజలు కొన్ని యిబ్బందులకు గురి కావల్సివస్తుంది. వాటన్నింటినీ సంతోషంతో భరించడమే ప్రజల కర్తవ్యం. అదే వారు తమ మాతృదేశానికి చెయ్యగల త్యాగం.

రామ : ప్రజలు మాత్రం యింకెంత త్యాగం చేస్తార్రా? రక్షణనిధి కోరితే, ధారళంగా విరాళా లిచ్చారు. ఆఫీసుల్లోనూ, కర్మాగారాల్లోనూ, అధికంగా పనిచేయడం ద్వారా ప్రభుత్వానికి సహకరిస్తున్నారు. బంగారం కంట్రోలు అమల్లోకి తెస్తే, దాన్ని భరించారు. సరకులపై పన్నులు విధిస్తే, అవీ భరించారు. నిర్బంధ పొదుపు ప్రణాళిక అమలు జరుపుతున్నారు. దానికీ ప్రజలు వ్యతిరేకం వ్యక్తం చెయ్యరు. ఇంక యేం త్యాగం చెయ్యమంటావు చెప్పు?

నిత్యా : మనం చేస్తున్న త్యాగాలు ఒకరి కోసం కాదుకదా నాన్నా. మన మాతృదేశాన్ని రక్షించుకొందుకు మనం యెన్ని త్యాగాలయినా చెయ్యాలి. తప్పదు.

(నీరజ వస్తుంది లోపల్నుంచి)

నీరజ: ఎంతసేపయ్యిందండీ మీ రొచ్చి?

నిత్యా : ఏదీ! ఓ అయిదు నిమిషాలు...

నీరజ: వస్తూనే వాదన ప్రారంభించారేవిటి?

రామ: ఏముందమ్మా నీరజా! పీడు అత్యవసర పరిస్థితి అవసరమంటాడు. అది నాకు అవసర మనిపించదు.

నీరజ: పోనిద్దురూ! మనకెందుకా రాజకీయాల గొడవ?

రామ: అదేవిటమ్మా, ఒక్కసారి అలా కొట్టి పారేశావు? రాజకీయాలకీ, మన జీవిత విధానానికీ సంబంధం వుంది గాబట్టే, అనుకోవడం. ఈ అత్యవసర పరిస్థితివల్లనే కదమ్మా, సరకుల ధరలు పెరిగి పోతున్నాయి? ధరలు పెరగడం మాట అటుంచితే, అవి దొరకడం కూడా దుర్లభమైపోతుంటే యెట్లా? ఈవేళ చూడు, చక్కెరకోసం అప్పాయి ఒకగంట 'క్యూ'లో నుంచున్నాట్ట.

నీరజ: (ఆశ్చర్యంగా భర్తకేసి చూసి) ఔనాండీ?

నిత్యా : ఔను నీరజా! ఇంతశ్రమ తీసుకు నుంచుంటే, నేను అడిగినంత చక్కెర దొరకలేదు. ఒకే ఒక్క కిలో యిచ్చారు. మళ్ళీ వారం తర్వాత మరో కిలో దొరుకుతుందట.

నీరజ: (విస్తుపోయి) అలా అవుతే, మనం యేం చేస్తామండీ? మనకి వారానికి, కనీసం రెండు కిలోలైనా వుండాలికదా.

నిత్యా: ఏం చేస్తాం నీరజా! తగ్గించుకోవాలి. కాఫీలో కాస్తంత తీపి తక్కువైతే, నష్ట మేమీ లేదు.

రామ : నేను మాత్రం తీపి తక్కువైతే, కాఫీ తాగలేను సుమా!

నిత్యా : అలా అంటే యెట్లా నాన్నా? ఏ యెండకు ఆ గొడుగు పట్టమని మీరే అంటారుగా! పరిస్థితి సర్దుబాటు అయ్యే వరకూ యెలాగో సర్దుకుపోవాలి.



రామ : ఇదీ ఒక త్యాగమే అంటావా?

నిత్యా : కాదేమిటి మరి? మన అవసరాల్ని అందుబాటుకి తగినట్టు తగ్గించుకుంటే నల్లబజారుని ప్రోత్సహించనివాళ్ళం అవుతాం. అది ఒక విధం త్యాగమే కాదు; ప్రభుత్వానికి సహకారంకూడాను.

నీరజ : అయినా చక్కెరకి యెందుకండీ యీ కరువు? సరిహద్దు ప్రాంతాల్లో వున్న మన సైనికులు అంత అధికంగా చీనీ వాడుతున్నారా?

నిత్యా : అక్కడే మనం పొరబడుతున్నాం నీరజా : ప్రతివిషయంలోనూ మనం ప్రభుత్వాన్నే దుయ్యబట్టడానికి ప్రయత్నిస్తాం. కాని మన తోటి సోదరులైన పెద్ద పెద్ద వ్యాపారస్తులు ప్రజలకు చేస్తున్న మోసాన్ని విస్మరిస్తున్నాం. ఇటువంటి అవకాశాల్లోనే కదా వాళ్ళు లక్షలకు లక్షలు ప్రోగుచేస్తుంటారు?

నీరజ : అవుతే, వారిని అదుపులో పెట్టి, తగు చర్యలు తీసుకునే బాధ్యత ప్రభుత్వానిది కాదంటారా?

రామ : అదీ: అలా అడుగమ్మా:

నిత్యా : కాదని యెవరన్నారు; అవుతే, అందుకు కొంత వ్యవధికూడా అవసరం. అంతవరకూ మనం యీ పరిస్థితిని యెదుర్కోవడం తప్పించి, యింకేమీ చెయ్యలేం.

రామ : ఎందుకు చెయ్యలేం? ధరలు తగ్గించమని నినాదాలు చేయగలం. నిరాహార దీక్ష వహించగలం. కాని, అత్యవసర పరిస్థితి ఒకటి వుందిగా! అందుకే ప్రతి వ్యక్తి భయపడిపోతున్నాడు. ఒక్కరూ నోరెత్తలేకుండా వున్నారు.

నిత్యా : (నవ్వుతూ) మీరు వయసులో పెద్దవారే గాని నాన్నా, యేదీ దూరంగా యోచించలేరు. ప్రభుత్వం అత్యవసర పరిస్థితి పెట్టడం— ప్రజల్ని యిరకాటంలో పెట్టడానికి కాదు. వారిని సంరక్షించడానికి. ప్రభుత్వాన్ని సానుభూతితో అర్థం చేసుకోండి నాన్నా: మనకి స్వాతంత్ర్యం తెచ్చిపెట్టిన మహానాయకులందరూ యెన్ని కష్టాలకు లోనయ్యారు? వారి త్యాగానికి, వారి శ్రమకు ఫలితంగా, యిప్పుడు మనం స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నాం. అలాగే మనంకూడా మనదేశం కోసం కొన్ని త్యాగాలు చేస్తేనేగాని, భవిష్యత్తు పూలబాట కాదు. ప్రభుత్వాన్ని విమర్శించేవాళ్ళు యెప్పుడూ వుంటారు. ప్రస్తుతం ప్రభుత్వాన్ని విమర్శిస్తున్న మహానుభావులే రాజ్యాంగం నడపడం తటస్థిస్తే, వారు మాత్రం విమర్శకు దూరంగా వుండగలరా? ఏన్నటికీ వుండలేరు. సర్వకాల సర్వావస్థల్లోనూ విమర్శకులుంటారు. ఎవరు యేం అన్నా, ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకోవాలి. ప్రభుత్వమంటే యెవరు? మనమే. ప్రభుత్వమే మనం...మనమే ప్రభుతం; అందుకే, ప్రభుత్వం పట్ల విశ్వాసం, గౌరవం, వుండాలి ప్రతీ వ్యక్తిలోనూ. అప్పుడే, మనం యెంతటి విపత్కర సమస్యల్ని అయినా యెదుర్కోగలం. మన ప్రజానీకానికి ప్రభుత్వం పట్ల అపారమైన విశ్వాసముంది. గౌరవం వుంది. ఆ విషయం యిటీవలనైనా దురాక్రమణ సమయంలో తేటతెల్లమయ్యింది. అవుతే, ఒక్క విశ్వాసం, గౌరవం వుంటే చాలదు. త్యాగంకూడా వుండాలి.

రామ : ఎంత ఉపన్యాసం యిచ్చావురా? నిజానికి నువ్వు చెప్పిందే నిజం, ప్రతి విషయాన్నీ అత్యవసర పరిస్థితితో ముడిపెట్టకూడదని యిప్పుడు నిర్ణయించుకున్నాను. ఏదో క్షణికమైన ఆవేశంలో మొదట అలా అనేశాను.

నీరజ : (ఆనందంతో) హమ్మయ్య! ఇప్పటికైనా మీ వాగ్వివాదం అంతమయ్యింది. అందుకు సంతోషం.

నిత్యా : ఈ చక్కెర తీసుకుపోయి రెండు కప్పుల కాఫీ తీసుకురా నీరజా:

రామ : వద్దమ్మా నీరజా: కొద్దిసేపటి క్రితమే కదా నేను కాఫీ తీసుకున్నాను: వాడికివ్వు ప్రస్తుతం... చక్కెర అయిపోతే మళ్ళీ యిబ్బంది.

నీరజ : (నవ్వుతూ ఫరవాలేదులెండి మావయ్య గారూ: చక్కెర అయిపోతే బెల్లంతో కాఫీ ప్రారంభిద్దాం.

రామ : (నవ్వి) అంతేగాని కాఫీ మానుకోలేమంటావ్... సరే... ఇదీ ఒకవిధమైన త్యాగమే:

(ముగ్గురూ నవ్వుతారు. నీరజ సంచీతో చక్కెర తీసుకు పోతూండగా)

—తెర—





హైదరాబాదు సాలార్‌జంగ్ మ్యూజియంలో ఆఫ్ఘన్ నేషనల్ అసెంబ్లీ అధ్యక్షుడు డా. అబ్దుల్ జహీర్ నాయకత్వంలో వచ్చిన ఆఫ్ఘన్‌దేశపు ప్రతినిధుల బృందం.



నూజివీడు చెరువులోని చేప. ఈ 'కట్ల' చేప 30 అం॥ పొడవు 30 పౌ. బరువు వుంది. (చూ. పేజి 21)



10-1-1964 వ తేదీన హైదరాబాదులో విస్తృత పౌష్టికాహార కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టే విషయంపై ప్రణాళికా మంత్రి, రాష్ట్రంలోని యితర అధికారులతో చర్చిస్తున్న యునెసెఫ్ కార్యవర్గ సభ్యులు.

విశాఖపట్నం జిల్లా ములగాడ గ్రామంలో ఈస్ట్ ఏంగిలియా ప్లాస్టిక్స్ లిమిటెడ్‌కు 13-1-64 వ తేదీన శంకుస్థాపన చేస్తున్న లాల్‌బహదూర్ శాస్త్రి



డిశంబరు 23 వ తేదీన కేంద్ర పెట్రోలు, రసాయనిక శాఖలమంత్రి ప్రొఫెసర్ హుమాయూన్ కబీర్ హైదరాబాదులో ప్రభుత్వ లలితకళలు, వాస్తుశిల్పం కళాశాల నూతన భవనానికి శంకుస్థాపన చేస్తున్న దృశ్యం.

డిశంబరు 21 22 తేదీలలో హనుమకొండలో జరిగిన జిల్లా సంగీత నాటక సమ్మేళనంలో పాల్గొన్న వరంగల్ జిల్లా మట్వాడలోని ప్రభుత్వోన్నత పాఠశాల బృందం ప్రదర్శించిన "నా దేశం అనే తెలుగు నాటకంలోని ఒక దృశ్యం ఈ నాటకం ఉత్తమమైనదిగా నిర్ణయింపబడి మండల పోటీకి ఎన్నిక చేయబడింది



5-1-1964 న జరిగిన ఖమ్మం జిల్లా సంగీత నాటక సమ్మేళనంలో పాల్గొని సంగీతంలో ప్రథమ బహుమతిపొందిన పందిళ్ళపల్లి జిల్లా పరిషత్తు సెకండరీ పాఠశాల బుర్రకథ దళం



*ఆంధ్ర ప్రాంతంలో ఉత్తమ పంచాయతీ :* 1963 సం. కాలానికి ఉత్తమ పంచాయతీగా తూర్పుగోదావరి జిల్లాలోని రంగంపేట ఎన్నిక చేయబడింది. ఈ చిత్రంలో ప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ ఎం. పి. పాయ్, ఐ. సి. ఎస్., గ్రామపంచాయతీ అధ్యక్షుడు శ్రీ వి వి లక్ష్మీపతికి రూ 15 000 ల చెక్కును బహూకరించడం చూడవచ్చు

# ప్ర గ తి గా ము ల...

రామకృష్ణ భరద్వాజ

ఆకసవీధి నున్నత మహాభ్రపటాంచల దైర్ఘ్య సంవృతా
స్తోక నిరోధ విస్తృతులు - దుర్లభ సత్త్వః మర్థ సంపద
న్వీవున దాఁటి నేఁటికి నవీన సమీరముచే స్వతంత్రతో
త్సేక విలాస భాసురత దీర్ఘపతాక చిరమ్ము వర్ధిలున్.

అట్టు లున్నత వైహాయ సాధ్వరమణ
గమన గంభీరమౌ పతాకమున కట్టు
పైకి సారించి హర్షసంభ్రమముఁ గొనక
భారతమ్మది యేల విచార మందు?

మాటు పఱచును వెన్నెలన్ మబ్బుతునుక -
ఒనరు క్షీరమున్ విఱుచుగా నుప్పుఱాయి -
ఒక్క లోపమ్మె చాలును చక్కఁదనము
చెడుట - కట్టి దీకొఱ తన చింత కగునొ?

బలవంతము తన సంతతి,
ఫలవంతము తనదు చోటు, పనుల ధనములన్
గల సంపదయై మనమునఁ
గలతంబడు భరతమాత - కారణ మేమో?

ఊహఁ దోఁచిన వ్యాఖ్యాన ముచితరీతి
నామె కొఱఁతకు సంధింతు మర్థ మనుచు,
నది యథార్థమ్ముఁగా వచ్చు - నైన మృదుల
హృదయవేదన కొలఁదిగా నిట్టు లనుట...

పదునాల్గేండ్ల స్వతంత్ర భారతమ! సంపద్దేమభూపాలస
న్మృదు సర్వాంగ మనోహరాకృతుల మూర్తీభూత
సౌభాగ్యమై -
ఎద ఖేదమ్మె ముఖాన దాఁచెడు తెఱంగేదో వెతన్
దెల్పుఁ - బ
య్యెద కాళించు పరప్రకాశమనల ధౌర్త్యం బోపమిన్
గాదుగా!

"శాంతము - శాంత"మన్న నుడి శాశ్వతజీవము
నంది - శబ్దితా
శాంత పునర్వియాస నతిశక్తి సమీపముఁ జేరి నీదు నా
శాంతిమ రేఖఁ గర్ణముల నాదృతి నిల్పఁదడీయనై జరూ
పాంతరమూర్తి నిర్మలత కక్కజ మందుచు నుంటివా
మదిన్!

మాటకు భావవిస్ఫురణమాత్రమె లక్ష్యమటంచు నెమ్మి ము
మ్మాటికి నమ్మె భారతమ! మాటల స్వత్వముకై
చలానఁబో
రాటము సల్పు సంతతికి హాసపహిష్ణుత నుండుమమ్మ! బా
హాటపు దైన్యమంది యపహాస్యవుగాకుము పొర్గువారిచే..
అన్నము-నీటనున్ గుడిపి యందఱఁ దుల్యులు గాఁగఁ
బెంచు సం
పన్న గృహస్థురా లయిన భారతమాత! అనుంగుబిడ్డలా
యన్నము-నీటికేకొసరియాశఁబరస్పర మాగ్రహించుచున్
నిన్నుఁగలంచ-నట్టి శిశునిష్ఠురతన్ గని జాలి నందుదే!

అయిన నా లోటు లేమంత హానికరము
గావు-నశియించు నమ్మ! సుఖమ్మె గొనుము-
అమృతమును గోరి శ్రమియించు నమరవరుల
కేమి కీడయ్యె విష ముద్భవిల్లికతన?

నిర్మాణాత్మక కార్యనిర్వహణ సాం
ద్రీభూతయత్నమ్ములో
ధర్మాధర్మ విచారణాప్రవణతా
ధ్యాన ప్రబోధమ్మె స
త్కర్మోపాయముఁ జూప సంభవిలు ను
త్పాతమ్మె నిర్జీవమై -
స్వర్మాహాత్మ్య ఫలాప్తి తథ్య మగుటన్
బాటింప కా లోపమున్.

తన సొమ్మె పరుల కప్పనము గా శౌర్యమున్
బాయదే నాటికిన్ భరతజాతి-
తన మాట రాజశాసనము గా శాంత మే
వరశస్త్ర మని నమ్మె భరతజాతి-
తన యూహ దేశభావనముగాఁ దలపోసి
ఫలసాధనము నెన్నె భరతజాతి-
తన వంతు న్యాయపాలన మని దానికే
పంతమాడుచు నుండు భరతజాతి-

అంతియే కాని యితరమౌ నలఁతి పనుల
పాలికేవేళఁ బోవదు భరతజాతి-
కాన సంతుష్టి నీ మది నూని సుతులఁ
బ్రగతిగాముల దీవించు భరతమాత!'



### ఆదిలాబాదు జిల్లా

*గ్రామసహాయకుల శిక్షణ శిబిరం:*

ఆదిలాబాదు పంచాయతీ సమితిలోని కోట్ర, గోటుకూరు గ్రామాలలో రెండు ప్రత్యేక గ్రామసహాయకుల శిబిరాలు నిర్వహింపబడ్డాయి. వివిధ అభివృద్ధి కార్యక్రమాలలో సహాయకులు శిక్షణ పొందారు. ఒక్కొక్క శిబిరంలోను నలభై మందికి శిక్షణ యివ్వడం జరిగింది.

### చిత్తూరు జిల్లా

*చెరువులకు మరమ్మతులు:*

డిశంబరు నెలలో కార్వేటి నగర్ పంచాయతీ సమితికి చెందిన గుండుపల్లి, కదిరిపల్లి, ఈడువారిపల్లి, మాదవాడ గ్రామాలలో చెరువుల మరమ్మతు పనిని గ్రామీణ స్వచ్ఛంద సేవాదళ సభ్యులు చేపట్టారు.

### తూర్పు గోదావరి

*మట్టిరోడ్లు:*

డిశంబరు నెలలో ప్రత్తిపాడు పంచాయతీ సమితిలోని మర్రిపాక, ఒమ్మంగి, ఉత్తరకంచి గ్రామాలలో మూడు మట్టిరోడ్లను రక్షణ శ్రామిక సభ్యులు వేశారు.

### గుంటూరు జిల్లా

*రసాయనిక ఎరువుల పంపిణీ:*

ఈమని పంచాయతీ సమితిలో డిశంబరు నెలలో 28,558మణుగుల రసాయనిక ఎరువులు, 177 మణుగుల పచ్చిఎరువు విత్తనాలు పంపిణీ చేయబడ్డాయి. ఈ సమయంలోనే రెండు గ్రామసహాయకుల శిక్షణ శిబిరాలను నిర్వహించి 80 గ్రామ సహాయకులకు శిక్షణ యివ్వడం జరిగింది.

### హైదరాబాదు జిల్లా

*గ్రామసహాయకుల శిక్షణ శిబిరం:*

డిశంబరు 29వ తేదీనుండి మూడు రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం ఒకటి నూతంకల్ గ్రామంలో నిర్వహించబడింది.

### కరీంనగరు జిల్లా

*చిన్న పశువైద్యశాలలు:*

జనవరి 1వ తేదీన జగిత్యాలలో ఒకచిన్న పశువైద్యశాల ప్రారంభించబడింది.

*గ్రామంలోని రోడ్ల విస్తరణ:*

మాదన్నపేట గ్రామంలోని గ్రామీణ స్వచ్ఛంద సేవాదళ సభ్యులు గ్రామంలోని రోడ్లను విశాలం చేశారు. వీరు మొత్తం రూ. 200ల విలువచేసే శ్రమదానాన్ని యిచ్చారు.

*కంపోస్టు శిక్షణ శిబిరం:*

జగలపల్లి గ్రామంలో డిశంబరు 21వ తేదీనుండి మూడు రోజులపాటు కంపోస్టు శిక్షణ శిబిరాన్ని నుస్తులపూర్ పంచాయతీ సమితి నిర్వహించింది. శాస్త్రీయంగా కంపోస్టును తయారు చేసే పద్ధతులలో యాభై మంది రైతులు శిక్షణ పొందారు.

*గ్రామసభ:*

డిశంబరు 30వ తేదీన ఎలగండ్ల గ్రామ పంచాయతీ తాలూకు గ్రామసభకు ప్రారంభోత్సవం జరిగింది.

*మహిళామండలి:*

హుజూరాబాదు మహిళామండలి తయారు చేసిన అల్లికపనులు, యితర చేతిపనుల ప్రదర్శనకు డిశంబరు 22వ తేదీన దేవాదాయ ధర్మాదాయ మంత్రిణి ప్రారంభోత్సవం చేశారు.

### కర్నూలు జిల్లా

*వేరుశనగ విత్తనాల పంపకం:*

ఆదోని పంచాయతీ సమితిలో డిశంబరు నెలలో 610 మణుగుల మేలుజాతి వేరుశనగ విత్తనాలు, 194 కిలోగ్రాముల రసాయనిక ఎరువులు, 17 ఆధునిక వ్యవసాయ పరికరాలు పంపిణీ చేయబడ్డాయి. ఈ నెలలోనే 2 ఫర్లాంగుల మట్టిరోడ్డు వేయడం జరిగింది. ఆరుఫర్లాంగుల రోడ్డు మరమ్మతు చేయబడింది. రెండు చిన్న కర్రవంతెనలు నిర్మించబడ్డాయి. ఒక నుయ్యి త్రవ్వబడింది.

### నెల్లూరు జిల్లా

*ప్రాథమిక ఆరోగ్యకేంద్రం:*

సూళ్ళూరుపేట పంచాయతీ సమితిలోని తొగరుమూడిలో డిశంబరు 13వ తేదీన ఒక ప్రాథమిక ఆరోగ్యకేంద్రం ప్రారంభించబడింది.

*గ్రామీణ స్త్రీల శిక్షణ శిబిరం:*

బుచ్చిరెడ్డిపాలెంలో డిశంబరు 29వ తేదీనుండి మూడురోజులపాటు గ్రామీణ స్త్రీల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహించబడింది.

### నల్గొండ జిల్లా

*రసాయనిక ఎరువుల పంపిణీ:*

చింతపల్లి పంచాయతీసమితిలో డిశంబరు

## ప్రగతి పథంలో

నెలలో 70 మణుగుల మేలుజాతి విత్తనాలు, 40 మణుగుల రసాయనిక ఎరువులు, 13 ఆధునిక వ్యవసాయ పరికరాలు పంపిణీ చేయబడ్డాయి.

*గ్రామసహాయకుల శిక్షణశిబిరాలు:*

కోదాడు పంచాయతీ సమితికి చెందిన చిలకూరు, తమ్మారం గ్రామాలలో రెండు గ్రామసహాయకుల శిక్షణ శిబిరాలు నిర్వహించబడ్డాయి.

నిజామాబాదు జిల్లా

*గ్రామనాయకుల శిక్షణ శిబిరం:*

కామారెడ్డి పంచాయితీ సమితికి చెందిన రెడ్డిపేట గ్రామంలో రెండురోజులపాటు స్త్రీల గ్రామనాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది. యాభైపైచిలుకు స్త్రీలు యీ శిబిరంలో శిక్షణ పొందారు.

*కుటుంబ నియంత్రణ:*

యడపల్లిలో డిశంబరు 29వ తేదీన కుటుంబ నియంత్రణకు సంబంధించిన శిక్షణ శిబిరానికి పరిశ్రమలమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

విశాఖపట్టణం జిల్లా

*ప్రాథమిక ఆరోగ్యకేంద్రం:*

ప్రణాళిక, పంచాయతీరాజ్ శాఖలమంత్రి పాయకరావు పేటలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి శంకుస్థాపన చేశారు.

వరంగల్ జిల్లా

*గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం:*

చాగల్ గ్రామంలో డిశంబరు 15వ తేదీ నుండి మూడురోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది.

పశ్చిమగోదావరి జిల్లా

*గ్రామసేవకుల శిక్షణ కేంద్రాలు:*

గోపన్న పాలెంలోని గ్రామ సేవకుల శిక్షణ కేంద్రంలో డిశంబరు 27వ తేదీ నుండి ఎనిమిది రోజులపాటు గ్రామంలోని యువక నాయకులకు, విస్తరణాధికారులకు, ఇనస్ట్రక్టర్లకు వ్యవసాయంలోను, పశుపోషణలోను శిక్షణ కోర్సు నొకదానిని నిర్వహించడం జరిగింది.

# ప్రాచీన తెలుగు సాహిత్యం

ఎస్ రామకృష్ణశాస్త్రి

భారతదేశంలో హిందీ తరువాతి స్థానం తెలుగుది అయినప్పటికీ జనాభాకు సంబంధించినంతవరకు తెలుగు, హిందీ కంటే పురాతనమైనది. తెలుగు సాహిత్యం హిందీ సాహిత్యానికంటే విస్తృతమైనది. తెలుగుజాతి చాలా చారిత్రకమైనది. తెలుగు భాష మధురమైనది. కనకనే విదేశస్థులు దీనిని ప్రాచ్య ఖండపు ఇటలీభాషగా అభివర్ణించారు. తెలుగుభాష మధురంగా వుండడానికి కారణం ఇది అజంత భాష. పదాలలో అచ్చుల పొందిక చక్కగా వుంటుంది గుణితాక్షరముల సమామ్నాయం రమ్యంగా వుంటుంది. అంతేగాక తమిళ భాషలోవలె జటిల హల్లుల కఠిన సముదాయంకూడా వుండదు. దక్షిణా పథంలో తెలుగు మాతృభాషగాగల ప్రాంతాలు పూర్తిగా ఉత్తరభాగంలో వున్నందువల్ల ఈ భాష ద్రావిడ, ఆర్య భాషా కుటుంబాల నుంచి మంచిని గ్రహించి ప్రయోజనం పొందే స్థితిలోవుంది. భాషా శాస్త్రవేత్తలు, తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి చెందినట్లు పేర్కొన్నప్పటికీ దీనిపై సంస్కృత, ప్రాకృత భాషల ప్రభావం అధికంగావుంది. వాటినుంచి ఇది శ్రావ్యతను సంతరించుకున్నది.

'తెలుగు'ను 'ఆంధ్ర' అనికూడా అంటారు ఆంధ్ర అనే పదం మొదట "ఐతరేయ బ్రాహ్మణ"లో ఉదహరించబడింది. గోదావరి, కృష్ణాడెల్టాల మధ్యప్రాంతంలో మొదట నివసించిన ప్రజలు దేశిభాష మాట్లాడేవారు. ఆధునిక తెలుగు భాషలో దాదాపు నాలుగింట మూడువంతులు సంస్కృత పదాలు వున్నప్పటికీ ఈ దేశి భాషయే ప్రస్తుత తెలుగుకు మాతృక. ఐతరేయ బ్రాహ్మణంలో ఉదహరించబడిన ఆంధ్రులు చారిత్రకమైన తరువాతిదశకు చెందినట్లూ, వింధ్య ప్రాంతాలలో వీరు నివసించినట్లూ పైశాచప్రాకృతం వీరిభాష అయినట్లూ కనిపిస్తుంది. వింధ్య ప్రాంతంనుంచి వీరు మగధ, కణ్వ రాజ్యాలను జయించి ఉత్తరదిశగా వ్యాప్తి చెందారు. దక్షిణ ప్రాంతంలో పశ్చిమభాగంలో మహారాష్ట్ర, తూర్పుభాగంలో తెలుగు రాజ్యాలను నెలకొల్పారు. కొంతకాలంపిమ్మట వారు శాశ్వతంగా స్థిర నివాస మేర్పరుచుకున్న తెలుగు రాజ్యానికి వారిపేరిట 'ఆంధ్ర' అని నామకరణం చేయడం జరిగింది. వారి రాజ్యానికి ఉత్తరాన శాకాయనులు, దక్షిణాన పల్లవులు వుండేవారు. ఆంధ్రులు క్రమంగా తెలుగువారిలో కలిసిపోయారు.

తొలి ఆంధ్రులు ఆర్యులా, ద్రావిడులా అని నిర్ధారణ చేయడం, ఒక సమస్యగానే వుంది. రాజర్షి విశ్వామిత్రుడు తన ఆనతిని అతిక్రమించినందుకుగాను తన మొదటి యాభై మంది పుత్రులనూ కిరాట, పులింద, ఆంధ్రులతో కలిసిపోవలసిందిగా శపించినట్లూ, ఈ మూడు జాతులవారూ ఆర్యులువున్న ప్రదేశాల పొలిమేరలలో నివసించినట్లూ ఐతరేయ బ్రాహ్మణంలో పేర్కొనబడింది. దీనినిబట్టి ఆంధ్రులు తొలుత ఆర్యులు అయినట్లూ, తరువాత ఆ సంస్కృతినుంచివిడివడిఅనార్యులైనట్లూ, తాము ఏయే అనార్యతెగలతోనైతే కలిసిమెలిసి జీవించారో వారి విధానాలను అలవర్చుకున్నట్లూ భావించబడుతున్నది. ఒకవేళ ఇలా అయినట్లయితే వారు ఆ తెగలవారితో విజేతలుగానే సంచరించెడివారు. అనార్యులకంటే ఉన్నతమైనవారుగా పరిగణించబడేవారు కనుక వారి సంస్కృతినీ, జీవన విధానాలను అవలంబించి వుండేవారు కాదు. అంతేగాక ఒక వేళ నిజంగా వారు ఆర్యులే అయినట్లయితే కిరాట, పులింద మొదలైన ఇతర అనార్య తెగలకు వారు ఆధారభూతులు కావడానికి ఆస్కారమే లేదు. అందుచేత ఆంధ్రులు అనార్య సంతతికే చెందినట్లూ, వీరు దిగువస్థాయినుంచి పెంపొంది క్రమేపీ ఆర్య సంస్కృతిని అలవర్చుకున్నట్లు విశ్వసించబడుతున్నది.

## ప్రాకృతం ప్రభావం

ఆంధ్రులు శాతవాహనులుగా శిలా శాసనాలలో ఉదహరించబడినారు వీరు తెలుగు

రాజ్యాన్ని క్రీ. పూ. మూడవ శతాబ్దినుంచి క్రీ. శ. రెండవ శతాబ్దం చివరివరకు పరిపాలించారు. అందుచేత వారి మాతృభాష అయిన ప్రాకృతం ఆ కాలంలో- బ్రిటిష్ వారి హయాములో మన దేశంలో ఇంగ్లీషు భాష ఉపయోగించ బడినట్లు గానే- పరిపాలనా నిర్వహణ, వర్తక, వాణిజ్యాల నిమిత్తం ఉపయోగించబడింది. పూర్వ శాతవాహన రాజులు బౌద్ధమతాన్ని పోషించారనే విషయం సుప్రసిద్ధమే. అందుచేతనే తెలుగునాట బౌద్ధమతం క్రీ. పూ. మూడవ శతాబ్దంలోనే వ్యాప్తిలోకి వచ్చింది. ధాన్యకటకం, అమరావతి ప్రసిద్ధ బౌద్ధ విజ్ఞాన కేంద్రాలుగా అలరారినట్లు అక్కడి బౌద్ధ స్తూపాలవల్ల వెల్లడవుతుంది. సుప్రసిద్ధ విద్వాంసుడు నాగార్జునుడు ఆ కాలంనాటి వాడే. బౌద్ధమత బోధనలు, ప్రాకృత భాషను పోలిన పాళీభాషలో వుండటం వల్ల, తమ మత విషయాలను జనసామాన్యానికి బోధించడం బౌద్ధులకు చాలా సుకరమైపోయింది. ఈ అవకాశాన్ని వారు చక్కగా ఉపయోగించుకున్నారు. ఈ విధంగా పాలకులు, మతబోధకులు కూడా ప్రాకృత భాషను ప్రోత్సహించారు. తత్ఫలితంగా తెలుగు దేశంలోని దేశీభాషపై ప్రాకృత భాష ప్రభావం మిక్కుటంగా పడింది. అనేక ప్రాకృత భాషా పదాలు తెలుగుభాషలో మిశ్రమమయ్యాయి.

ఇదేవిధంగా ఆంధ్రుల ప్రాకృత భాషపై కూడా స్థానిక ప్రజల దేశీ భాషా ప్రభావం పడింది. అనేక పురాతన తెలుగుపదాలను గ్రహించడం దీని పర్యవసానమే. అనేక తెలుగు పదాలు ప్రాకృత సాహిత్యాన్ని అలంకరించినట్లు, 12వ శతాబ్దపు వైఘంటికుడు హేమచంద్రుని "దేశీనామమాల"ను బట్టి వెల్లడవుతున్నది. ఈ విధంగా గ్రహించబడిన దేశీపదాలను కొన్నింటిని వాటి గుర్తింపును మరుగుపరిచేందుకై సంస్కృత పదాలుగా మార్చడం జరిగింది. దీని ఫలితంగా, తరువాత సంస్కృత వైయాకరణులు, దేశీభాషకు చెందిన ఈ పదాలకు, సంస్కృత ఆధారాల నుంచి అర్థాలు గ్రహించడం ఆ భాషలో ఇదివరకే వున్న అంత్యప్రత్యయములను ఉపయోగించడం ఆరంభించారు. తరువాత, 7వ శతాబ్దానికి చెందిన కుమారిలభట్టు, "తంత్రవార్తిక" అనే తన మీమాంస గ్రంథంలో ఈ ధోరణిని ఖండించాడు. వీటన్నింటిని బట్టి, ఆంధ్రులు తెలుగువారిలో కలిసిపోయినట్లే ఆంధ్రుల ప్రాకృతం, తెలుగు భాషలు పరస్పరం కలిసిపోయాయనే నిశ్చయానికి రావల్సి వుంటుంది. ఆంధ్ర, తెలుగు అనే పదాలు ఒకే అర్థాన్నిచ్చే పదాలుగా రూపొందాయి. వారిజాతి, దేశం, భాషలకు కూడా ఎటువంటి తారతమ్యం లేకుండా ఇవి సమంగా ఉపయోగించబడుతున్నాయి. కాబట్టి పరిశోధకులు ఎవరైనా "గాథా సప్తశతి" వంటి ప్రాకృత గ్రంథాలలో కొన్ని తెలుగు పదాలను కనుగొన్నా, తెలుగు వైయాకరణులు కొన్ని తెలుగు పదాలను ప్రాకృత తత్సమ, తత్భవములుగా వివరించి సంస్కృతపదాలు, ప్రాకృత తత్సమ తత్భవములతో సహా దేశ్యపదాలతో తెలుగు భాష రూపొందిందని చెప్పినా అందుకు ఆశ్చర్యపడ నవసరంలేదు. కాని కొన్ని దృష్టాంతాల ఆధారంగా, శాతవాహన ఆంధ్రులనాటి ప్రాకృతం క్రమంగా క్షీణించి తెలుగుగా రూపొందిందని వాదించడం జరిగింది. తెలుగుభాషకు పైశాచిప్రాకృతం మాతృక అనే సిద్ధాంతానికి ఇది మూలం. భాషా శాస్త్రం దృష్ట్యా భాషలను సమగ్రంగా పరిశీలించినట్లయితే తెలుగు భాష వ్రేళ్ళు ఆర్యకుటుంబ భాషలకు చాలా భిన్నంగా వున్నట్లు కనిపిస్తుంది. తెలుగు అనార్య, లేక ద్రావిడ భాషా కుటుంబానికి చెందినదనే సిద్ధాంతం సహేతుకమైనదైనట్లు వెల్లడవుతుంది.

## గ్రామీణ జీవితం చిత్రణ

ఆంధ్ర ప్రాకృత సాహిత్యం చాలావరకు ఇప్పుడు కాలగర్భంలో కలిసిపోయింది. హాలుడు వ్రాసిన 'గాథా సప్తశతి' ఒక్కటి మాత్రమే లభిస్తుంది. ఈ గ్రంథంలో 700 పద్యాలున్నాయి. ఆంధ్ర సామ్రాజ్యంలోని గ్రామీణ జీవితపు వాస్తవ దృశ్యాలను ఇది రమ్యంగా చిత్రిస్తుంది. దేశంలోని ప్రజలు, పశుకాపరులు, వేటగాళ్ళు, శ్రమజీవులు తదితరుల మనోభావాలు మొదలైనవాటిని గురించిన చిత్రణలు దీనిలో వున్నాయి. పోతే ఇప్పుడు లభ్యమయ్యే ఈకాలంనాటి మరో గ్రంథం బృహత్కథ. ఇది సంస్కృత పరిష్కరణం. హాలునివద్ద మంత్రిగావున్న గుణాఢ్యుడు దీనిని మొదట పైశాచికభాషలో వ్రాసినట్లు కనిపిస్తుంది. ఈ పుస్తక రాజంలోని కథల ప్రభావం యూరపు, ఆసియా ఖండాలలో తరువాత వచ్చిన కథా సాహిత్యంపై బాగా ప్రసరిల్లినట్లు కానవస్తుంది. ఇందులోని కథలను, యూరపు ఆసియా భాషలలోకి అనువదించడంకానీ లేదా వాటిని మాతృకగా స్వీకరించడంకానీ జరిగింది. క్రీ. శ. 2వ శతాబ్దాంతంలో శాతవాహన యుగం అంతరించిన పిమ్మట, క్రీ.శ 624వ సం. లో తూర్పు చాళుక్యులు జయించే వరకూ తెలుగురాజ్యాన్ని ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు పరిపాలించారు. ఈ కాలంలో కొందరురాజులు బౌద్ధమతాన్ని పోషించి ప్రాకృతభాషను రాజభాషగా స్వీకరించారు. కాగా మరికొందరు వైదిక మతాన్ని ప్రోత్స

హించి సంస్కృతాన్ని అధికారభాషగా ప్రకటించి దాని అభివృద్ధికి దోహదం చేశారు. అయితే ఈ రాజుల కాలంనాటి ప్రాకృత, సంస్కృత శాసనాలన్నింటిలోనూ తెలుగు పదాలను వ్యక్తులు, స్థలాల పేర్లుగా మాత్రమే ఉపయోగించడం జరిగింది. 7 వ శతాబ్దంలో తూర్పు చాళుక్యుల పరిపాలన ప్రారంభమైన అనంతరం శాసనాలను పూర్తిగా తెలుగులోనే వ్రాయించడం జరిగింది. 9 వ శతాబ్ది మధ్యభాగంనుంచి శాసనాలలో కవితను ఉపయోగించడం కూడా మొదలైంది. అయితే "ద్విపద" సీసం, అక్కర మొదలైన దేశీ ఛందస్సులను మాత్రమే ఉపయోగించారు. నన్నయ తన భారతంలో ఉపయోగించినటువంటి "శార్దూలం, మత్తేభం" మొదలైన సంస్కృత ఛందస్సులను ఉపయోగించలేదు. ఈ మూల సత్యాన్ని కవిరాజు నన్నెచోడుడు తన "కుమార సంభవం"లో ఈ విధంగా పేర్కొన్నాడు. "ప్రపంచంలో లోగడనుంచీ సంప్రదాయకమైన కవిత వుండగా, తెలుగు దేశంలో దేశీ పద్ధతిలో తెలుగు కవిత్వాన్ని చాళుక్యరాజులు తదితరులు ప్రవేశపెట్టారు."

## జానపద గేయాలు

దక్షిణ భారతంలో వైదిక మత పునరుద్ధరణకు 7 వ శతాబ్దిలో కుమారిలభట్టు, 8 వ శతాబ్దంలో శంకరాచార్యులు అవిరళ కృషి జరపగా చాళుక్య రాజులు కొందరు జైన మతాన్ని పరిపోషిస్తూనే వచ్చారు. 9,10 వ శతాబ్దాలలో తరచుగా కన్నడ దేశం, అడపా దడపా తెలుగుప్రాంతం జైన మత ప్రభావానికి గురిఅయ్యాయి. ఆంధ్ర దేశంలోని వేంగికి చెందిన జైనకవులు పంప, రన్నలు, తెలుగుదేశంలో జైన మతానికి ఆదరణ లభించక పోవడంవల్ల, పోషకులను ఆశ్రయించేందుకు కన్నడ ప్రాంతానికి వలస పోవలసి వచ్చింది.

జైనమత ప్రభావంక్రిందనే అయినప్పటికీ తెలుగులోకన్నా కన్నడంలోనేముందుగా భారతం అనువదించ బడింది. ఈ కాలంలో ఆంధ్ర ప్రాంతాల్లో పండితారాధ్య చరిత్రలో పాల్కురికి సోమన తెలియజేసిన 'తుమ్మెదలు, పర్వతాలు, ఆనందాలు, వెన్నెలలు, గొబ్బిపదాలు' మొదలయిన రూపాల్లో దేశీయ వృత్తాల్లో ఏవో కొన్ని జానపద పాటలుతప్ప కవులు కావ్యాలకు సంబంధించిన కవిత్వాన్ని వ్రాయలేదు. ఈ రాగాలకు గ్రామాలే ఉత్పత్తి క్షేత్రాలు; ప్రేమికుల గానాలు, భక్తుల పాటలు, బాలబాలికల ఆటపాటలు, స్త్రీల జోలపాటలు యీ జానపద కవిత్వంలోనుండే వెలికివచ్చి పనిలేనప్పుడూ, ఆనందానికి అవధులు దాటిపోయినప్పుడూ, కాలం వెళ్ళబుచ్చాలనుకున్నప్పుడూ గొంతులోనుండి బైటపడతాయి. కాని పండితులు దీనికి ఆమడదూరంలో నిలుచుండిపోయారే తప్ప చెంతకు రాలేదు. వీటిని ఏమాత్రం వారు గౌరవించలేదు. సాహితీ వీధిలో అలముకున్న చీకట్లను పారద్రోలి సంస్కార, విజ్ఞాన దీధితులను, విరజిమ్మి తెలుగు ప్రజలకు భారతీయ ధర్మాన్ని ప్రవచించి ఆంధ్రభాషకు, దేశానికి శాశ్వత కీర్తిని తీసుకుపచ్చే విధంగా ఒక చక్కటి కావ్యాన్ని సృష్టి చేయగలిగే సమర్థుడైన కవి గురించి ఆంధ్రదేశం కళ్ళు కాయలు చేసుకుని చూస్తున్నది.

## కవిత్రయ యుగం క్రీ. శ. 1025-1375

1019 సం. లో విమలాదిత్యుని తనయుడు రాజరాజనరేంద్రుడు వేంగి సామ్రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించడంతో ఆంధ్రుల అదృష్టం అనేక మార్గాల్లో అనుకూలించింది. దేశంలో శాంతి, సౌభాగ్యాలను ప్రతిష్ఠించిన అనంతరం వైదిక విధానాలలో సంపూర్తిగా నమ్మకమున్న రాజరాజు; బౌద్ధ, జైనమతాలు ఒక వైపున, చర్వాక మతం, భౌతికవాదం మరొకవైపున ప్రజలపై బలవంతంగా మతప్రభావాన్ని నిలిపి వారి మనసుల్లో తీవ్ర గంద్రగోళాన్ని కలిగించడం చూసి, ప్రజలపురోగతికి తనకు తోచినంత మేరకు కృషి చెయ్యాలని భావించాడు. భారతీయ ధర్మాన్ని వారికి బోధించి పురుషార్థాల్ని సాధించేందుకు వారికి మార్గదర్శిగా వుండాలనే బలమైన కోరిక యీయనకు వుండేది. కాని రాజరాజు తన అభిప్రాయాన్ని ఖచ్చితంగా ఎప్పుడూ బైటకు వ్యక్తం చేయలేదు. అతని కుటుంబంలోనే అంతకుముందు జైనమతాన్ని పరిపోషించిన అభిమానులు కొంతమంది వున్నారు. వారు అడ్డు పెడతారనే భయంచేతను, తన ప్రజలలో సనాతనులు, మార్పు కోరనివారూ అయిన సంస్కృత పండితులు ఆటంకాన్ని కలిగిస్తారనే భయంచేతను ఎప్పుడూ వ్యక్తం చేయలేదు. అందుకని యీయన తన అభిప్రాయాన్ని అతి సరళంగా, పంచదార పూతపూసి తెలియజెప్పాడు. శివుడిని పూజించటంతో పాటు, బ్రాహ్మలను సంతృప్తి పరచటంతోపాటు తనకు మహాభారతం అంటే వ్యక్తిగతంగా చాలా యిష్టమనీ వ్యక్తంచేశాడు. మహాభారతం తన పూర్వీకుల గాథఅనీ, అందులోని పాండవులూ తానూ ఒకే వంశమైన చంద్రవంశానికి చెందిన వారమనీ, అందువల్లనే తనకు భారతమంటే ప్రత్యేకమైన అభిమానమని తెలియజేశాడు. పంచమ వేదమైన భారతాన్ని తెనిగించడం ద్వారా తన ఆశయం సిద్ధిస్తుందని రాజరాజు నమ్మకం.

ఈ బృహత్కార్యాన్ని నిర్వర్తించే వ్యక్తిని, పండితుడైన వానిని, సమాన ఆశయాలు గలవాడిని, తనునమ్మి యీ కార్య భారాన్నంతా అతని భుజస్కంధాలమీద మోపడానికి అనువయిన వాడిని మహారాజు వెతకవలసి వుంది. తన ఆస్థాన కవిఅయిన నన్నయభట్టులో గల గుణగణాలను, శక్తి సామర్థ్యాలను చూసిన తర్వాత రాజుకు పూర్తిగా ఆశ చిగిర్చి యీ పవిత్ర కార్యాన్ని నెరవేర్చే బాధ్యతను ఆయనకు అప్పగించి, అతనితోటి విద్యార్థి అయిన నారాయణ భట్టును నన్నయకు సహాయపడమని కోరి, వ్యాసుడు (1–16) వ్యక్తంచేసిన కావ్య ప్రాముఖ్యతను పూర్తిగా అనువాదంలో వచ్చేటట్టు చూడమని నన్నయను కోరాడు. ఈ బృహత్తర కార్యభారానికి మొదట్లో నన్నయ సంకోచించాడు. కాని తనశక్తిమీద తనకుగల నమ్మకంతో చివరకు ఒప్పుకుని రాజరాజుకు అభయమిచ్చాడు. తర్వాత అతను వివిధ కోణాలలోనుండి చూసే వివిధ పండితుల దృష్టిలో మహాభారతానికి గల రకరకాల ప్రాముఖ్యతలను వివరించాడు. న్యాయాధికారులు మహాభారతాన్ని న్యాయ శాస్త్రంగా భావిస్తారు. తత్వవేత్తలు తాత్విక గ్రంథంగాను, నైతిక విలువలుగలవారు నీతి శాస్త్రంగాను, కవులు కావ్యంగాను, అలంకారికులు అలంకార శాస్త్రంగాను, చారిత్రకులు చరిత్రగాను, సాంప్రదాయక పండితులు కట్టు కథగాను (1–32) భావిస్తారు. మహాభారతంయొక్క విలువను పూర్తిగా అర్థం చేసుకుని, వేదవ్యాసుడు ఏ విధంగా దానిని రూపొందించాడో గుర్తించి, పాఠకులపై అది ఏఏ ఫలితాలను కలుగజేసిందో తెలుసుకుని నన్నయ మౌనిదృక్కులతో తెలుగు అనువాదంలో కూడా అదే విలువల్ని ప్రతిష్టించి మూలగ్రంథం యొక్క గొప్పతనాన్ని, గౌరవాన్ని అన్నివిధాలా పరిపోషించి ప్రతిష్ఠించాడు. నన్నయ తెలుగు సాంప్రదాయక కవులలో మొట్టమొదటివాడు. వ్యాసుడు సంస్కృత సాహిత్యంలో వహించిన ఘనతకు, పొందిన గౌరవానికి సమాన ఘనతను, గౌరవాన్ని నన్నయ తెలుగు సాహిత్యంలో పొంద గలిగాడు.

## ప్రారంభకుడు

నన్నయ రచనావిధానం అతి తేలికగా కనిపిస్తున్నందు వల్ల యీయన భారతాంధ్రీకరణను చాలా తేలికగా కొనసాగించాడనడంలో అర్థంలేదు. తన భాషలో యీయన మొట్టమొదటి కావ్య రచయిత కనుక వ్యాసుడికన్నా యీయనకు యిది మరింత కష్టంగా వుంటుంది. నిజానికి వాల్మీకికన్నా ఎక్కువ కష్టాలనే నన్నయ ఎదుర్కొన్నాడు. ఇంటా బయటా కూడా యితనికి అడ్డంకులే వున్నాయి. వాల్మీకి ప్రారంభకుడే అయినా ఉత్తేజితుడై వ్రాసిన కవి. ఆ ఉత్తేజంలో, ఆవేశంలో ఏమన్నా అది కవిత్వం అయిపోయింది. కొంగచావుపై ఆయన వ్యక్తం చేసిన బాధే ఒక పద్యం (శ్లోకం) అయిపోయింది. వేరే సమస్యలేమీ యీయనకు లేవు. పూర్తి స్వతంత్రుడు. అడ్డుకొనే ఆటంకాలులేవు. ఏమిటి వ్రాస్తున్నాడో, ఎలా వ్రాస్తున్నాడో అడిగేవారు లేరు. వ్యాసుని విషయంలో యీ పరిస్థితి మరికొంత మెరుగ్గా వుంది. ఈయనకు మార్గదర్శిగా వాల్మీకి వున్నాడు. ఆయన అడుగుజాడల్లో నడవవచ్చు. కాని నన్నయ విషయంలో మాత్రం అలా లేదు. నన్నయకు ముందు తెలుగులో కావ్యరచన కొనసాగించిన కవి లేడు. ఉంటే ఆ మార్గంలో నడిచి కొంత సుగమమం చేసుకునివుండును. లేదా వాల్మీకిలా, ఎలా వ్రాశాడో, ఏమివ్రాశాడో అడిగేవాళ్లులేకుండా స్వతంత్రుడై వున్నవాడు కూడా కాడు. ఈయనది అనువాదం అవడంచేత మూలానికి న్యాయం చేకూర్చవలసిన బాధ్యత వుంది. పైగా అలంకారశాస్త్రం ఎంతగానో అభివృద్ధి చెందింది. తన అనువాదంలో దీన్ని వాడి, ఉత్తమ కవితా ఖండంగా భారతాన్ని సృష్టించవలసి వుంది. అందుచేత వాల్మీకి, వ్యాసుల వలె నన్నయ విషయంలో యిది అంత తేలికయిన పనికాదు.

అంతే కాక నన్నయ అనేక ప్రాంతీయ, సాహిత్య సమస్యల్ని ఎదుర్కోవలసి వచ్చింది. భారత రచనకు ఉపక్రమించే ముందు యీ సమస్యలను తీర్చవలసి వుంది. ఆ సమస్యలు :

1. మక్కీకి మక్కీగా అనువాదం చేయడమా? లేక కథను తీసుకుని స్వేచ్ఛగా అనువదించడమా ? మార్పులు చేర్పులు, వర్ణనలు, సంఘటనలు, తెలివి తేటల్ని వ్యక్తిత్వాన్ని ప్రదర్శించవచ్చునా లేదా – అనే అనువాదానికి సంబంధించిన సమస్యలు.

2. అనువదించే విధానానికి సంబంధించి, పూర్తిగా అంతటినీ పద్యాల్లో వ్రాయాలా లేక చంపూమార్గంలో వ్రాయాలా ; పూర్తిగా పద్యాల్లో వ్రాస్తే సంస్కృతంలో మాదిరిగా ఛందస్సు వాడాలా లేక రకరకాల ఒక్కొక్క పాదంలో ఒక్కొక్కరకం ఛందస్సులను వాడవచ్చా ?

3. ఛందస్సుకు సంబంధించి, యింతకు పూర్వంవున్న దేశీయ వృత్తాలను వాడుకోవాలా లేక తన వీరకావ్యానికి సరిపోయిన వృత్తాలను యితరచోట్లనుండి తీసుకురావడం గాని, కొత్తవాటిని సృష్టించడంగాని చేయాలా ?

4. భాషకు సంబంధించి, ఈ కావ్యాన్ని వ్రాయడానికి ప్రస్తుతం వున్న భాష సరిపోతుందా లేక యీ ఆధునిక కాలంలో సైన్సు,

యితర సాంకేతిక పదాలను వ్యక్తం చేయడానికి ఏ విధంగా యితరభాషా పదాలను వాడుతున్నామో అదే విధంగా ఆనాడుకూడా అవసరమైన భావాలను, అభిప్రాయాలను వ్యక్తం చేయడానికి యితర భాషల్లోని పదాలను దిగుమతి చేసుకోవాలా? ఇలాంటి అనేక సమస్యలు రచనను ప్రారంభించడానికి ముందు అతని ఎదుట నిలిచాయి. బహుశా వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకొనే రాజరాజు నారాయణ భట్టు అనే మరొక సమానమైన గొప్ప పండితుడ్ని నన్నయకు సహాయపడడానికై నియమించాడు.

అనువాదానికి సంబంధించి, మహాభారతం వంటి యింతపెద్ద కావ్యానికి పద్యానికి పద్యంగా అనువదించడమంటే చాలాకష్టం. అసలు అనవసరంకూడా. పురాణ కథలతో పాటు కావ్యంయొక్క అసలు స్వరూపాన్ని, గొప్పతనాన్ని తెలియజేస్తూ స్వేచ్ఛానుసరణ చాలు. ఈ విధానంలో వ్రాస్తూ అనవసర వర్ణనల్ని, సంఘటల్ని వదిలివేయడంలో పూర్తి స్వేచ్ఛను ప్రదర్శించాడు. అవసరమైనచోట ఉచితరీతిని కొత్త వర్ణనల్ని, వ్యాఖ్యానాల్ని జత చేర్చాడు. తన కవితా ప్రతిభను అవకాశమున్న చోట్లల్లా వ్యక్తం చేసుకున్నాడు. దీని ఫలితంగా మూల గ్రంథంలో విషయాల్ని కుదించడం జరిగింది. ఈ విధానాన్ని నన్నయ సమకాలీనులేకాదు, యితర పురాణాలను అనువదించిన ఆయన అనుయాయులుకూడా అభినందించి అనుసరించారు. వ్రాసే విధానానికి సంబంధించినంతవరకు, పూర్తిగాపద్యాల రూపంలో వ్రాసేవిధానం అందులోనూ ఒక్కొక్క పదానికి ఒక్కొక్క రకమైన ఛందస్సును వాడే సంస్కృత విధానం — ఆంధ్రులకు సరిపడదు. అందుచేత నన్నయ ఆ విధానాన్ని వదిలివేసి పద్య, గద్య సమ్మిశ్రిత చంపూ విధానాన్ని ఎన్నుకుని రకరకాల వృత్తులతో రచన కొనసాగించాడు. ఈ రకంగా వివిధ రకాల వృత్తాలతో వ్రాసే వాడకం నన్నయకుముందు అక్కడక్కడ ఆచరణలో వుంది. ఈ విధానాన్ని అందరూ హర్షించారు. ఈయన తరువాత భారతాన్ని అనువదించిన కవికూడా యీ మార్గాన్ని అనువదించాడు. నన్నయకుముందు తెలుగులో వ్యాప్తిలోవున్న దేశీయ తెలుగు వృత్తాలు మహాభారతంవంటి వీరకావ్యాన్ని వ్రాయడానికి సరిపోయినంతగా లేకపోవడం వల్ల తొలి కన్నడకవులు పంప, రానలవలె సంస్కృతంలోనుండి కొన్నిటిని తెలుగులోకి తీసుకురావడానికి సంకల్పించాడు. ఈ యిరువురు కవులు తెలుగుదేశంనుండి కన్నడ దేశానికి వలసపోయారు. సంస్కృత వృత్తాలయిన మత్తేభం, శార్దూలం, ఉత్పలమాల, చంపకమాల మొదలయిన వాటిని తెలుగులోకి తీసుకుని వచ్చేటప్పుడు నన్నయ వాటిలోకి తెలుగు గుణాలయిన యతి, ప్రాసలను చొప్పించాడు. ఇవి సంస్కృతంలో లేవు. భాషకుసంబంధించి, తెలుగులో అంతవరకూ వున్నభాష, మహాభారతంవంటి మహాకావ్య రచనతో వివిధ ప్రాంతాల భావాలను, అనుభూతులను వివరించడానికి సరిపోదని భావించాడు. అందుచేత తప్పనిసరిగా సంస్కృతం నుండి కొన్ని మాటలను ఒక్కొక్కప్పుడు వాటిని వున్నవాటిని వున్నట్టుగా, మరొకప్పుడు మార్పులు చేస్తూ దిగుమతి చేసుకోవలసి వచ్చింది. సంస్కృత పదాలను యీ విధంగా తెలుగులో చెప్పడంవల్ల శైలి మరింత మృదుమధురంగాను, ఆకర్షణీయంగాను తయారయ్యింది. ఇది ఎంత మధురంగా తయారయ్యిందంటే విదేశీయులు సైతం తెలుగుభాషను ''తూర్పుదేశపు ఇటలీ భాష'' అని ప్రశంసించడానికి కారణమయ్యింది. సంస్కృత పదాలున్న కారణంచేత సంస్కృత పండితులుకూడా సంతృప్తి చెందారు. ఈ రకంగా నన్నయ తన అనుచరులకు మార్గదర్శిగా తెలుగు సాహిత్యానికి గట్టి పునాదులు వేశాడు. అందుచేతనే యీ నాటికికూడా మరొక అభిప్రాయానికి తావులేకుండా ఆంధ్రులందరి చేతా గౌరవించబడుతున్నాడు. ఈయన పునాదులు కదిలించలేనంత గట్టివి. ఈయన సూత్రాలు ప్రశ్నింపలేనంత సమంజసమైనవి. భాషను శాసించే యీయన "వాగనుశాసనుడు."

## వైదిక ప్రభావం

నన్నయకు వైదికాచారాలంటే మక్కువమెందు. నిత్యమూ వాటిని ఆచరిస్తూ వుండేవాడు. ఆ కారణం చేతనే తన రచనల్లో వీలయిన చోట్లల్లా వైదికాచారాల ప్రాముఖ్యతను ప్రస్తావిస్తూ వచ్చాడు. అంతేకాక రాజరాజుని ఆదేశాలమేరకు వ్యాసుడు ప్రవచించిన మహాభారతంలోని వైదిక శక్తిని తన రచనల్లో కూడా పరిపోషించడానికి ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకున్నాడు. అందుచేత నన్నయభట్టు భారతం ఆదినుండి అంతంవరకూ వైదిక వాతావరణంలోనే పెరిగింది. అందువల్ల నన్నయ భట్టు వ్యక్తిత్వం భారతంలో అడుగడుగునా కనుపిస్తుంది. అందువల్లనే రాజరాజు తన ఆశయం నెరవేరినందుకు ఎంతగానో సంతృప్తి చెందాడు. నన్నయభట్టు భారతం నుండే ఆంధ్రులు భారతీయ ధర్మాన్ని నేర్చుకున్నారు.

ఆంధ్రసాహితీ క్షేత్రంలో కవీశ్వరునిగా నన్నయ స్థానం అద్వితీయమైనది. ఈయన శైలి అమోఘమైనది. ఈయనలా మరొకరెవరూ వ్రాయలేదనేది జగమెరిగిన సత్యం. చక్కటి శైలికల కవిగా నన్నయార్యుని పేర్కొనకుండా ఎవరూ వుండరని ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు. ఈయన శైలి

కమనీయమైనది. సరళమైనది. అంతేకాని నారికేళపాకం కాదు. మెల్లగా చిరుసవ్వడులతో పారే సెలయేరువంటిది. పెద్దపెద్ద సమాసాలు, సంధులతో కలిసివున్నా సులభంగా అర్థమయిపోతుంది. చాలా మధురమైనదే అయినా మరొకరికి అనుకరించాలంటే సాధ్యంకాదు. చాలా సరళంగా మందంగా కదులుతుంది. అంతేకాని ఎక్కడికక్కడ తెగిపోదు, ఆగిపోదు. చక్కటి అనుప్రాసలతో కూడిన శైలి యీయనది. ఈ ప్రాసల్ని వాడడానికి కవి ఏ మాత్రం కష్టపడినట్టు కనిపించదు. బలవంతంగా చేర్చినట్టు అనిపించవు. చాలా సహజంగా ఏర్పడ్డట్టువుంటాయి. సమాసాలు వాడడంలోనూ, మాటల్ని ఎన్నుకోవడంలోనూ సరళమైన సంస్కృత పదాల్నే యీయన ఎన్నుకుంటాడు. అందువల్లనే యీయన శైలి మృదుమధురంగా వుంటుంది. నన్నయభట్టు భారతం అన్నివిధాలా తెలుగు సాహిత్యంలో అపూర్వ సృష్టి. మహాకావ్యం. తెలుగు భాష ఉన్నంతకాలమూ అది నిలిచి వుంటుంది. నన్నయ భారతం వ్యాకరణానికి, ఛందస్సుకు, పద్యశాస్త్రానికి ప్రామాణికమైనది. నన్నయ ప్రయోగాలకు భిన్నంగా వాడిన ప్రయోగాలు తప్పులతడకలనీ, వాటిని గుర్తించడం కూడదనీ అన్నాడు కవిరాక్షసుడు. వ్యాసభారతంవలె నన్నయ భారతం కూడా తర్కశాస్త్రం, నీతిశాస్త్రం, కవిత్వం, అలంకార శాస్త్రం, పురాణాలలో ప్రామాణికమైన గ్రంథం. ఇలా సృష్టించాలనే ఆయన ఆశయం కూడా. ఆయన ఆశయం పూర్తిగా సిద్ధించింది. ఆయనదే కాదు ఆంధ్రప్రజలది కూడా. తన కథా కథనాన్ని కవులు మెచ్చుకుంటే, యితరులు తన భాషా సౌకుమార్యాన్ని అభినందిస్తారని అతనికి పూర్తి ఆత్మవిశ్వాసం వుంది.

## విరామం

నన్నయ సుమారుగా రెండున్నర పర్వాలు వ్రాసిన తర్వాత, అదే సమయంలో దేశంలో గొప్ప విపత్తు సంభవించింది. అందువల్లనే ఆయన మూడో పర్వం మధ్యలో ఆపివేయవలసి వచ్చింది. ఈ విపత్తును గురించి ఎన్నో రకాల ఊహలు వున్నాయి. వీటన్నిటిలోకీ రాజరాజు మరణమే సబబైనదీ, సమంజసమైనదీను. కొంత మంది అంటున్నట్టు నన్నయ మరణించడమో లేక మనోచాంచల్యం కలగడమో జరిగితే రాజరాజు నారాయణ భట్టుని ఆ తర్వాతనుండి ప్రారంభించి పూరించమని అడిగివుండేవాడు. అది పూర్తికావడమూ జరిగివుండేది. అందుచేత నన్నయ మరణించాడనో, లేక ఆయనకు మతిచలించిందనో అనడంలో సమంజసత్వం కనిపించడం లేదు. 1063 లో రాజరాజు మరణించినప్పటికి అతనికొడుకు కుళోత్తుంగ చోళుడు తన మేనమామ యొక్క విశాల చోళ సామ్రాజ్యాన్ని హస్తగతం చేసుకుని తెలుగు భూభాగాన్ని అలక్ష్యం చేశాడు. ఏతత్కారణంవల్ల యితని పినతండ్రి కాశీగా పడివున్న తెలుగు సామ్రాజ్య సింహాసనాన్ని అక్రమంగా ఆక్రమించి రాజకీయాల్లోనే శ్రద్ధాసక్తులు చూపిస్తూ వుండిపోయాడు. ఆ విధంగా పోషకులు కరువై నన్నయ భారతరచన అసమగ్రంగా నిలిచిపోయింది. కొంత కాలానికి దేశంలో సాంఘిక ఆచారాలూ, మత విధానాలూ కూడా మారిపోయాయి. ఆ రోజుల్లో దేశంమీద, సాహిత్యం మీద మత ప్రభావం విపరీతంగా వుండేది. 12వ శతాబ్దం తొలి రాజుల్లో రామానుజాచార్యులు జన్మించి, భక్తి (ఆరాధనా) మార్గాన్ని బోధించాడు. అది సామాన్య జనంలో విశేష ప్రచారాన్ని పొందింది. రాజరాజ నరేంద్రుని తనయుడు కుళోత్తుంగచోళుడు శైవమతాభిమానికావడం వలన రామానుజాచార్యులపై పగపట్టాడు. అందుచేత రామానుజాచార్యులు అతని రాజ్యమునుండి వెళ్ళిపోయి వైష్ణవ మతాన్ని మరింత పట్టుదలతో వ్యాప్తి చేయడం ప్రారంభించాడు. రామానుజాచార్యులు ఆంధ్రుడని కొంతమంది అంటారు. 12వ శతాబ్దం మధ్యకాలంలో కన్నడదేశ ప్రభువు బిజ్జల వద్ద అమాత్యశేఖరుడుగావున్న బసవుడు వీరశైవాన్ని ప్రారంభించి, దాన్ని పరిపోషించి ప్రచారం చేయడానికి తన అధికారాన్ని, ధనాన్ని విశేషంగా వెచ్చించాడు. ఇదికూడా సామాన్య జనంలో చప్పున వ్యాపించింది. ఆంధ్రదేశంలో పండితారాధ్యుడు ఆయన మతాన్ని అనుసరించి, దాన్ని దేశంలో వ్యాప్తి చేయడం ప్రారంభించాడు. ఈ రెండు మతాలూ వైదిక విధానానికి వ్యతిరేకమే. అందుచేత యీ రెండూ కలిసి ప్రక్కనున్న ఆంధ్రదేశంలో కూడా దీని పతనానికి తీవ్రంగా కృషిచేశాయి. దీని ఫలితంగా వైదికమతాన్ని పరిపోషించే నన్నయభారతాన్ని అలక్ష్యం చేయడం జరిగింది. ఎవరూ దాన్ని పూరించాలనుకోలేదు. ఆ విధంగా నన్నయ తెలుగు భారత రచనను పూరించడానికి రాజకీయ, మత విషయాలు అడ్డుగోడలయ్యాయి.

## మొట్టమొదటి ప్రబంధం

పన్నెండవ శతాబ్ది మధ్యకాలంలో నన్నిచోడుడు అనే శైవరాజు వుండేవాడు. స్వతహాగా ఆయన కవి. 'కుమార సంభవం' అనే మహాకావ్యాన్ని పన్నెండు ఆశ్వాసాలలో వ్రాసి, దాన్ని తన గురువుగారైన మల్లిఖార్జున యోగికి అంకితమిచ్చాడు. తన రచనలో కవి శివయోగిని పరమశివునితో పోల్చాడు. నన్నిచోడుడు కాళిదాసుని కుమారసంభవంనుండి, ఉద్భటచరిత్ర నుండి ప్రేరితుడయ్యాడు. ఈ రెండవ

గ్రంథం ప్రస్తుతం కానరావడం లేదు. నన్నిచోడుని కుమారసంభవం కవిత్వంలో ఉన్నతమైన ప్రమాణాలు గల గ్రంథం. ఇది ప్రబంధ మార్గంలో నడిచింది. ఇతః పూర్వపు వైదిక మార్గంలో నడిచినవాటికి యిది భిన్నమైనది. నన్నయభట్టుది మార్గ కవిత్వం కాగా యిది దేశికవిత్వం. నన్నయ తన తెలుగు భారతంలో నాలుగింట మూడు వంతులు సంస్కృత పదాలను వాడగా నన్నెచోడుడు తన కుమారసంభవంలో అచ్చ తెలుగు పదాలను నాలుగింట మూడువంతులు వాడాడు. అష్టాదశవర్ణనలను, ముప్పయ్యారు అలంకారాలను యిందులో చొప్పించాడు. మొట్టమొదటి తెలుగు ప్రబంధంగా దీన్ని భావించవచ్చు. శైలిని, ఇందులో వ్యక్తం చేసిన భావాన్ని, వర్ణనలను దృష్టిలో పెట్టుకుని చూసినప్పుడు దీనికి తెలుగు సాహిత్యంలో చాలా వున్నతమైన స్థానమే వుంటుంది. ఈయన రూపకల్పనలు ఉన్నత ప్రమాణం గలవి. ఒక్కొక్కప్పుడు కాళిదాసుతోనే పోటీపడుతుంటాయి. ఈయన యుద్ధవర్ణనలు అనుభవ పూర్వకమై వుండి వాస్తవానికి చాలా దగ్గరలో వుంటాయి. వర్ణనలు యీయనకుగల ఆలోచనాగరిమను వ్యక్తం చేస్తుంటాయి. ఈయన రచనలో కవిత్వపు విలువలు వ్యక్తమౌతున్నప్పటికీ వ్యాకరణంలో సమకాలీన సిద్ధాంతాలనుకూడా అధిగమించాడు. ఈయన వాడిన కొన్ని కొన్ని మాటలు పూర్తిగా కొత్తవి.

కన్నడ దేశంలో బసవుడు వీరశైవాన్ని వ్యాప్తి చేస్తున్నప్పుడే ఆంధ్రదేశంలో మల్లిఖార్జున పండితుడనే ఆరాధ్య బ్రాహ్మణుడు పాశుపతశైవాన్ని ప్రచారం చేశాడు. ఈయన గొప్ప సంస్కృత పండితుడు. శతకం రూపంలో శివతత్వసారాన్ని రచించాడు. ఇందులో ప్రతిపద్యమూ శివుడి నామంతో అంతమవుతుంది. వెయ్యి పద్యాల వరకూ వ్రాశాడని ఒక నమ్మకం. అయితే అందులో 500 పద్యాలు మాత్రమే యిప్పుడు లభ్యమవుతున్నాయి. ఇందులో పండితారాధ్యుడు పాశుపత శైవమతాన్ని గురించి వివరించాడు. జైన, బౌద్ధమతాల వంటి యితరమతాలను చివరకు వైదిక మతాన్ని కూడా విమర్శించాడు. ఈ గ్రంథంలో కొంతమంది శైవభక్తులను గురించి కూడా వివరణ కనుపిస్తుంది.

### తిక్కన కృషి

పదమూడవ శతాబ్ది మధ్యకాలం నాటికి శైవ, వైష్ణవ మతాలలోని అతివాదులతో సామాన్య ప్రజలు విసిగిపోయారు. ఈ యిరువర్గాలవారు సామాన్యుని మనసులో కావలసినంత గందరగోళాన్ని, సందిగ్ధతను సృష్టించారు. అప్పుడే కాకతీయ ప్రభువులలో గొప్పవాడైన గణపతిదేవుడు తెలుగునాడు సంతటినీ తన ఆధిపత్యం క్రిందకు తీసుకువచ్చి, ఆంధ్రదేశంలో శాంతి, సౌభాగ్యలను స్థాపించాడు. వైదిక మతాన్ని పునరుద్ధరించడానికి కాలంకూడా కలిసివచ్చింది. కాకతీయులకు సామంతుడుగా వుండిన నెల్లూరుప్రభువు మనుమసిద్ధి ఆస్థానంలో కవితిక్కన ఆస్థానకవిగా వుండేవాడు. ఇతని కుటుంబంలోని వారు వీరులుగాను, రాజకీయ వేత్తలుగాను ప్రసిద్ధికెక్కిన వారే. తిక్కన ఉత్తర రామచరిత్ర, నిర్వచనోత్తర రామాయణాలను పూర్తి పద్య రూపంలో వ్రాసి రాజుగారికి అంకితం చేశాడు. ప్రభువు ఆత్మీయతతో అతన్ని 'మామా' అని పిలిచేవాడట! ఒకసారి తన ప్రభువు రాజ్యాన్ని కోల్పోయే క్లిష్టపరిస్థితులు సంభవించినప్పుడు తిక్కన కాకతీయ ప్రభువు గణపతి దేవునివద్దకు రాయబారిగా వెళ్ళాడు. నన్నయభట్టు, నన్నెచోడ కవుల కవితా విలువను తిక్కన అభినందించాడు. వారి లోపాలను వదలి వేసి, వారిమార్గాలను తన కవిత్వంలో చొప్పించాడు. ఈయన కవితామార్గం ప్రాచీన పద ప్రయోగాలను వదలివేస్తూ, సమకాలీన పదాలను ప్రయోగిస్తూ, పర్యాయ పదాలను ఉపయోగిస్తూ అవసరాన్ని మించని ప్రయోగాలతో రసోత్పత్తిని కలిగించేదిగా వుంటుంది. ఇతని నిర్వచనోత్తర రామాయణంలో చక్కటి వర్ణన వుంది. నన్నెచోడుని రచనల్లో వలెనే యితని రచనల్లోనూ నాలుగింట మూడువంతులు తెలుగుపదాలు, ఒకవంతు సంస్కృత పదాలు వుంటాయి. అయితే వాడుకలో లేనివీ, విదేశీయాలు అయిన పదాలను యీయన వదిలివేసేవాడు. చిన్న చిన్న వాక్యాలు యీయనవి.

ఉత్తర రామాయణాన్ని వ్రాసిన తర్వాత సాహిత్యంలో శిష్టాతుడై తిక్కన మహాభారతాన్ని పూరించ సంకల్పించాడు. భారత రచనకు ఉపక్రమించే ముందు యజ్ఞంచేసి పరిశుద్ధుడయ్యాడు. తిక్కన తనభారతాన్ని యిష్టదైవమైన హరిహరునికి అంకితం చేశాడు. అందుచేత యీయన హరిహరుని ఆరాధనా మార్గాన్ని ప్రవచించాడు. శివునికి విష్ణువుకు సామీప్యాన్ని వ్యక్తం చేశాడు. అరణ్య పర్వంలో నన్నయ వదిలేసిన భాగాన్ని ముట్టకుండా విరాటపర్వం నుండి చివరివరకూ అనువదించాడు. మొత్తం పదిహేను పర్వాలను యీయన అనువదించాడు. ఉత్తర రామాయణంలో తాను వాడిన పూర్తి పద్యాలలో వ్రాసే విధానాన్ని భారతరచనలో కొనసాగించకుండా అనువాదంలో నన్నయ మార్గాన్నే పూర్తిగా అనుసరించాడు. శైలి విషయంలోనూ, రసోత్పత్తి, వాటి పరిపోషణలోనూ ప్రబంధ మార్గంలో నన్నెచోడుని అనుసరించి, ప్రతిపర్వాన్నీ

ఒక్కొక్క ప్రబంధంగా రూపొందించాడు. ఆ విధంగా తిక్కన తన ముందుతరంలోని మహామహుల మార్గంలోనడిచి తనకావ్యాన్ని సంపూర్ణ కవితా ఖండంగా సృష్టించాడు. ఆంధ్రప్రజలను ఆనందింప జేయడమే యీయన ఆశయం. ఆ ఆశయం నెరవేరింది. నన్నెచోడునకు, నన్నయకు ఈయన ఎంతగానో ఋణపడి వున్నాడు. నన్నెచోడునికి, తిక్కనకు మతానికి సంబంధించి వ్యాకరణ ప్రయోగాలకు సంబంధించి కొన్ని కొన్ని అభిప్రాయభేదాలు వున్న కారణం చేత తిక్కన నన్నెచోడునికి తన కృతజ్ఞతను తెలుపక పోయినప్పటికీ అతనికి తిక్కన ఋణపడి వున్నా డని వొప్పుకోక తప్పదు. నన్నెచోడుడు శివ, పార్వతుల ప్రేమను ప్రకటించిన మార్గాన్నే తిక్కన కీచకుడు—ద్రౌపతి కథలో సన్నిహితంగా అనుసరించాడు. రెండింటిలోనూ వాడిన భాష యీ విషయాన్ని చెప్పక చెప్పుతున్నది. అంతేకాదు నన్నెచోడుడు తారకాసురిడితో దేవతల యుద్ధాన్ని వర్ణించిన విధానంలోనే తిక్కన కూడ యుద్ధ పంచకంలో అనుసరించాడు. ఈ రెండింటిలోనూ ఒకేరకపు పదాలు, భాష కనుపిస్తాయి మనకు. యుద్ధ స్వరూపం రెండింటిలోనూ ఒకటే. ఈ విషయాన్ని బట్టే నన్నెచోడుడిని తిక్కన అనుసరించాడనేది స్పష్టపడుతున్నది. నిజానికి అనుసరణీయమైన నన్నయ కవిత్వంలోని సొంపు గంభీరాలను సాధించలేకపోయినా తనకు గల అసాధారణ కవితాశక్తి చే తిక్కన తన రచనల్లో విజయాన్ని సాధించాడు. ఈయన రచనల్లో గల మరొక ప్రత్యేకత పాత్రలను అందంగా చిత్రించడం, కథను చెప్పడంలో సంభాషణా విధానాన్ని ప్రవేశ పెట్టడమూను.

తిక్కనను తెలుగు భాషకు కవిబ్రహ్మ అంటారు. తెలుగుసాహిత్య సామ్రాజ్యంలో యీయనకు ఉన్నతపీఠం వేయబడింది. తన ఆశయాలను వ్యక్తీకరించడానికి మహాభారతం యీయనకు బాగా అవకాశాలను కలిగించింది. తెలుగునాట భారతీయ ధర్మాన్ని పరిరక్షించే ఆకాలపు కవితాఖండ చిహ్నం యిది. ప్రతిపర్వాన్నీ ఒక మహాకావ్యంగా, ప్రబంధంగా సృష్టించేప్రయత్నంలో తిక్కన మూలాన్నే మించి ప్రతిసృష్టిచేశాడు. నన్నయ తెలుగుమహాభారతానికి గట్టిపునాదులు వేస్తే, నన్నెచోడుడు కవిత్వానికి అవసరమయ్యే వస్తువులను సరఫరా చేయగా, దానిమీద తిక్కన మహాభారత మనే సౌధరాజాన్ని అందంగా తీర్చిదిద్దిన వంపులతో, శిల్పాలతో చక్కగా నిర్మించాడు.

## ఇతర రచనలు

సర్వ సాధారణంగా ఒకవ్యక్తి ఎంత గొప్పవాడైనా అతని సమకాలీనులు అతని గొప్పతనాన్ని ఒప్పుకోరు. కాని తిక్కన విషయంలో మాత్రం యిది నిజంకాదు. కేతన, యింకా అనేకమంది యితర అభిమానులు యీయనకు వుండేవారు. ఈయన అభిమానులు యీయనను ఆరాధించేవారు. కేతన అతనికి సమకాలీనకవి. కొద్దోగొప్పో పేరున్నవాడే. దండి వ్రాసిన దశకుమార చరిత్రను సంస్కృతం నుండి తెలుగు చేశాడు. మూలగ్రంథం శృంగార గద్య రచన. దానిని చంపూ మార్గంలో వ్రాసి, దానిని తిక్కనపై తనకుగల భక్తి ప్రపత్తులను ప్రకటించుకొంటూ ఆయనకు అంకితం చేశాడు. తన గ్రంథంలో మొదటి ప్రకరణంలో తిక్కనను గురించి, అతని కుటుంబం గురించీ వివరించాడు. తిక్కన కేతనను 'అభినవ దండి'గా అభి వ్యక్తీకరించినప్పటికీ సంస్కృతంలో దండిశైలిలా, వినసొంపుగా, చక్కగా కేతనశైలి లేదు. సరళమూ, వినసొంపూ అయిన శైలికి దండి పెట్టింది పేరు. 'దండినాథపదలాలిత్యం' అని ప్రత్యేకత వున్నది. కేతన 'విజ్ఞానేశ్వరీయం' అనే తాత్విక గ్రంథాన్ని అనువదించాడు. సంక్షిప్త తెలుగు వ్యాకరణాన్ని వ్రాశాడు. తిక్కనను మార్గదర్శిగా భావించిన మారన అనే అతను మార్కండేయ పురాణాన్ని అనువదించి, రెండవ ప్రతాపరుద్రుడి సైన్యాధిపతి నగయ్య కన్నమనాయకునకు అంకితం చేశాడు. ఉన్నత ప్రమాణాలతో కూడినది కాకపోయినా మొత్తంమీద విలువగల గ్రంథమే యిది. తిక్కనకు సమకాలీనుడై తరువాతి తరానికి చెందినవాడైన మంచన ఆనాటిప్రజల అభిరుచులకు వీలుగా కొన్నికొన్ని మామూలు కట్టుకథల్ని అక్కడక్కడ చొప్పించి 'విద్దసాల భంజిక' అనే నాటక కథను తెలుగులో పద్యరచనగా రచించి, దానిని వెలనాటి చోడ భూపాలుని అమాత్యుడు నండూరి గుండనకు అంకిత మిచ్చాడు. ఇతని కవిత్వమూ, శైలీ కేతన, మారనల కవిత్వం, శైలులను మించి వున్నాయి.

## సోమనాథుడు

ఓరుగల్లు కాకతీయ ప్రభువులు సంస్కృత కవులను పోషించగా, వారి సామంతులు, రాజోద్యోగులు తెలుగు కవులను పోషించారు. కాకతీయ ప్రభువులంతా శైవమతావలంబులు. వారిపేర్లే ఆ విషయాన్ని వ్యక్తం చేస్తుంటాయి. అయితే వీరువీరశైవులుగాని, శైవమతస్థులలో అతివాదులు కాని వారు. సామంతులు, యితర రాజోద్యోగులు వారి కిష్టంవచ్చినమతాన్ని అవలంభించారు. కొంత మంది శైవులు, మరికొంతమంది వైష్ణవులు వున్నారు. 13వ శతాబ్ది తొలిరోజుల్లో రెండవ ప్రతాపరుద్రుని పరిపాలనా కాలంలో

పాల్కురికి సోమనాథుడు తల ఎత్తాడు. ఈయన వేదవేదాంగాలలో పండితుడు. వీరశైవాన్ని ప్రవచించి తీవ్రంగా ప్రచారం చేసినవ్యక్తి. సామాన్యులలో యీ మతాన్ని ప్రచారం చేయడానికి తన జీవిత కాలాన్ని, పాండిత్యాన్ని ధారపోశాడు. మతాన్ని శాశ్వతంగా నిలిపేది సాహిత్యం ఒక్కటేననీ, అది లేకపోతే మతం త్వరలోనే అంతరించిపోతుందని యీయన గుర్తించాడు. వీరశైవ మతావలంబి అయిన బసవుడు రాజుగారి మంత్రిగా తన అధికారాన్నీ, ఐశ్వర్యాన్నీ మతప్రచారానికి జీవితకాలమంతా ధారపోయగలిగాడు. కాని తన మతాన్ని నిలబెట్టే శాశ్వతంగా నిలవగలిగిన సాహిత్యాన్ని సృష్టించగల పండితుడు కాదు ఆయన. సామాన్య జనతను ఆకర్షించేటట్టు ఏవో కొన్నిపాటల్ని మాత్రమే కూర్చగలడు. సోమనాథుడు యీ లోపాన్ని గుర్తించి పండిత, పామరులకు యిరువురకు సరిపోయే సాహిత్యాన్ని సృష్టించాడు. సంస్కృత, కన్నడ, తెలుగు భాషలలో దిట్టమైన కవి. తన మత సిద్ధాంతాలకు ప్రచారంగా మొదట్లో అనుభవసారం, చతుర్వేద సారాలను నన్నయ రచనాపద్ధతిలో వ్రాశాడు. ఈయన వివిధ పద్యరచనా మార్గాలలో ఆయాగ్రంథాలను వ్రాశాడు. ఇతని వృశాధిపశతం వందపద్యాలున్న గ్రంథం. బసవోద్ధరణ మరొక తరగతికి చెందిన పద్యరచన. వీరశైవ మత ప్రచారకుల జీవిత చరిత్రలు బసవపురాణం, పండితారాధ్య చరిత్రలను సులభంగా చదువుకోవడానికి, పాడుకోవడానికి వీలుగా సరళమైన ద్విపదలలో వ్రాశాడు. ఈ రెండు గ్రంథాలలోనూ యీయన మరికొంతమంది వీరశైవారాధకుల చరిత్రలు ఉటంకించాడు. ఈయన గ్రంథాలలో యీ రెండూ పేరు మోసినవీ, పెద్దవీను. మతవిషయంలోనే కాక సాహిత్యానికి సంబంధించికూడా యీయన పెద్ద తిరుగుబాటును లేవదీశాడు. భాషలో ప్రాంతీయభాషను వాడడంలోను, ఛందస్సు సూత్రాలను అధిగమించడంలోనూ చాలా ధైర్యంగా ముందు కొచ్చాడు. వీరశైవులు సోమనాథుని అనేక విషయాలలో గురువుగా భావిస్తారు కనుక, వారుతప్ప తెలుగుకవులు యింకెవరూ ఆయన విధానాలను అనుసరించరు.

వీర శైవమత వ్యాప్తికి సోమనాథుని ద్విపద పద్యరచన కావిస్తున్న అశేషకృషిని శీఘ్రతర వ్యాప్తిని చూసిన తరువాత రెండవ ప్రతాపరుద్రుని సామంతుడు, వైష్ణవ మతావలంబి యైన గోనబుద్ధారెడ్డి రామాయణాన్ని తెలుగు ద్విపద కావ్యంగా వ్రాసి, ప్రచారంచేయ సంకల్పించాడు. రంగనాథుడనే వైష్ణవ కవిని పిలిచి, యీ రచనా కార్యక్రమానికిపూనుకోవలసిందనీ, అందుకు ప్రతిగా కవిని అన్ని విధాలా తాను సంతృప్తి పరుస్తానని తెలయజేశాడు. రంగనాథ రామాయణం చక్కటి వ్యాకరణంతోకూడిన గ్రంథం. పాల్కురికి సోమన రచనల్లోని లోపాలను యిందులో సవరించడం జరిగింది. పండితులు దీనిని తెలుగులో మహాకావ్యంగా పరిగణిస్తారు. ఆంధ్రులలో యిది అధిక ప్రచారాన్ని పొందింది. కవి యిందులో అనేక ప్రాంతీయ కథలను యిరికించాడు. ఇవి వాల్మీకి రామాయణంలో కనిపించవు. ఇంద్రజిత్తు నిభార్య సులోచన కథ ఒక ఉదాహరణ. ఈ కవే ఉత్తర రామాయణాన్ని బుద్ధారెడ్డి కొడుకు పేరున ద్విపదలో రచించాడు.

## భాస్కర రామాయణం

ఆయాభాషలలోవున్న కవీశ్వరుల గొప్పతనాన్నిబట్టి భారతీయ భాష లన్నిటిలోనూ, తెలుగులోతప్ప, రామాయణం ఉత్తమ గ్రంథంగా, ప్రధానమైన గ్రంథంగా గుర్తించబడుతున్నది. తెలుగులో భారతం ఆ స్థానాన్ని ఆక్రమించింది. అంతమాత్రంచేత రామాయణాన్ని అలక్ష్యం చేయడం జరగలేదు. విశిష్టాద్వైతమతాన్ని ప్రబోధించిన రామానుజాచార్యుల రాకతో ఆంధ్ర దేశంలో కూడా రామాయణం ప్రాముఖ్యతను క్రమంగా గుర్తించడం జరిగింది. హుళక్కి భాస్కరుడు అనే కవీశ్వరుడు తెలుగు భారతంలో సమానమైన గౌరవాన్ని రామాయణానికి కలిగించే వుద్దేశ్యంతో తన కొడుకు మల్లిఖార్జున భట్టు సహాయంతోను, కుమార రుద్రదేవుని సహాయంతోను అనుచరుడు అయ్యలరాయుని సహాయంతోను రమాయణాన్ని చంపూ మార్గంలో రచించి, ఆద్దానిని రెండవ ప్రతాపరుద్రుని అశ్వదళాధిపతి సాహినీ మారకు అంకితంచేశాడు. తెలుగులో వివిధ కవులు రచించిన అనేక రామాయణాలు వున్నప్పటికీ యిప్పటికికూడా ఇదేతెలుగులో ఉత్తమ రామాయణంగా భావించబడుతున్నది. భాషలో స్వచ్ఛత, భావవ్యక్తీకరణలో నైపుణ్యంతో మూలానికి సాధ్యమైనంత సన్నిహితంగా ఉండేటట్టు కవి రచించడంవల్లనే యీ గ్రంథానికి యింత ప్రాముఖ్యత వచ్చింది. రామాయణాన్ని అనువదించేటప్పుడు ఈ కవులు భాషకు, ఛందస్సుకు సంబంధించిననన్నయభట్టుసూత్రాలను దృష్టిలోపెట్టుకున్నారు. శైలి, భావప్రకటన: వర్ణన, అలంకారాల వాడకాలనుదృష్టిలో పెట్టుకొనియీసలుగురికవితాశక్తినీపరిశీలిస్తేమొట్టమొదట భాస్కరుడు, తరువాత మల్లిఖార్జున భట్టు, ఆ వెనుక అయ్యలరాయుడు, చివరగా కుమారరుద్రదేవుడు వస్తారు. భాస్కరుడు అరణ్య పర్వాన్ని, యుద్ధకాండ ముందరి భాగాన్ని, మల్లిఖార్జునభట్టు బాల, కిష్కింధ, సుందర కాండాలను, అయ్యలరాయుడు

యుద్ధకాండలోని మిగిలిన భాగాన్నీ, కుమారరుద్రదేవుడు అయోధ్య కాండాన్ని అనువదించారు.

నన్నయ భారతాన్ని వ్రాస్తూ ఆగిపోయిన అరణ్యపర్వంలోని మిగతా భాగాన్ని పూరించే పనిని 14 వ శతాబ్దపు తొలి త్రైమాసికకాలం వరకూ ఏ పేరు ప్రఖ్యాతులు సంపాదించిన కవీశ్వరుడూ చేపట్టలేదు. దక్షిణ భారతాన్ని ముసల్మానులు ఆక్రమించడంతో కాకతీయ సామ్రాజ్యం పతనమై ముసల్మానుల హస్తగతమయ్యింది. కాకతీయప్రభువులసామంతులయిన రెడ్లప్రభువులు కృష్ణానది వద్దున అద్దంకి రాజధానిగా చేసుకుని చిన్నరాజ్యాన్ని స్థాపించుకున్నారు. ప్రోలయ వేమారెడ్డి మొట్టమొదటి రాజు. ఈయన 1324-52 వరకూ పరిపాలించాడు. ఇతని ఆస్థానంలో యర్రాప్రగడ అనే కవీశ్వరుడు వుండేవాడు. ఈయన హరివంశాన్ని అనువదించాడు. ప్రహ్లాద చరిత్రను నరసింహ పురాణం పేరుతో ప్రబంధమార్గంలో రచించాడు. దీనికేయీయనకు 'ప్రబంధ పరమేశ్వరుడు' అనే బిరుదు ఒసగ బడించిది. రామాయణాన్నికూడా యీయన వ్రాశా డని ఒక ప్రతీతి. కాని అది యిప్పుడు లభ్యంకావడం లేదు. నన్నయ అసంపూర్తిగా వదిలివేసిన అరణ్యపర్వంలోని మిగిలినభాగాన్ని యితడు పూర్తిచేసి కవిత్రయంలో ఒకడయ్యాడు. అసంపూర్తిగా వుండిపోయిన భాగాన్ని పూరించడంపై అప్పట్లో వుండిన మూఢ నమ్మకాన్ని త్రోసిరాజని యీ బృహత్కార్యాన్ని ఎర్రన చేపట్టి పూర్తిచేశాడు. మహాభారత రచనలో శైలిలో, కూర్పులో నన్నయ, తిక్కనలు యిరువురికీ ఎంతోతేడా వుంది. ఎర్రాప్రగడ యీ యిరువురి మధ్య గలఅగాధాన్ని తన కవితాశక్తితో పూరించి, యిరువురకూ సన్నిహితంగా వచ్చాడు. మహాకవులయిన నన్నయ, తిక్కనల తర్వాతనే ఎర్రనను పేర్కొనడం జరిగినప్పటికీ యీయనను గొప్పకవిఅనడంలో సందేహం లేదు. యీయన భావప్రకటన అతి సహజంగానూ, సూటిగానూ వుంటుంది. నిజంగా యీయన కవిత్రయంలో వుండదగినవాడే.

## కొత్త నాయకత్వం

తుంగభద్రా నదివద్దున వెలసిన విజయనగర సామ్రాజ్య ప్రభువు బుక్కరాయల ఆస్థానంలోతలెత్తిన యీ కాలంనాటిమరొక మహాకవి నాచన సోమనాథుడు. నన్నయ తిక్కనలతో దీటైన కవి యీయన. ఎర్రాప్రగడ హరివంశానికి పోటీగా యీయన ఉత్తర హరివంశాన్ని రచించి దాన్ని తిక్కనవలె హరిహరనాథ దేవునికి అంకితమిచ్చాడు. శక్తి సామర్థ్యాలు గల చక్కటి కవీశ్వరుడీయన. తెలుగు సాహిత్యంలో కొత్తపుంతల్నిత్రొక్కాడు. తనకవిత్వంలో ఎన్నో కల్పిత విధానాలను ప్రవేశ పెట్టాడు. ఇంతవరకూ తెలుగు కవిత్వం అతి సహజంగాను, సరళంగాను నడిచింది. నాచన సోమనాథుని చేతుల్లో కృత్రిమ ధోరణులను అలవరచుకుంది. తెలుగు భాషకు యిది పూర్తిగా కొత్త. అందుచేతనే యీయనను గొప్ప కవీశ్వరునిగా భావించడం జరుగుతున్నది. ఉత్తర హరివంశంలో క్రూర రాక్షసులను సంహరించిన శ్రీకృష్ణుని మహత్తును వివరించే కథలు వున్నాయి. నాచన సోమన పాండిత్యంలో తనకుగల ప్రజ్ఞనంతా యిందులో ప్రకటించుకున్నాడు. అందుచేత యిది పండితులకు కూడా కొరుకుపడని స్థాయిలోవుంది. భాషపై యీయనకుగల ఆధిపత్యం, రసోత్పత్తి, గంభీరమైన భావాలు, సరికొత్త మార్గాలు- యివన్నీ యీయనను కవిత్రయం సరసన కూర్చుండబెట్టాయి. ఎర్రన, సోమన- యిద్దరూ తమ కవిత్వానికి హరివంశంలోని ఒకేవిషయాన్ని తీసుకున్నారు.

ఎర్రన రచనల్లో నిజమైన కవిత్వం మనకు కనుపిస్తుంది. హాయి అనిపిస్తుంది. ఈయన వర్ణనలు, శైలి పిల్లతెమ్మెరలవలె వుంటాయి. సోమన రచనల్లో భాషపై కవికిగల ఆధిపత్యాన్ని వ్యక్తం చేసే అసాధారణ, అసంబద్ధ వర్ణనలు కనిపిస్తాయి. అనుప్రాసకొరకు ఒకే రకపు మాటల్ని పదేపదే వాడి మన అభిమానాన్ని చూరగొంటాడు. సర్వసాధారణంగా మనం అతని శక్తికి అచ్చెరు వందుతాం. ఆకవిత్వంవల్ల ఆనందం కలగడంపోయి ఆశ్చర్యం కలుగుతుంది మనకు. తర్వాతి ప్రబంధ కాలంలో యీ కవితాలక్షణాలు బాగా అభివృద్ధి చెందాయి. దీనికి విత్తు నాటినవాడు. సోమనాథుడు. ఈ కవితో కవిత్రయ కాలం- లేదా పురాణ కాలం- అంతరించింది. [సశేషం]

# ఆహ్వానం

—జె. బాపురెడ్డి

కొమ్మలలో కోకిలమ్మ
"కుహూ, కుహూ" మన్నదే
నిన్ను నన్ను జంట గూడి
నేడే రమ్మన్నదే!
కొండమీద సెలయేటి
గుండె ఝల్లు మన్నదే
మనము ఆడి పాడకున్న
మనలే నంటున్నదే!
తీయని వెన్నెల, మబ్బుల
తెరల దూరుచున్నదే
మన వియోగ విలయాగ్నికి
మందుచుంటి నన్నదే!

పచ్చని తోటల మోములు
వాడిపోవుచున్న వే
మన ప్రణయ విలాసవసం
తముకై వేచియున్నవే!
కడలి కెరటములు మనకై
కదలి వచ్చుచున్నవే
తీరమ్మున మనము లేమి
తిరిగి పోవుచున్నవే!
చీకటి లోకమును చూచి
చెంచల కంపించెనే
కంపములో మన గుండెల
కలిపి కౌగలించెనే.

# ప్రశ్నోత్తరావళి

శ్రీ కె. వెంకటప్పారావు, వెదుళ్ళవలస, శ్రీకాకుళం జిల్లా.

ప్రశ్న : సెకండరీ స్థాయిలో కూడా ప్రభుత్వం పాఠ్యపుస్తకాలను జాతీయం చేస్తుందా ?

సమాధానం : చేస్తుంది. ఉద్దేశించిన కార్యక్రమం ప్రకారం సెకండరీ పాఠశాలలకు సంబంధించిన భాషా పాఠ్య పుస్తకాలు జాతీయం చేయబడతాయి.

ప్ర : స్త్రీలు ప్రయివేటుగా ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షకు యిప్పుడు కూర్చోవచ్చునా ?

సమా : కూర్చోవచ్చు. అయితే వీరు పదిహేను సంవత్సరాల వయసు కలిగి వుండి, ఆంధ్ర ప్రాంతంలోని సెకండరీ పాఠశాల ప్రధానోపాధ్యాయునిచేత ఆ పరీక్షకు కూర్చోవడానికి తగివున్నట్లుగా దృవపరుచబడాలి.

శ్రీ జి. సుబ్బారెడ్డి, అరగొండ, చిత్తూరు జిల్లా.

ప్ర: ఎస్. ఎస్. ఎల్. సి. విద్యార్థులకు హిందీ విషయంలో అయిదు మార్కులు తక్కువ వచ్చినా ప్రభుత్వం ప్యాసు చేస్తున్నది. విద్యార్థులు తగినంత స్థాయికి చేరుకోలేదని యీ విధంగా చేయడంకన్న వాళ్ళ స్థాయిని పెంచే ప్రయత్నం ప్రభుత్వం ఎందుకు చేయకూడదు ?

సమా : రాష్ట్రంలోని పాఠశాలల్లో విద్యాస్థాయిని పెంచడానికి ప్రభుత్వం అన్ని విధాలా ప్రయత్నిస్తున్నది. ఎస్. ఎస్. ఎల్. సి. పబ్లిక్ పరీక్షలో హిందీలో అయిదు మార్కులు తక్కువ వచ్చినా ప్యాసు చేయడం అనేది ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా తాత్కాలికంగా ఏర్పాటు చేసినదే గాని ఎల్లప్పుడూ ఆచరించేది కాదు.

శ్రీ పి. సాంబశివరావు, గుండాడు, కరీంనగర్ జిల్లా.

ప్ర: 1. గత ఏడాది నేను పొగాకు నాటాను. కాని దానికి పురుగు కాటు జబ్బు తగిలి, ఆకులకు చిల్లులు పట్టాయి. దయచేసి ఈ తెగులు నివారణోపాయాన్ని తెలియ జేస్తారా. క్రిమి సంహారక మందు చల్లిన పొగాకు వాడకానికి పనికిరాదనే నమ్మకం గ్రామస్తులలో వున్నది. ఎంతవరకు యీ నమ్మకం యదార్థమైనది ?

2. మిరపపొలానికి తెగులు తగిలి చిగురు ఆకులు పాలిపోవడం, పూత రాలిపోవడం, మొక్క గిడస బారిపోడవం జరుగుచున్నది. ఈ తెగులు నివారణోపాయాన్ని దయచేసి సెలవీయండి ?

3. కొన్ని వేపచెట్లు క్రమంగా ఆకుల దగ్గరనుండి కాండం వరకూ ఎండిపోతున్నాయి. దీని నివారణోపాయం ఏమిటి ?

సమా : 1. పురుగుకాటు పొగాకుకు వచ్చే పెద్ద జబ్బు. ఈ క్రిములు గుంపులు గుంపులుగాచేరి ఆకులను పాడుచేస్తాయి. రసాన్ని పీల్చివేసి మొక్కను నిస్తేజం చేస్తాయి. ఎక్కువగా వీటిబారిన పడిన మొక్కల ఆకులు యీవిధంగా వడిలిపోతాయి. ఈ క్రిమికి త్వరత్వరగా సంతతిని అభివృద్ధి చేసుకునే గుణం వుంది. కొద్దిరోజుల్లో మొత్తం పంటంతా పాడయిపోతుంది.

ఈ తెగులును హెచ్. ఇ. టి. పి. పారథిన్, ఎండ్రిన్ యింకా యితర ఆర్గనిక్ ఫాస్ఫేటిక్ క్రిమి సంహారక ఔషధాలు అదుపులో పెడతాయి. పారథిన్ 0.25 శాతం చొప్పున, హెచ్.ఇ.టి.పి. 0.02 శాతం చొప్పున, ఎండ్రిన్ 0.032 శాతం చొప్పున చల్లాలి. పైన గల హెచ్. ఇ. టి. పి. తప్ప అన్ని క్రిమి సంహారక ఔషధాలకు కొంత కాలం పాటు పనిచేసే శక్తి వుంది. ఈ మందుల ఫలితం యీ మొక్కల మీద నాలుగు అయిదు వారాలపాటు వుంటుంది. అందుచే 4,5 వారాలలో కోసివేసే పొగాకు మొక్కలమీద ఈ రసాయనిక ఎరువులను చల్లడం మంచిపని కాదు. తగిన చర్యలు తీసుకుంటే–అంటే ఆకు కోతకు 4,5 వారాలముందు రసాయనిక ఎరువులను చల్లడం మానుకుంటే – అలాంటి పొగాకును వాడడంలో ఏలాటి అభ్యంతరమూ లేదు.

2. మీరు చెప్పిన దానినిబట్టి మిరప పంటకు వేరుతెగులు, వడిలిపోవడం బూజువల్ల సంభవించే జబ్బులు. పంట తొలిరోజుల్లో ఆకులు రాలిపోవడం, చిగురు ఎండిపోవడం జరుగుతూ వుంటుంది. పెరిగిన పంటలో మిరపకాయలు మెత్తబడి క్రమంగా కుళ్ళిపోతాయి. 5–5–50 బోర

(మిగతా 56 వ పేజీలో)

# భారతదేశంలోని గ్రామ పరపతి వ్యవస్థ

భారతదేశంలోని రైతులకు అవసరమైన ఋణాలు మొత్తంలో నూటికి 63 వంతులు వడ్డీవ్యాపారులు, వర్తకులు, భూస్వాములు, రైతుల బంధువులు, ప్రయివేటు వ్యక్తుల ద్వారా సరఫరా అయింది. ప్రభుత్వం, సహకార సంఘాలూ కలిపి నూటికి 6 వంతులూ వాణిజ్య బ్యాంకులు నూటికి ఒకవంతూ సరఫరాచేశాయి. రైతులకు నేరుగా ధనసహాయం చేయడంలో వాణిజ్య బ్యాంకులు అతి స్వల్ప పాత్ర వహించాయి. రిజర్వు బ్యాంకుఆఫ్ ఇండియా 1951లో నెలకొల్పిన గ్రామీణ పరపతి సర్వేసంఘం రూపొందించిన నివేదికలో పై సమాచారం పొందుపరచబడింది.

గ్రామ పరపతి వ్యవస్థకు సంబంధించిన గణాంక సమాచారాన్ని సేకరించి, ఒక సమగ్రమైన విధానాన్ని రూపొందించే నిమిత్తం యీ సంఘం ఏర్పాటయింది. దేశంలో సహకార పరపతి వ్యవస్థను మెరుగు పరచడానికి ఆ సంఘం అనేక సిఫార్సులు చేసింది. సహకార సంఘాల ద్వారా పరపతి సౌకర్యాలు కల్పించడమొక్కటే పరిష్కార మార్గమని ఆ సంఘం సూచించింది. ఆ సంఘం చేసిన సిఫార్సులను మొత్తంమీద ప్రభుత్వం ఆమోదించి ద్వితీయ, తృతీయ ప్రణాళికల కాలంలో అమలు జరిపింది. ఈ సిఫార్సులు అమలు ఫలితంగా గ్రామపరపతి సౌకర్యాల కల్పనతో సహకార సంఘాల ప్రాముఖ్యత ఎక్కువైంది. స్వల్పకాలిక సహకార పరపతి వ్యవస్థ మూడుదశలలో నిర్మించబడింది. ప్రాథమిక సహకార సంఘాలు మొదటిదశ. మిగిలినవి జిల్లా స్థాయిలో కేంద్ర సహకార బ్యాంకులూ, రాష్ట్రస్థాయిలో అపెక్సు సహకార బ్యాంకులు.

రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియా దేశానికంతకూ కేంద్ర ఆర్థిక సహాయ వ్యవస్థ. వ్యవసాయ కార్యకలాపాల నిర్వహణకూ, పంటల మార్కెటింగుకూ, ఆయా ఋతువులలో రిజర్వుబ్యాంకు అపెక్సు సహకార బ్యాంకులకు ఋణా లిస్తుంది. ఆ విధంగా లభించిన మొత్తాలనూ, సహకార బ్యాంకుల పెట్టుబడులనూ జతపరచి సహకార పరపతి వ్యవస్థ ద్వారా రైతులకు అప్పులు యిస్తున్నారు.

1962 జూన్ 30 నాటికి దేశంలో రాష్ట్ర సహకార బ్యాంకులు 21 వున్నాయి. వాటి వాటా మూలధనం రు. 21.27 కోట్లు. నిర్వహణవ్యయం రు. 256.03 కోట్లు. ఆ బ్యాంకుల మొత్తం రు. 256.29 కోట్లు ఋణాలక్రింద ఇచ్చాయి. నిర్వహణ వ్యయంలో రు. 81.32 కోట్లు అంటే నూటికి 21.8 వంతులు డిపాజిట్ల రూపంలో వున్నాయి. ఈ బ్యాంకులు అప్పులక్రింద ఇచ్చిన మొత్తంలో నూటికి 50 వంతులు రిజర్వుబ్యాంకునుంచి అప్పుగా తెచ్చుకున్నదే.

పైనపేర్కొన్న తేదీనాటికి దేశంలోవున్న కేంద్ర సహకారబ్యాంకుల సంఖ్య 387. వాటి మూలధనం రు. 47.64 కోట్లు. నిర్వహణ వ్యయం రు. 352.44 కోట్లు. ఆ మొత్తంలో రు. 166.32 కోట్లు అప్పుగా తెచ్చింది. రు. 124.36 కోట్లు డిపాజిట్లక్రింద వచ్చినవి. 1961-62లో యీ బ్యాంకులు ఋణాలుగా ఇచ్చిన మొత్తం రు. 382.87 కోట్లు. సహకార పరపతివ్యవస్థ భవిష్యత్తు వ్యవసాయ పరపతిసంఘాలపై ఆధారపడి వుంది. ఈ సంఘాలు క్రమంగా పెరుగుతున్నాయి. ఈ సంఘాల ప్రగతి యీ క్రింది జాబితానుబట్టి తెలుసుకోవచ్చు :*

సహకార వ్యవసాయ పరపతి సంఘాలు 1951 లో రైతుల అవసరాలలో నూటికి మూడువంతులు తీర్చగా 1961 లో నూటికి 20 వంతులు తీర్చాయి అని అంచనా.

తృతీయ ప్రణాళికఆఖరు సంవత్సరంలో అంటే 1965-66 లో ప్రాథమిక వ్యవసాయ పరపతిసంఘాలు స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణాల రూపంలో 500 కోట్ల రూపాయలు ఇవ్వాలని లక్ష్యంగా నిర్ణయించుకోడం జరిగింది.

| *సంవత్సరం | సంఖ్య లక్షలలో | సభ్యత్వం లక్షలలో | నిర్వహణ వ్యయం | మంజూరుచేసిన ఋణాల మొత్తం కోట్ల రూపాయలలో |
|---|---|---|---|---|
| 1959-60 | 2.05 | 144.68 | 223.85 | 168.40 |
| 1960-61 | 2.12 | 170.41 | 273.95 | 202.75 |
| 1961-62 | 2.15 | 195.60 | 325.25 | 228.09 |

## పునరుజ్జీవన కార్యక్రమం

1956 జూన్ 30 వ తేదీ నాటికి దేశంలో వున్న సుమారు 2 లక్షల ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలలో నూటికి 5 వంతులు కడు హీనస్థితిలోనూ, నిర్జీవంగానూ వున్నాయి. సహకార వ్యవసాయాభివృద్ధికి 1959—60 లో రూపొందిన క్రమబద్ధమైన కార్యక్రమంలో భాగంగా పునరుజ్జీవన పథకం అమలు పరచబడింది. 1960—61 ఆఖరునాటికి 40,000 సంఘాలకు పునరుజ్జీవన కృషి విస్తరించడం జరిగింది. తృతీయ ప్రణాళికా కాలంలో 53,000 ప్రాథమిక సంఘాలకు యీ కృషిని విస్తరింప చేశారు. తృతీయ ప్రణాళికాంతానికి అంటే 1965—66 నాటికి బలహీనంగావున్న సంఘాలలో హెచ్చు మొత్తానికి దీనిని విస్తరింపజేస్తారు.

సంఘంలో ఆర్థికంగా వెనకబడి వున్న వర్గాలవారికి వ్యవసాయ కార్యకలాపాలకు గాను తగిన పరపతిని సమకూర్చేందుకు వీలుగా అట్టి సంఘాలకు నేడు గ్రాంట్లు ఇచ్చే పథకం క్రిందటి సంవత్సరం నుంచీ అమలు పరుస్తున్నారు. హామీ క్రింద ఇవ్వడానికి చెప్పుకోదగిన ఆస్తులు లేని పేదవర్గాల వారికి ఋణాలు ఇచ్చినప్పుడు, తిరిగిరాని పద్దులకు గాను రిజర్వు నిధిక్రింద ఆ గ్రాంట్లు మంజూరు చేయడం జరుగుతున్నది.

1960 లో మెహతా సంఘం సహకార పరపతి పరిశీలనా సంఘం చేసిన సిఫార్సు మేరకు ఎంచుకున్న ప్రాథమిక సంఘాల వాటా ధనంలో ప్రభుత్వం కూడా పాలు పంచుకునే సౌకర్యం కల్పించబడింది.

ఇచ్చిన ఋణాలను తిరిగి రాబట్టుకునేందుకు వీలుగా సహకార మార్కెటింగు, ప్రొసెసింగుల అభివృద్ధి పథకాన్ని పంచవర్ష ప్రణాళికలలో భాగంగా అమలు జరుపుతున్నారు. ప్రతి మార్కెటులోనూ మార్కెట ఆ సంఘం సభ్యుల తాలూకు పంటల క్రయ విక్రయాలలో పాల్గొని, క్రయ ధనంనుంచి అప్పు వసూలు చేయడంలో తోడ్పడడం ఆ సంఘాల ప్రధాన కార్యకలాపాలు.

సహకారోద్యమాన్ని సక్రమంగా అభివృద్ధి చేయాలంటే గ్రామాన్ని ప్రాథమిక యూనిటు చేసి సహకార సంఘాన్ని నెలకొల్పాలనీ, గ్రామస్థాయిలో ఆర్థిక సాంఘిక పురోభివృద్ధి బాధ్యత గ్రామ సహకారసంఘం, గ్రామ పంచాయతీలకు పూర్తిగా ఇవ్వాలనీ, 1958 లో జాతీయాభివృద్ధి మండలి నిర్ణయించింది. సహకార సంఘం ద్వారా పరపతి సౌకర్యం వ్యవసాయోత్పత్తులు, మార్కెటింగు సౌకర్యాల కల్పనతో జతపరచాలనీ. విత్తనాలు, రసాయనిక ఎరువుల సరఫరాను గ్రామ సహకార సంఘాలు నిర్వహించాలనీ కూడా నిర్ణయించారు. ఈ విషయాన్ని మెహతా సంఘం మరింత క్షుణ్ణంగా పరిశీలించి 3000 జనాభాకు మించని మూడు నాలుగు గ్రామాలకు కలిపి ప్రాథమిక సహకార సంఘాన్ని నెలకొల్పాలని నిర్ణయించడం జరిగింది. ఈ విధానం ఇప్పుడు దేశవ్యాప్తంగా అమల్లో వుంది.

సరిపడిన ఋణం సకాలంలో అందజేయడానికి గాను జిల్లా సహకార బ్యాంకులనూ, అపెక్సు బ్యాంకులనూ, పునర్నిర్మించి, పటిష్ఠం చేయడం జరిగింది. స్థానికంగా చిన్న మొత్తాల పొదుపురీత్యా సేకరించిన ధనంతోనూ, వాటామూలధనంలో ప్రభుత్వం పెట్టుబడులు పెట్టడంద్వారానూ, ఆబ్యాంకులు పెట్టుబడి మొత్తం పెంపొందింపజేశారు. శిక్షణపొందిన అదనపు పాలక, అజ్మాయిషీ సిబ్బందిని నియమించడానికి రాష్ట్రప్రభుత్వాలు యీ బ్యాంకులకు సబ్సిడీలు యిస్తున్నాయి.

రాష్ట్రంలోనూ కేంద్రభూమి తనఖా బ్యాంకు వున్నది. ఈ బ్యాంకులు డిబెంచర్ల ద్వారా నిధులను సేకరిస్తాయి. ఆ డిబెంచర్లతాలూకు అసలు సొమ్ము వడ్డీ చెల్లింపుల విషయంలో ఆరాష్ట్ర ప్రభుత్వం హామీ యిస్తుంది. డిబెంచర్ల ద్వారా సొమ్ము సేకరించేలోగా అవసరమైన తాత్కాలిక ఆర్థిక సహాయాన్ని కూడా రాష్ట్రప్రభుత్వాలు చేస్తాయి. జీవితభీమా కార్పొరేను, రిజర్వు బ్యాంకుఆఫ్ ఇండియా, స్టేటుబ్యాంకు ఆఫ్ ఇండియా యీ డిబెంచర్లను ఖరీదు చేస్తున్నాయి. 1961—62 ఆఖరుకు దేశంలో 18 కేంద్ర భూమితనఖా బ్యాంకు లున్నాయి. వాటి వాటా మూలధనం రు 5 74 కోట్లు. నిర్వహణ వ్యయం రు 61.72కోట్లు. 1962 జూన్ ఆఖరుకు డిబెంచర్ల రీత్యా యీ బ్యాంకులు 48.07 కోట్లరూపాయలు సేకరించాయి. ఈ బ్యాంకులు అప్పుగా ఇచ్చిన మొత్తం రు 14.76 కోట్లు. ఈ బ్యాంకుల తాలూకా, లేదా జిల్లా స్థాయిలో పనిచేసే ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులకూ అప్పులు ఇస్తారు. మరోకొన్ని సందర్భాలలో ఏకాఎకిగా తమబ్రాంచీలద్వారా యీ ఋణ సౌకర్యం కలుగజేస్తాయి. 1962 జూన్ 30 వ తేదీనాటికి దేశంలో 535 ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులు ఉన్నాయి. వీటిలో సభ్యులసంఖ్య 8.52 లక్షలు. వీటివాటా మూలధనం 2.82కోట్లు. వీటి నిర్వహణ మూలధనం రు 38 42 కోట్ల వరకూ ఉన్నది. ఈ బ్యాంకులు, వ్యవసాయదారులకు రు 12 58 కోట్ల మేరకు దీర్ఘకాలిక ఋణాలు మంజూరు చేశాయి. 1962 జూన్ 30వ తేదీనాటికి రైతులనుంచి యీ దీర్ఘకాలిక ఋణాల మూలంగా యీ భూమి తనఖా బ్యాంకులకు రావలసిన బకాయిల

(మిగతా 58 వ పేజీలో)

# 'రణభేరి'

విఖ్యాతాంధ్రకవులు

జాతీయైక్యత, రక్షణోద్యమ సందేశాలతో రచించిన ఉత్తేజకరాలైన

గేయముల రెండవ సంపుటి

వెల 00-25 న. పై.

ఇతర ప్రచురణలు

| | | |
|---|---|---|
| శంఖారావం (గేయాలు) | 0-25 | న. పై. |
| కనువిప్పు (బుర్రకథ) | 0-25 | ,, |
| చైనా ద్రోహం : వీరభారత్ (బుర్రకథలు) | 0-25 | ,, |
| పాంచజన్యం. (బుర్రకథ) | 0-25 | ,, |
| అల్లూరి సీతారామరాజు చరిత్ర | రూ. 2-75 | ,, |
| వందేమాతరం : (నాటిక) | రూ. 1-00 | |
| అగ్గిగుండెలు - మరి రెండు నాటికలు | రూ. 1-00 | |

ప్రచురణ

సమాచార ప్రజాసంబంధాలశాఖ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాద్

(56 వ పేజీ తరువాయి)

మొత్తం రు 49.46 కోట్లవరకూ వున్నది. తృతీయ ప్రణాళిక ఆఖరు సంవత్సరంలో యీ బ్యాంకుల ద్వారా రు 150 కోట్ల మేరకు ఋణ సౌకర్యం కల్పించాలని లక్ష్యంగా పెట్టుకున్నారు.

దేశంలో భూమి తనఖా బ్యాంకింగ్ వ్యవస్థ నిర్వహించే వివిధ కార్య కలాపాలను సమన్వితపరచి యీ రంగంలోని వివిధ సంస్థల కృషిని సమన్వయం చెయ్యడానికి గాను ఇటీవల కేంద్ర సహకార భూమి తనఖా బ్యాంకుల సమాఖ్య ఒక దానిని ఏర్పాటు చేశారు. దేశంలో ఇటువంటి సహకార బ్యాంకులద్వారా ఇంకా ఎక్కువగా దీర్ఘకాలిక ఋణాలు యివ్వడానికి అవకాశం కల్పించేందుకుగాను సమన్విత విధానాలను రూపొందించే విషయంలో భూమి తనఖా బ్యాంకులకు యీ సమాఖ్య సహాయ పడుతున్నది.

భూమి అభివృద్ధికీ, వ్యవసాయోత్పత్తి పెంపొందింప చెయ్యడానికీ గాను ప్రభుత్వం ఎకాఎకిగా వ్యవసాయ దారులకు తక్కావీ ఋణాలు ఇస్తున్నది. 1960–61 వ సంవత్సరంలో రైతుల ఋణావసరాలలో నూరింట మూడువంతులు ప్రభుత్వమే తీర్చడం జరిగింది. ఇక ముందుట ఒకేసంస్థ ద్వారా యీ ఋణసౌకర్యం కల్పించడానికి వీలుగా ప్రస్తుతం ప్రభుత్వం వ్యవసాయదారులకు ఇచ్చే ఋణాలుకూడా మున్ముందు సహకార సంఘాలద్వారా ఇవ్వాలని భారత ప్రభుత్వం నిర్ణయించింది. తక్కావీ ఋణాలను కూడా సహకార సంఘాలద్వారా ఇప్పించే యీ క్రొత్తపద్ధతి దేశంలో మూడు లేదా అయిదు సంవత్సరాలలో అమలు జరుగుతుందని ఆశించబడుతోంది. ప్రత్యేకంగా తక్కువ వడ్డీరేటుకు ఋణాలు ఇవ్వాలని ప్రభుత్వం అభిప్రాయపడిన సందర్భాలలో మామూలు వడ్డీరేటుకంటె ఇలా తక్కువ వడ్డీరేటున అప్పులు ఇవ్వడంమూలంగా కలిగేనష్టం భరించేందుకుగాను సహకార సంఘాలకు ప్రభుత్వం సబ్సిడీలు ఇస్తుంది.

చాలాభూమి పెద్దఎత్తున సాగుకు రాయతీ చెయ్యడానికి తోటను పెంచడానికి పూనుకున్న కొన్ని ప్రత్యేక ప్రాంతాలలో వ్యవసాయదారులకు దీర్ఘకాలిక ఋణాలు అవసర మవుతాయి కనుక వీరికి ఋణ సౌకర్యం కల్పించేందుకు ప్రత్యేక పథకాలు రూపొందించవలసి ఉన్నది. దేశంలో ప్రస్తుతం ఉన్న సహకార వ్యవస్థ చాలిన మేరకు ఆదాయవనరులు లేకపోవడంచేత యీ అవసరాలను తీర్చలేకపోతున్నది. ఇందునిమిత్తం రూపొందించిన పథకాలకు గాను అప్పులు ఇచ్చేందుకు సహకార బ్యాంకులకు యీ సంస్థద్వారా పునరార్థిక సౌకర్యాలు కల్పించడం జరుగుతుంది.

పంచవర్ష ప్రణాళికలలో చేర్చిన ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి కార్యక్రమంలో ఒక భాగంగా యీ వివిధ చర్యలను అమలు పరచడం జరుగుతున్నది. వీటిమూలంగా మున్ముందు గ్రామ ప్రాంతాలలో ఋణ సౌకర్యం కల్పించే సంస్థగా సహకార ఋణ వ్యవస్థ అభివృద్ధి చెందడానికి ఎంతో దోహదం కలుగగలదని భావించబడుతోంది. దేశంలో వ్యవసాయదారుల ఋణావసరాలలో నూరింట 20 నుంచి 25 వంతులదాకా ప్రస్తుతం ఉన్న సహకార సంఘాలద్వారా తీర్చడం జరిగింది. ★

---

## ప్రశ్నోత్తరావళి

(54 వ పేజీ తరువాయి)

డెక్స్ మిశ్రమాన్ని చల్లిగాని, లేదా ప్రొప్రైటరీ కాపర్ ఫంగిసైడ్‌ను (50 శాతం మెటాలిక్ కాపర్ వున్న దానిని) 1 పౌనును 30 గేలన్ల నీటిలో కలిపి చల్లిగాని యీ తెగులును అరికట్టవచ్చు. రెండుసార్లు–ఒకసారి మొక్క తొలి రోజుల్లోనూ రెండవసారి కాయలు దిగిన తర్వాతను – చల్లితే చాలు.

3. మీరు వివరించిన దానినిబట్టి వేపచెట్టుకు పట్టిన తెగులు సరిగ్గా నిమ్మచెట్టుకు పట్టే తెగులులాంటిదిగా అనిపిస్తున్నది. సాధారణంగా యిది మరీగట్టిగా నేల వుండడం వల్లనూ, లేదా నీటి సౌకర్యం సరిగా లేనందువల్లనూ సంభవిస్తుంటుంది

అలాంటి చెట్లను పరిశీలించడానికై మీరు మీకు దగ్గరలోవున్న వ్యవసాయాధికారిని సంప్రదించండి. నేలలో లోపమేమీ కనుపించకపోతే దెబ్బతిన్న భాగాన్ని రాజేంద్రనగర్‌లో వున్న ప్రభుత్వ వృక్షరోగ లక్షణ శాస్త్రజ్ఞునికి పంపి సలహాలను, నిరోధక సూచనలను పొందవచ్చు ★

గమనిక

**54 వ పుటలో** తరువాయి 58 వ **పేజీకి** మారు 56 అని అచ్చు పొరపాటు దొర్లింది పాఠకులు గమనించ గోరెదము




# * జాతీయ సమైక్యత - మహిళలు *

—డా॥ టుకూరి శకుంతలా దేవి

చైనా హఠాత్తుగా భారత సరిహద్దు భూభాగంపై దాడిచేయడంతో దేశంలో జాతీయ ఐక్యవాతావరణం వచ్చేసింది. చైనా అక్రమ హింసాకాండకు వ్యతిరేకంగా దేశం అంతా ఒకటిగా లేచి నిల్చుంది. యావత్ దేశంలో చైనా ప్రభుత్వానికి వ్యతిరేకంగా క్రోధజ్వాలలు బయలు దేరినవి. ప్రతిచోట శాంతి, దేశ పునర్నిర్మాణ విధానంలో మునిగివున్న దేశంపై చైనా తన భయంకర రాక్షసత్వంతో ఆకస్మికంగా దాడి జరిపింది. నిజంగా చెప్పాలంటే భారతదేశం సైనిక బలాన్ని పెంచేవిషయంలో అప్రమత్తతగానే ఉన్నది. కారణం భారత దేశాని కిప్పుడు యుద్ధకాంక్ష లేకపోవటమే.

భారత ప్రభుత్వం పిలుపు నందుకొని యావత్ ప్రజానీకం ఒక త్రాటిమీద నిల్చొని, ఈ భయంకర చైనారాక్షసులెన్నెదుర్కోవటానికి సంసిద్ధమైంది. తమలోవున్న స్పర్థలకు స్వస్తిజెప్పి అన్ని ప్రాంతాలవారూ ఒకటేనని చాటిచెప్పారు.

చైనా మనకు మిత్రుడనని చెప్పుతూనే వెన్నుపోటు పొడిచింది. అంతర్జాతీయంగా యిప్పటికే విశ్వాసాన్ని కోలుపోయి ఉన్న చైనా తన రాక్షసస్వరూపాన్ని బైట పెట్టడంతో ప్రపంచం చైనా కమ్యూనిజం యొక్క నిజస్వరూపం బట్టబయలైంది.

చైనా భవిష్యత్ పథకం విషయంలో ప్రపంచానికి నిజస్వరూపం తెలిసిపోయింది. ఆసియాలోకల్లా తానొక పెద్దరాజ్యం కావాలని ఆకాంక్ష. ప్రజాస్వామ్యాన్ని ఆసియాలో బలపడకుండా చేయాలి. అందుకై ప్రజాస్వామ్య దేశాలైన ఇండియాపై మొట్ట మొదట కత్తిగట్టింది. కమ్యూనిజం పేరుతో యావత్ ఆసియా దేశాలనూ తనగుప్పెట్లోకి తెచ్చుకోవడమే, చైనా భవిష్యత్పథక మని తేటతెల్లమై పోయింది.

చైనా పూర్వచరిత్రను చూస్తే బలహీనమైన దేశాలను కబళించి వేయడం, బలంకల దేశాలతో పోరాడలేనప్పుడు తన ఓటమిని అంగీకరించటమే వీరి విధానంగా కనబడుతుంది. ఇప్పటికీ యదార్థంగా చూస్తే వీరి విధానం అట్లాగే కన్పిస్తున్నది.

భారతదేశం ఒక విశాలమైన పుణ్యభూమి. మన దేశంలో అటు హిమాలయం మొదలుకొని ఇటు కన్యాకుమారి వరకూ వున్న ప్రతిప్రాంతానికీ ఒక ప్రత్యేకత వున్నది. తెల్లని మంచుకొండలతో సర్వాంగ సుందరదృశ్యాలతో శోభిల్లుతూన్న కాశ్మీరం దట్టమైన అడవులు, పొలాలు, ఖనిజ సంపదలతో తులతూగుతూన్న అస్సాం ప్రాముఖ్యత మనకు తెలియనిది కాదు. రాజస్థాన్ వీరుల రణగాథలు మనదేశంలో పశిపిల్లలకు సైతం తెలిసినవే. అటు దక్షిణదేశంలోని ఆంధ్ర, కేరళ, కర్నాటక, తమిళ ప్రజల పురాతన సంస్కృతీ, నాగరికతా, మనకు గర్వకారణమైనవి. బెంగాల్, పంజాబ్ గుజరాత్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల ఔన్నత్యము మనదేశంలో అనాదిగా నిరంతరం ప్రవహించే జీవనదులైన గంగా, యమున సరస్వతీ, కావేరి, కృష్ణా, గోదావరి మొదలైన మహానదుల తీరంలో ఎన్నో రాజ్యాలు విలసిల్లినవి. మన నాగరికత సభ్యత, సంస్కృతి ఒడ్డున యిప్పటికే సజీవంగావున్న అనేక పురాతన పట్టణాలు మన సంస్కృతి ప్రాచీనతకు నిదర్శనములు శిథిలమైపోయిన అనేక మన ప్రాచీన నగరాం లోని, శిల్పాలు, కళాఖండాలు మన ప్రాచీన నాగరికతనుచాటుచున్నవి. అజంతా, ఎల్లోరా గుహలలోని శిల్పాలు చిత్రాలు నాగార్జున కొండలోని బౌద్ధక్షేత్రాలు మన ప్రాచీన శిల్పవైభవానికి మచ్చుతునకలు మాత్రమే.

మన చక్రవర్తులు నిర్మించిన తాజ్‌మహల్ సుందర కట్టడం దానివెనుక దాగివున్న

షాజహాన్ ముంతాజ్ బేగంల పవిత్ర ప్రేమ గాథను మనం అందరం గౌరవిస్తున్నాము. తంజావూరు మధుర రాజులు నిర్మించిన మహోన్నత కట్టడాలు, కజరా, సాంచీ సభ్యతా సంస్కృతీ వికాసం, శిల్పవైభవాన్ని బట్టి చూస్తే మన ప్రాచీనుల కళావైభవం, వారి కళాపరిజ్ఞానం ద్యోతక మౌతుంది.

భారతదేశంలో ప్రతిచోట వివిధసంస్కృతుల కలయిక మనకు కన్పిస్తున్నది. మహమ్మదీయ రాజులు సమైక్య సాధనకు చేసిన కృషి హిందూమహమ్మదీయులుకలిసి మెలసి భారతదేశఔన్నత్యానికై జేసిన అసమాన సేవకు సంబంధించిన అనేక ఘట్టాలు మనకు చరిత్రలో కనిపిస్తాయి.

ఆర్యుల నాగరికత, ద్రావిడుల సంస్కృతీ సభ్యతలు. తరువాత వచ్చిన మహమ్మదీయులు ఆంగ్లేయులు, వేషభాషలు, ఆచార వ్యవహారాలు మన సంస్కృతిలో కలిసి పోయినవి. ఇరాక్ దేశపు సంగీతం, ఇంకా ఇతర విదేశశిల్పము, చిత్రలేఖనం మనలో అంతర్లీనమై పోయింది. గుప్తరాజ వంశపు జ్ఞాపకాలు మొగల్ రాజుల కాలంలోని చిత్ర కళలు మనకు మనజాతి ఐక్యతను గురించిన పాఠాలు నేర్పుతాయి.

మనదేశం వివిధ కాలాల్లో రాజ్యంచేసిన వివిధరాజుల సత్యసంధత ధర్మనీతికి సంబంధించిన అనేకగాథలు మన చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించివున్నవి. ఈ దేశంలో కాళిదాసు, తులసీదాసు, కబీర్, నానక్ జన్మించారు. అగ్బర్, అశోకుడు, జన్మించిన ఈ భూమిలో చాంద్ బీబీ, ఝూన్సీరాణి, రూపావతి, ముంతాజ్‌మహల్ మొదలైన ఆదర్శప్రాయమైన మహిళారత్నములను గన్నతల్లి ఈ భారతభూమి, ఈ దేశం ఎప్పుడూ ఐక్యతకు చిహ్నంగానే ఉన్నది.

నేడు మనం చరిత్రలో ఒక విపత్కర పరిస్థితిలో ఉన్నాం. ప్రపంచంలో అనేక కొత్త కొత్త ప్రజాస్వామిక ప్రభుత్వాలు వెలుస్తున్నవి. కొన్నిచోట్ల సైనిక పరిపాలనలు ఉద్భవిస్తున్నవి. బలవంతమైన దేశాలు మారణాయుధాల ఉత్పత్తిలో మునిగియున్నవి. మన దేశ గత చరిత్ర, గత వైభవం మహోన్నతమైనది. మన నాగరికతా, సంస్కృతీ ఉన్నతమైనది. మన భవిష్యత్తు చాలా ఉజ్జ్వలమైనది.

నేటి ఈ సంకట పరిస్థితిలో మన జాతి సమైక్యత ఎంతో అవసరం. దేశంలో ఐక్యతా వాతావరణం ఏర్పడింది. కాబట్టి ఈ పరిస్థితిలో పురుషులే కాకుండా దేశ సమైక్యతను కాపాడి యింకా పటిష్ఠం చేయవలసిన బాధ్యత మనమహిళలమీద యెక్కువగా వున్నది. కాబట్టి ప్రస్తుత స్థితిలో సమైక్యతా వాతావరణాన్ని పటిష్ఠం చేయవలసిన బాధ్యతను మహిళలు స్వీకరించాలి.

సరిహద్దుపైనున్న మన శత్రులను ఎదుర్కొనాలంటే దేశంలో ప్రతి పురుషుడూ, స్త్రీ కష్టించిపని చేయాలి. ఉత్పత్తిని అధికం చేయాలి. ప్రభుత్వం తలపెట్టిన ప్రతి రక్షణ కార్యక్రమంలోనూ పాల్గొనాలి. అందుకై ప్రతిఒక్కరూ సిద్ధంకావాలి. అప్పుడే మనజాతి పటిష్ఠం కాగలదు. మనం అభివృద్ధిని సాధించగలము. ★

# చంటి పిల్లల అజీర్ణరోగాలు

—డాక్టర్ వేమిరెడ్డి రాజేశ్వరమ్మ

*తక్కువపాలు యివ్వడంవల్ల వచ్చే జబ్బులు:*

కావాలని ఎవరూ పిల్లలకు తక్కువపాలు యివ్వరు. తల్లిదగ్గరపాలు లేక, పైపాలు పోస్తే ఏమవుతుందో అన్నభయంతో వున్న వాటితోనే సరిపుచ్చుతారు కొందరు. పైపాలు యిచ్చేవాళ్ళు తక్కువగా యివ్వడంవల్ల, లేదా యిచ్చేపాల వ్యవధి ఎక్కువగా వుండడంవల్ల పిల్లలకు పాలు సరిపోకపోవచ్చు. ఒక్కొక్కప్పుడు పాలపీకరంధ్రం సన్నగా వుండి పాలురాక పిల్లలు కొద్దిగా తాగి అలసిపోయి వదలివేస్తుంటారు. మరొక్కొక్కసారి పాలు అరగవని నీళ్ళు ఎక్కువగా కలిపి పట్టుతారు తల్లులు. ఈ రకంగా తక్కువపాలు తాగిన పిల్లలు పాలు తాగిన తర్వాతకూడా ఏడుస్తూనే వుంటారు. ఒక్కొక్కసారి పాలు తాగి, నిద్రపోయిలేచి మళ్ళీ ఏడుపు మొదలుపెడతారు. ఇలాంటి పిల్లలు సాధారణంగా బరువెక్కరు. ఎక్కినా ఎక్కువబరువు ఎక్కరు. ఇలాంటి వారికి మలబద్ధకంకూడా వుంటుంది. దీనికి కారణం తెలుసుకోవాలి అజీర్తి చేయకుండా వుండే డబ్బాపాలకు మారిస్తే మంచిది.

*ఎక్కువ ఆహారంవల్ల వచ్చేజబ్బులు:*

పైదానికన్న దీనివల్ల ఎక్కువ ప్రమాదమేమీ లేదు. మరీ చిక్కనిపాలు పట్టినందువల్ల వస్తుందిది లేదా తాగించ వలసినదానికన్న ఎక్కువ తాగించడంవల్లకూడా వస్తుంది దీనివల్ల బిడ్డ బరువు వుండవలసినదానికన్న ఎక్కువ వుండడం జరుగుతుంటుంది. మొదట్లో యీలాంటి పిల్లలు పాలన్నిటినీ తాగివేస్తారు. కాని కొంతకాలం గడిచేసరికి తాగినవాటి నన్నిటినీ వాంతి చేసేసుకుంటారు. విరేచనాలుకూడా తరచు అవుతూవుంటాయి. వాసనకూడా వస్తుంది. పొట్ట ఉబ్బుతుంది. బరువు పెరుగుతున్న పిల్లలు క్రమంగా బరువు తగ్గడం మొదలెడతారు. దీన్ని అదుపులో పెట్టడం కొంత శ్రమతోకూడిన పనే. మొదట పల్చనిపాలను యివ్వడం ప్రారంభించాలి. ఓపిగ్గా కొంచెం కొంచెం పెంచుకొంటూ సరైన కొలతవచ్చే వరకూ యివ్వాలి.

*మాంసకృత్తుల అజీర్తి:*

మరీచిక్కనిపాలు పట్టడంవల్ల యిది వస్తుంది. దీనివల్ల వాంతులు అవుతుంటాయి. కడుపునొప్పి రావచ్చు. విరేచనం సరిగా కాదు. సరిగా బరువు పెరగదు. దీన్ని నయంచేయాలంటే ముందుగా బిడ్డ కడుపులోని మలినాన్నంతా వాంతులు తగ్గే వరకు ట్యూబువేసి తీసివేయాలి. ఆ తర్వాత ప్రతిఔన్సుపాలకు 1½ గ్రైను సోడియం సిట్రేట్ కలిపి పట్టాలి. లేదా లాక్టిక్ ఏసిడ్ కలపాలి.

*క్రొవ్వు పదార్థాల అజీర్తి:*

ఇది సాధారణంగా పూర్తి కొవ్వువున్న (Full cream dried milk) డబ్బాపాల వల్ల వస్తుంది అందుకే మొదటి మూడునెలలు సగం కొవ్వు డబ్బాపాలు (Half cream dried milk) యివ్వమని చెప్తుంటారు. సాధారణంగా యిది బర్రెపాలు, ఆవుపాల వలన అంతగా రాదు. ఈ జబ్బుగల పిల్లలు ఎక్కువసార్లు విరేచనానికి వెళ్తారు. అపాన ప్రదేశం ఎర్రగా అవుతుంది. కొన్నిరోజులకు విరేచనం వాసనకొట్టడం ప్రారంభిస్తుంది. విరేచనానికి వెళ్లేటప్పుడు పిల్లలు ఏడవడం మొదలెట్తారు. క్రమంగా వారి బరువు తగ్గిపోతుంటుంది. దీన్ని పోగొట్టాలంటే పాలల్లో క్రొవ్వు పదార్థాలను తగ్గించాలి. పూర్తి కొవ్వుడబ్బాపాలనుండి సగం కొవ్వుడబ్బాపాలకు మార్చాలి. ఒక్కొక్కప్పుడు అసలు కొవ్వులేని పాలకుకూడా మార్చాల్సి వస్తుంది. విటమిన్ 'డి'ని చుక్కలుగా గాని, చెంచాతోగాని యివ్వాలి. మజ్జిగ కూడా యివ్వవచ్చు. అపాన ప్రదేశంలో ఎర్రబడిన జాగాలో అముదం పూయాలి.

*పిండిపదార్థాల అజీర్తి:*

ఇది పైవాటంత ఎక్కువగా రాదు. ఎక్కువ తీపుపాలు త్రాగించినందువల్ల యిది వస్తుంది. దీనివల్ల పిల్లల పొట్ట ఎత్తుగా ఉబ్బుతుంది. కడుపునొప్పి కూడా రావచ్చు. విరేచనం పల్చగా ఆకుపచ్చగా అవుతుంది నురుగు నురుగుగా వుంటుంది అపాన ప్రదేశంలోని చుట్టూ వున్న చర్మం కురుపులాగా అవుతుంది బరువెక్కిన పిల్లలు క్రమంగా తగ్గిపోవడం మొదలెడ

తారు దీనికి విరుగుడుగా తీపిని తగ్గించి చక్కెరబదులు డెక్స్ట్రిమాల్టోస్ కలపాలి.

వాంతులు :

జీర్ణకోశానికి సంబంధమైన జబ్బులవల్ల వాంతులు వస్తుంటాయి. న్యుమోనియా, చెవి జబ్బులవల్ల పళ్లు వచ్చేముందు తలలో ఏమైనా జబ్బు వుంటేను వాంతులు కావడం కద్దు. జీర్ణ కోశానికి సంబంధించిన వైతే వాంతులతోపాటు విరోచనాలుకూడా అవుతాయి. మలబద్ధకంగావుండి వాంతులు అవుతూవుంటే జీర్ణకోశంలో ఏదో ఆటంకం వున్నదనుకోవాలి. వెంటనే డాక్టరుసలహా తీసుకోవాలి. వాంతులులాగే వుండి నిజానికి వాంతులకు సంబంధించిన జబ్బులు కానివి రెండురకాలు వున్నాయి. కొంతమంది పిల్లలు పాలు తాగుతూ దానితోపాటు గాలిని కూడా లోపలికి పీల్చేస్తుంటారు. లోపలికిపోయిన గాలి బయటికి పంపిస్తూ త్రేన్చినపుడు గాలితోపాటు పాలుకూడా బైటకు వస్తుంటాయి. ఇలా ఎక్కువగాలి పోవడానికిగల ఒకకారణం పాలపీక రంధ్రం చిన్నదిగా వుండడం. బాగా ఏడ్చిఏడ్చి అలసిపోయిన తర్వాత పాలుపట్టడం మరొక కారణం; చాలాసేపు ఏడవడంవల్లకూడా గాలి లోపలకు వెళ్తుంది. సాధారణంగా పిల్లలకు చీకుకోడానికి రబ్బరు నిప్పల్‌ని యిస్తుంటారు. దీనివల్లకూడా గాలి లోపలికి పోతుంటుంది. వీటి విషయంలో లోపాలులేకుండా చూసి వాడితే ఏమీ ఫరవాలేదు. వాంతు లుండవు. పిల్లల్ని కూర్చోబెట్టి పాలు తాగించడంవల్ల గాలి లోపలికి పోదు దీనివల్ల లాభం లేకపోతే పాలల్లో ఏదైనా పొరక్స్‌లాంటిదాన్ని కలిపి కొంచెం చిక్కగా చేసి పట్టించాలి. కార్మినేటివ్ మిక్చర్ ఇందుకు బాగా పనిచేస్తుంది.

రెండోది, ఒక్కొక్కసారి పిల్లలు కడుపులో వున్న పాలను నోటిలోకి తెచ్చి దాన్నిమళ్ళీ లోపలకు మింగుతుంటారు. ముఖ్యంగాయిది నాలుగునెలల తర్వాత వస్తూ వుంటుంది. సీసాపాలు తాగేవాళ్ళల్లోనే యిది జరుగుతుంది. ఈ పిల్లలకు ఆకలి బాగా వుంటుంది. పాలు బాగా తీసుకొంటారు. తీసుకొన్న 10–15నిముషాలకు, కడుపులోవున్న పాలు నోట్లోకి వచ్చేవరకూ మెలికలు మెలికలు తిరిగిపోతారు. ఇదివారి కెంతో సంతోషాన్ని కలిగిస్తుంది. అలా చేసేటప్పుడు సాధారణంగా కొన్నిపాలు నోట్లోంచి ఒలికిపోతాయి. అందువల్ల యీలాంటి పిల్లలు బరువు తగ్గి పోతుంటారు. బరువు తగ్గుతున్నా సంతోషంతోనే వుంటారు. దీనికి కారణమేమిటో తెలియదు. ఈ పిల్లలకు యిచ్చే పాలల్లో ఏదన్నా కలిపి చిక్కబరచి యిస్తే యీ అలవాటు తగ్గిపోతుంది. 1 గ్రైన్ క్లోరాల్ యిస్తే పిల్లలు నిద్రపోయి యీ అలవాటును మానివేస్తారు. లేదా పాలిచ్చిన కొంచెం సేపటివరకు బిడ్డ నోటిని తెరవకుండా గుడ్డతో గట్టిగా కట్టివేసి కూడా యీ అలవాటును తప్పించవచ్చును. కాని యిది ఏమంత మంచిపని కాదు. ఎందుకంటే పాలను తిరిగి నోటిలోకి తీసుకున్న తర్వాత నోరు తెరవటానికి వీలులేకపోతే, ఆపాలు ఊపిరి తిత్తులలోకి పోయే ప్రమాదంవుంది. అందువల్ల యీ అలవాటును మాన్పించడానికి మొదటిపద్ధతే మంచిది. ★

# మంచి నడవడి

—వాసిరాజు ప్రకాశం

నేటి పౌరులేకావచ్చు, మరీ వయసొచ్చిన పెద్దలేకావచ్చు. కాని వీరంతాడాకూ ఒకనాటి బాలలే. పలకా, పుస్తకాలుసంచిలోపెట్టుకొని, సంచితగిలించుకొని స్కూలుకు వెళ్ళినవారే — వీరంతా చిన్నతనంలో వీరికి ఇచ్చేశిక్షణ, వీరికినేర్పే విద్యాబుద్ధులను బట్టి, నేటి నడవడి కూడా రూపొందుతుంది. చిన్నతనంనుంచీ, స్కూల్లో టీచరు, ఇంట్లో అమ్మ, నాన్న చెప్పినట్లు విని శ్రద్ధగా చదువుకొన్నవారు పెద్దయిన తరుతకూడా అదే క్రమశిక్షణను విడువకుండా, న్యాయాన్ని — అన్యాయాన్ని గ్రహించి మెలగుతూవుంటారు. అంటే యీనాడు పెద్దవారి నడవడి, వారు చిన్నతనంలో పొందిన శిక్షణమీదనే ఆధారపడి వున్నది.

ప్రతిరోజూ మనం చూస్తూనేవుంటాం— కల్లూ, సారాయిత్రాగి రోడ్డుమీద అల్లరి చేసేవాళ్ళని. నోటికొచ్చినట్లల్లామాట్లాడుతూ వుంటారు...రైల్వే స్టేషన్లలోను, బస్సు స్టాపులవద్దనూ జేబులుకొట్టేవాళ్ళు, దొంగతనాలు చేసేవాళ్ళుకూడా మనకు అక్కడక్కడ కనుపిస్తూనే వుంటారు. అంటే, దీన్నిబట్టి మనం ఒకవిషయం చెప్పుకోవచ్చు. చిన్నతనంలో వీరికి సక్రమమైన శిక్షణను ఎవరూ ఇవ్వలేదనో, లేక అలాంటి అవకాశాన్ని వీరు వినియోగించుకొనలేక పోయారనో సుస్పష్టమవుతుంది

వీరుకాక మరొకవర్గం వున్నది. సమాజంలో ఎలా మెలగవలసిందీ, తోటివాణ్ణి ఎలా గౌరవించవలసిందీ తెలిసినవారు. సభ్యతా, సంస్కారమూ, మర్యాదా— వీరికి. బాగా తెలిసివుంటాయి. వాళ్ళ హక్కులేమిటో, ఆ హక్కులను ఎలా వినియోగించుకోవాలో — అన్నసంగతి వీరికి ఎవరూ చెప్పనక్కరలేదు. బాధ్యతలూ అంటే— సక్రమంగా నిర్వర్తించగలిగినవారు. అంటే, చిన్నతనంనుంచి యీ వర్గంవారు కట్టుబాట్లలో పెరిగినవారన్నమాట.

ఏ దేశంలోనయితే దుండగులు, తెలివితక్కువవారు ఎక్కుమంది వుంటారో, ఆదేశం ముందుకుపోలేదు. వీరంతా అభివృద్ధి కార్యక్రమాలను నిరోధిస్తూ వుంటారు. అలాకాక, ఏదేశంలోనయితే నిజమైన పౌరులు, నాగరికులు వుంటారో — ఆదేశం చాలా త్వరగా ముందుకువెళుతుంది. వీరంతా దేశానికి ప్రతిక్షణమూ ఎంతో సాయంచేస్తూ వుంటారు.

ఈ నగ్నసత్యాన్నే ప్రభుత్వస్థాయిలో అందరూ గుర్తించడం జరిగింది. తత్ఫలితంగానే, దేశమంతటా బాల బాలికలకు సంబంధించిన కార్యక్రమాలు కొన్ని అదనంగా ప్రారంభింపబడ్డాయి.

బాలవిహారాలు :

అలాంటి కార్యక్రమాలలో ముఖ్యమైనది బాలవిహారాల పథకం. బాలవిహారాలు అన్న పేరుతో యీనాడు రాష్ట్రంలో 21 శాఖలు బాలల బహుముఖ అభివృద్ధికోసం పని చేస్తున్నాయి.

పాఠశాలల్లో నేర్పేవిధం, మొత్తంమీద పలక, పుస్తకాలకు సంబంధించినదే అయి వుంటుంది. అక్షరాలు దిద్దబెట్టటం, పాఠాలు చెప్పటం, చూచివ్రాతలు వ్రాయించటం — పాఠశాలల్లోని కొన్ని ముఖ్యమైన కార్యక్రమాలు. వాటివల్ల విద్య తప్పకుండా వస్తుంది. కాని సభ్యతా సంస్కారమూ కూడా బాలల్లో అభివృద్ధి చేయటమే యీ బాలవిహారాల లక్ష్యం. సాంస్కృతికమూ, వినోదాత్మకమూ అయిన కార్యక్రమాలను ఇక్కడ నిర్వహిస్తుంటారు — అంటే — ఇక్కడ నేర్పేఅంశాలు బాలలకు ఆనందాన్ని కలిగిస్తూ, ఆదనంగా కొంత లోకజ్ఞానాన్ని కూడా కలిగిస్తాయి.

ఇలాంటి అవకాశాలు ఇళ్ళవద్ద వుండవా? — అని మీలో ఎవరైనా ప్రశ్నించవచ్చును. తప్పకుండా కలుగవచ్చును. కాని, మనలాంటి పేదదేశంలో ప్రతి ఇంట్లోనూ బాలలకోసం వినోదాన్ని కలిగించే ఏర్పాట్లు చేయటం ఎలా సాధ్యమవుతుంది? ధన



వంతుల ఇళ్ళల్లో అయితే ఫరవాలేదు. మరి, పేదవారి సంగతేమిటి?

## ఆటలు - పాటలు

ఈ బాలవిహారాల్లో ఎన్నోరకాల కార్యక్రమాలున్నాయి: ఉదయంవేళల్లో మామూలు తరగతులను నిర్వహిస్తారు. సాయంత్రం, కులాసాగా ఆటలు ఆడిస్తారు. ఇవిగాక అవకాశం దొరికినప్పుడల్లా పాటలు నేర్పుతూ వుంటారు. చిన్న పిల్లలచేత నాటకాలు వేయించటం — వారిలో ఇలాంటి సరదాలను పెంపొందింప చేయటం కూడా జరుగుతూ వుంటుంది. చిన్న చిన్న కథలను కూడా చెపుతుంటారు.

ప్రతి 'బాలవిహారం' లోను బాలలను కొన్ని తరగతులుగా విభాగిస్తారు. వీటినే 'సోషల్ సర్వీస్ స్క్వాడ్స్' అని అంటూ వుంటారు. ఇలా విభజించి, పౌరశిక్షణను ఇస్తారు. పౌరశిక్షణ అంటే అందరికీ తెలిసే వుంటుంది — ఉత్తమ పౌరుని లక్షణాలు ఏమిటో పౌరుల హక్కులు, బాధ్యతలు ఏమిటో ఇక్కడ చెబుతారు.

ఈ బాలవిహారాల్లోనే 'సాంఘిక సేవ' కార్యక్రమాలకు కూడా చాలా ఎక్కువ ప్రాముఖ్యతను ఇవ్వటం జరిగింది. విరామ సమయాల్లో బాలలందరినీ ఇతర ప్రదేశాలకు తీసుకెళ్ళటం, ప్రజాసేవ అంటే ఏమిటో ప్రయోగాత్మకంగా — చేసిచూపటం కూడా ఇక్కడ జరుగుతుంది. దీనివల్ల బాలలు చిన్నతనంనుంచే, సోదరమానవ ప్రేమను అలవరచుకొని, పెద్దవారయాక కూడా తోటి వారిపట్ల దయా, అభిమానాలను కలిగి వుంటారు.

## ప్రతిచోటా 50 మంది పిల్లలు

1961—63 — అంటే రెండు సంవత్సరాల కాలంలో రాష్ట్రమంతటా 21 బాల విహారాలను ప్రారంభించటం జరిగింది. ఒక్కో బాల విహారంలో 50 మంది వంతున పిల్లలు వుంటారు.

ఈ 21 ప్రస్తుతంవున్న ప్రాంతాలు ఇవి: (1) ప్రొద్దుటూరు, (2) గుంటూరు, (3) నందికొట్కూరు, (4) వెంకటగిరి, (5) అనంతపురం, (6) బొబ్బిలి (7) ఏలూరు, (8) కాకినాడ, (9) విజయనగరం, (10) చిత్తూరు, (11, 12) హైదరాబాదు, (13, 14) వరంగల్లు, (15) సిద్దిపేట, (16) ఖమ్మం, (17) ఆదిలాబాద్, (18) నల్లగొండ, (19) కరీంనగర్, (20) నిజామాబాదు, (21) ఈజ్ (మహబూబ్‌నగర్ జిల్లా).

## బాల నివాసాలు

నెలలు నిండని పసిపాపలు మొదలు ఆరు సంవత్సరాలునిండిన బాలబాలికలవరకు యీ 'బాల నివాసాలలో' వుండవచ్చును. ఇళ్ళల్లో తల్లులు వుద్యోగపు పనులమీద, ఇల్లువిడిచి వెడుతుంటారు కనుక — ఆ ఇళ్ళలో వుండే పసిపాపలను సంరక్షించేందుకు యీ బాల నివాసాలను ప్రభుత్వం ప్రారంభించింది.

ఈ బాల నివాసాలను రెండు తరగతులుగా విభజించారు. మూడు సంవత్సరాల వయసు కలిగినవారు, అంతకులోపు వారూ ఒక తరగతిలోను, ఆరు సంవత్సరాలు - మూడు సంవత్సరాలు మధ్య వయసు కలిగినవారు రెండవ తరగతిలోను వుంటారు. ఎక్కువ వయస్సు కలిగినవారికి చదువుకూడా నేర్పుతారు. బాల నివాసాలలో పిల్లలు పగలంతా వుంటారు గనుక, భోజనంకూడా అక్కడే పెట్టిస్తారు. ప్రతి సంస్థలోను ఒక ఆర్గనైజరు, ఇద్దరు 'ఆయాలు' పనిచేస్తూ వుంటారు. మొత్తంమీద, ఆర్గనైజరేసంస్థకు ఆధిపత్యం వహించాలి. ప్రతిరోజూ వుదయమే, ఇళ్ళకు వెళ్ళి పిల్లలందరినీ కూడగట్టుకొని, తీసుకొనివచ్చి, బాల నివాసాలలో సాయంత్రం వరకూ, అంటే తల్లులంతా తిరిగివచ్చే వరకు, వుంచే భారం నిర్వహించటం సామాన్యంకాదు. ప్రతి సంస్థలోనూ 25 మంది పసిపాపలు, మరో 25 మంది బాలలు వుంటారు.

ఇవే సంస్థలు మరికొన్ని కార్యక్రమాలను నిర్వహిస్తుంటాయి. సాయంత్రం కాగానే, యీ పిల్లలందరినీ తల్లులకు అప్పగించిన తరువాత అదే వూళ్ళోవుండే మరికొందరు ఇతర పిల్లలను రప్పించి వినోద కార్యక్రమాలను నిర్వహిస్తూ ఉంటారు. సాయంత్రంవేళ వినోద కార్యక్రమాల్లో పాల్గొనేపిల్లలు, పగటివేళ బాల నివాసాల్లో వుండరు. వీరంతా స్థానికంగా వుండే పాఠశాలల్లో చదువుకొంటూ, సాయంత్రం సమయాన సరదాగా యీ వినోద కార్యక్రమాల్లో పాల్గొంటూ వుంటారు.

పిల్లలందరిచేత పాటలు పాడించటం, సరదాగా చిన్న చిన్న నాటికలు వేయించటం యీ వినోద కార్యక్రమాల్లోని కొన్ని అంశాలు. ఈ సంస్థను నిర్వహించే ఆర్గనైజర్లు, పిల్లలందరికీ, వాళ్ళకు కావలసిన కథలు చెపుతూ వుంటారు.

ఇలాంటి బాలనివాసాలు ప్రస్తుతం మన రాష్ట్రంలో ఆరు ప్రదేశాలలో వున్నాయి. అవి :- (1) దవుసూరు (విశాఖజిల్లా), (2) ఉట్నూరు (ఆదిలాబాదు జిల్లా), (3) హైదరాబాదు, (4) సికింద్రాబాదు (5) దేవరకొండ (మహబూబ్‌నగర్ జిల్లా), (6) పాలకొల్లు (కర్నూలు జిల్లా). పైన చెప్పినట్లు ప్రతిచోటా 50 మంది పిల్లలుంటారు.

మీ గ్రామంలో 'బాలవిహారం' వుంటే, మీరు పేదవారయినట్లయితే అందులో ప్రవేశంకోసంప్రయత్నించేయండి. అయినా, అందరికీ ప్రవేశం దొరక్క పోవచ్చును. అంతమాత్రాన నిరుత్సాహపడకుండా, ఒక రోజున తీరికచేసికొని, ఒక బాలవిహారానికి వెళ్ళి, అక్కడ పిల్లలు ఎలా క్రమశిక్షణ పొందుతున్నారో, ఏవేం కార్యక్రమాలు అక్కడ అమలులో వున్నాయో చూడండి. అదే కార్యక్రమం ప్రకారం, ఇంటివద్దనే వాటిని మీరుకూడా అలవరచుకోండి.

ఇక, మీ చిన్ని చిన్ని తమ్ముళ్ళు, చెల్లాయిలు ఇంట్లో వుంటారు. పైనచెప్పిన బాల నివాసాలు ఎలా పనిచేస్తాయోచూసి, మీ ఇంటి పాపాయిలకు కూడా అవే పద్ధతులను నేర్పండి.

బాల విహారాల్లోను, బాల నివాసాల్లోను శిక్షణపొందిన బాలలు ముమ్ముందు ఉత్తములుగా పెద్దవారవుతారు. చిన్నతనంలో, తాముపొందిన క్రమశిక్షణనే తిరిగి మళ్ళీ మళ్ళీ గుర్తుచేసుకొంటూ చక్కని నడవడిని అలవరచుకొంటారు. తమ దేశానికి ఎంతో సేవచేస్తారు



బాలానందం
బెంగాలీ కథ

— వేటూరి ఆనందమూర్తి

# బుర్రీ - బుర్రడు

ఒక ఊళ్ళో బుర్రీ - బుర్రడు అని ఇద్దరుండేవాళ్ళు బుర్రడు రోజూ కట్టెలు కొట్టుకొస్తే బుర్రి వాటిని అమ్ముతూ జీవిస్తూవుండేవాళ్లు. ఒక రోజున బుర్రడు అడవిలో కట్టెలు కొట్టుకొంటుంటే ఒక పెద్దపులి వచ్చి మీదపడింది. 'అమ్మయ్యో !' బుర్రడు అదిరిపోయాడు. 'రక్షించు పెద్దపులీ!



నన్ను చంపకుండా యింటికి పోనిస్తే నా పెళ్ళాంతో చెప్పి నీకు తియ్యని పేటాలు వండించి పెడతానుగా' అని ఆశ పెట్టాడు బుర్రడు. పులి ఒప్పుకుంది. మరి పేటాలు వండాలంటే సామాన్లు కావద్దూ ? 'ఏమేం కావాలి ?' అని అడిగింది పులి. పాలూ, బెల్లం, కొబ్బరికాయలూ, దినుసులూ, ఒక పెద్దకుండ - ఇంకా ఎన్నో ఎన్నో కావాలని చెప్పాడు బుర్రడు. సరే నని పులి బుర్రడిని సంతకు తీసికెళ్ళింది. సంతలో పులినిచూసి వర్తకులందరూ సామానులువదిలి పెట్టి పారిపోయారు. బుర్రడు కావలసినవన్నీ తీసుకొని - 'సాయంత్రం ఇంటికి రా పులీ - అన్నీ వండి సిద్ధంగావుంచుతాము' అన్నాడు.

'అయితే మరి మీ యిల్లు నా కెలా తెలుస్తుంది? పేటాలు వండగానే కబురుచేస్తావుగా !' అంది పులి. అప్పుడు బుర్రడు 'దాని కేముంది. అదుగో మా యింటిమీద పొగలు ఎప్పుడువస్తాయో అప్పుడు రా. అన్నీ సిద్ధంగా వుంటాయి' అన్నాడు. పులి సరేనంది.

ఇంట్లో బుర్రీ బుర్రడు పేటాలన్నీ వండుకుతినేశారు. పులికో ? మోసం చెయ్యాలని కచ్చికలతో నాలుగు



పేటాలుచేసి పెట్టి, పొయ్యిలో ఇన్ని నీళ్లుపోసి వెళ్ళి ఇద్దరూ ఒక పెద్దగాదెలో దాక్కొన్నారు. ఇంటిమీద పొగలు వచ్చాయి. పులి వచ్చింది. ఇంట్లో ఎవ్వరూలేరు. ఎంతో ఆశతో పేటాలు తినబోయింది పులి. ఛీ ! అన్నీ పాడు కచ్చికలే. పులికి ఒళ్లు మండిపోయింది. ఇంతలో గాదెలో దాక్కున్న బుర్రికి ఒక తుమ్ము వచ్చింది. ఆపుకోలేక తుమ్మేసింది. ఇంకేముంది. సంగతి బయటపడిపోయింది. మోసం చేసి నందుకు పులి బుర్రడిని చంపి తింది. పాపం బుర్రికిమాత్రం శాపంవచ్చింది.



వడ్రంగిపిట్టని చూశారూ ? అదే ఆ బుర్రి పాపం. అలా వడ్రంగిపిట్ట అయిపోయి 'చెక్కూ' 'చెక్కూ' అని ఇప్పటికీ చెట్లని పొడుస్తూ అరుస్తూ వుంటుంది.

---

## ఉండాలి

పండు కావాలంటె
చెట్టు ఉండాలి.
చెట్టు కావాలంటె
మొక్క నాటాలి.
మొక్క నాటాలంటె
నీళ్ళు పోయాలి.
నీళ్ళు పోయాలంటె
కడవ కావాలి.
కడవ కావాలంటె
కుమ్మరుండాలి.
కుమ్మరుండాలంటె
మట్టి వుండాలి.
మట్టి కావాలంటె
మనిషి తేవాలి.
మట్టకోసం మాత్ర
దేశ ముండాలి

—"బాలార్క"

రాష్ట్రంలో

డిశంబరు 21 : అఖిలభారత మద్యనిషేధ ప్రచార కార్యకర్తల ద్వితీయ సమ్మేళనాన్ని ముఖ్యమంత్రి హైదరాబాదులో ప్రారంభించారు.

రాష్ట్ర విద్యావిషయాల మహాసభకు ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామంత్రి తాడేపల్లి గూడెంలో ప్రారంభోత్సవం చేశారు.

డిశంబరు 22 : హైద్రాబాదుకు ఏడుమైళ్ళ దూరంలోవున్న నాదిర్‌గల్ వద్ద ముఖ్యమంత్రి గ్లైడర్ దోమ్‌కుప్రారంభోత్సవం చేశారు.

డిశంబరు 23: కేంద్రప్రభుత్వ పెట్రోలియం, కెమికల్స్ శాఖామంత్రి ఆంధ్ర ప్రదేశ్ సైన్స్ ఎకాడమీని ప్రారంభించారు.

వాస్తుశాస్త్రం, లలిత కళల ప్రభుత్వ కళాశాల నూతన భవనానికికూడా ఆయన శంకుస్థాపన చేశారు.

డిశంబరు 27 ; ఆఫ్ఘనిస్తాన్ ప్రతినిధి వర్గం రెండురోజులపర్యటనపై హైదరాబాదుకు విచ్చేసింది.

డిశంబరు 28 :వకేషనల్ గైడెన్స్ ఆఫీసర్ల గోష్ఠిని రాష్ట్ర రవాణా, కార్మికశాఖల మంత్రి హైద్రాబాదులో ప్రారంభించారు. భారతప్రభుత్వం అధ్వర్యంలో 12రోజుల పాటు జరిగిన ఈ గోష్ఠిలో ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, మద్రాసు, కేరళ, మైసూరు రాష్ట్రాలకు చెందిన అధికార్లు పాల్గొన్నారు.

డిశంబరు 31 : యూనియన్ ఉక్కు, భారీ పరిశ్రమల శాఖామంత్రి తిరుపతి విశ్వవిద్యాలయావరణలో శ్రీ వేంకటేశ్వర సంగీత, నృత్య కళాశాల భవనానికి పునాదిరాయి వేశారు.

బాదులో 24 వ అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనాన్ని ప్రారంభించారు.

జనవరి 5 : ఆంధ్ర ప్రదేశ్‌లో వ్యవసాయ విశ్వ విద్యాలయాన్ని స్థాపించడానికి ఉద్దేశించిన చట్టాన్ని రాష్ట్ర గవర్నరు ఆమోదించారు.

జనవరి 9 : శాసనసభ్యుల వెలజీతాన్ని రు.150ల నుంచి రు.250 లకు హెచ్చిస్తూ 1954 వ సం. పు ఆంధ్రప్రదేశ్ జీతాల చెల్లింపు, అనర్హతల తొలగింపుచట్టాన్ని తిరిగి సవరించడానికి ఉద్దేశించిన చట్టాన్ని రాష్ట్రగవర్నరు ఆమోదించారు.

జనవరి 10 : హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషను 1964_65 వ సం. పు బడ్జెటు అంచనాలను స్థాయీ సంఘం అధ్యక్షుడు సమర్పించారు.

'యునిసెఫ్' కార్యవర్గ మండలి సభ్యులు రెండురోజుల పర్యటనపై హైదరాబాదుకు వచ్చారు.

జనవరి 12 : విశాఖపట్టణంలో నిర్మించిన తంతి, తపాలాశాఖల నూత్న భవనాన్ని రాష్ట్ర ఆర్థికమంత్రి ప్రారంభించారు.

జనవరి 13 : ఇంటెగ్రేటెడ్ సెల్యూలస్ ఎక్స్‌పెడ్ ప్రాజెక్టుకు శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి విశాఖపట్నంలో శంకుస్థాపన చేశారు.

జనవరి 15 : రాజమండ్రికి 20 మైళ్ళ దూరంలోవున్న పురుషోత్తమపట్నంలో పథకాన్ని ప్రారంభించారు. దీనికి రూ 41 లక్షలు ఖర్చయింది.

భారత దేశంలో

డిశంబరు 21 : భారతదేశంలోని 8 ప్రధాన నగరాల పునఃవర్గీకరణకు సంబంధించి యూనియన్ ఆర్థికమంత్రి ఒక ప్రకటన చేశారు. హైదరాబాదును బి.1 నగరంగా ప్రకటించారు.

డిశంబరు 26 : బొంబాయిలో నిర్మించిన జీవితభీమా కార్పొరేషను కేంద్ర కార్యాలయ భవనం "యోగ క్షేమం"ను ప్రధాన మంత్రి ప్రారంభించారు.

డిశంబరు 28 : యూనియన్ హోం మంత్రి న్యూఢిల్లీలో రాష్ట్రాల ముఖ్యమంత్రులు, హోంశాఖామంత్రుల సమావేశాన్ని ఏర్పాటుచేశారు.



జనవరి 1 : అఖిలభారత మహిళా మహాసభ 32 వ వార్షిక సమావేశం న్యూఢిల్లీలో ఆరంభమైంది.

జనవరి 4 : ప్రాచ్య భాషావేత్తల అంతర్జాతీయ కాంగ్రెసు 26 వ సమావేశాన్ని రాష్ట్రపతి న్యూ ఢిల్లీలో ప్రారంభించారు.

జనవరి 5 : కాశ్మీర్‌లోని హజరత్ బాల్ మసీదునుంచి కన్పించకుండా పోయిన మహమ్మదు ప్రవక్త పవిత్ర కేశం 9 రోజుల పిమ్మట యదాస్థితిలో లభించింది.

జనవరి 7 : ప్రధాన మంత్రికి అస్వస్థత చేయడంవల్ల విశ్రాంతికై వైద్యులు సలహా ఇచ్చారు.

జనవరి 9 : భారత జాతీయ కాంగ్రెసు 68 వ మహాసభ భువనేశ్వర్‌లో గోపబంధు నగర్‌లో సమావేశమైంది.

జనవరి 14 : ఆంధ్రప్రదేశ్ పోలీసు జట్టు, 8వ సారిగా రోవర్స్‌కప్ ఫుట్‌బాల్ టోర్నమెంటులో విజయం సాధించింది.

జనవరి 19 : 1963 వ సం. పు ఆంధ్ర ప్రదేశ్ గ్రామ పంచాయతీల బిల్లును రాష్ట్రపతి ఆమోదించారు.

జనవరి 20 : మైసూరు హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ నిట్టూర్ శ్రీనివాసరావును కేంద్రం అప్రమత్తతా సంఘం అధ్యక్షునిగా నియమించారు.

## విదేశాలలో

డిశంబరు 23 : గ్రీకు ఓడ "లకోనియాకు" మడీరానుంచి 180 మైళ్ళ దూరంలో అట్లాంటిక్ సముద్రంలో నిప్పంటుకుంది.

డిశంబరు 25 : కీన్యా ప్రభుత్వం. కీన్యా ఈశాన్య భాగంలో అత్యవసర పరిస్థితి ప్రకటించింది.

జనవరి 1 : సింహళంలో ఇంగ్లీషు స్థానే సింహళభాషను అధికార భాషగా ప్రవేశ పెట్టారు.

భద్రతా మండలిలో ఐవరీకోస్ట్, బొలీవియా, చకోస్లవేకియాలు కొత్తగా సభ్యత్వం పొందాయి.

జనవరి 10 : అమెరికా సాయుధదళాలకూ, పనామా బృందాలకూ మధ్య సంఘర్షణలు జరిగిన పిమ్మట పనామా, అమెరికాతో గల సంబంధాలను రద్దు చేసుకున్నది.

జనవరి 11 : అమెరికానుంచి పది లక్షల టన్నుల గోధుమను కొనే విషయంలో రష్యా ఒక ఒప్పందం కుదుర్చుకుంది.

జనవరి 13 : జాంజిబార్ నూతన రిపబ్లిక్ ప్రభుత్వం దేశంలో అత్యవసర పరిస్థితిని ప్రకటించింది.

13 అరబ్ దేశాల శిఖరాగ్ర సమావేశం కైరోలో ప్రారంభమైంది.

జనవరి 17 : ఐక్యరాజ్యసమితి ప్రత్యేకనిధి నిర్వాహక మండలి భారతదేశానికి 4,065,300 డాలర్లు మంజూరు చేసింది.

నూతన జాంజిబార్ ప్రభుత్వం అమెరికాతో గల సంబంధాలను తెగతెంపు చేసుకున్నది.

జనవరి 19 : తైవాన్ (ఫార్మోసా)లో పెద్ద పెట్టున భూమి కంపించడం వల్ల దాదాపు 87 మంది మరణించారు. ★

(10 వ పేజీ తరువాయి)

ఈ భూములను పొందినవారు 3 సంవత్సరాలలోగా వాటిని అభివృద్ధి పరచవలసి వుంటుంది. ప్రారంభంలో భూమిశిస్తు విధింపు విషయంలో అంచలవారీ రాయితీని ప్రభుత్వం అనుమతించింది.

వ్యవసాయకూలీల పరిస్థితిని చక్కబరచడానికి, వ్యవసాయోత్పత్తిని పెంపొందించడానికి వీలుగా సేద్యయోగ్యమైన బీడుభూలపంపిణీ త్వరగా జరిగే నిమిత్తం ప్రభుత్వం 1960 మే లో ఉద్యమ స్థాయిలో ఒక ప్రత్యేక కార్యక్రమం ప్రారంభించింది. దాదాపు 2 సంవత్సరాలపాటు ఇది కొనసాగింది. దీనికై అదనంగా ప్రత్యేక సిబ్బందిని నియమించారు. ఇందుకు మొత్తం రు. 45 లక్షలకు పైగా ఖర్చయింది. ఈ ప్రత్యేక కార్యక్రమం కొనసాగిన కాలంలో 1963 మార్చి నెలాఖరు వరకు 9,78,379 ఎకరాల బంజరు భూములను పంపిణీ చేయడం జరిగింది. బీదవారికి పంచడానికి యింకా 7,65,410 ఎకరాలభూమి వున్నట్లు అంచనా.

దేశంలో అత్యవసర పరిస్థితి ప్రకటించబడినసందర్భంగా, సైన్యంనుండివిడుదలై వచ్చిన వారికి ప్రత్యేకించడానికై ప్రభుత్వం బంజరుభూముల పంపిణీ కార్యక్రమాన్ని ఆపివేస్తూ 1962 నవంబరులో ప్రభుత్వం ఉత్తర్వు జారీచేసింది. అయినప్పటికీ భూములులేని బీదవారి పరిస్థితినీ, వ్యవసాయోత్పత్తిని అధికం చేయవలసిన ఆవశ్యకతనూ దృష్టిలో వుంచుకొని యీ ప్రయోజనాలకు భంగం కలుగనివిధంగా నిరుపేదలైన వ్యవసాయ కూలీలు బంజరు భూములను 'ఏక్-సాల్' (ఒకసంవత్సరం) పద్ధతిమీద దున్నుకోవడానికి, ఆ భూములను పంచునప్పుడు వాటిపై వారికి వుండే హక్కును గురించి అత్యవసర పరిస్థితి అనంతరం పరిశీలించడానికి అవకాశం కల్పించ బడింది.

## బంజరుభూముల వినియోగం

దేశంలో ఆహారోత్పత్తిని అధికంచేయడానికి, పల్లెప్రాంతాలలోని నిరుద్యోగులకు జీవనోపాధి కల్పించడానికి 250 ఎకరాలు అంతకు ఎక్కువ విస్తీర్ణంగల ప్రాంతాలలో బంజరు భూములను సాగుకు తెచ్చే ఒక పథకాన్ని 1963 మే నెలలో ప్రభుత్వం అనుమతించింది. ఈ పథకం క్రింద సుమారు 22,000 ఎకరాల బంబరు భూమి సేద్యయోగ్యం చేయవలసి వుంటుంది. సహకార వ్యవసాయ పద్ధతిలో 5,200 కుటుంబాలకు దీనివల్ల పునరావాస సౌకర్యం లభిస్తుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆమోదించిన విధానం ప్రకారం యీ పథకానికి ఉదారంగా ఆర్థిక సహాయం అందజేయ బడుతుంది. ప్రభుత్వ బంజరు భూములన్నిటికీ సంబంధించి 1962 నవంబరు నెలలో జారీచేసిన ఉత్తరువు యీ పథకానికి వర్తించదు.

పూర్తిఅయిన నీటి పారుదల ప్రాజెక్టుల క్రింద ఆయకట్టుల అభివృద్ధి మందగిస్తుందనేకారణంతో బంజరు భూముల పంపిణీ నిలుపుచేసిన ఉత్తరువును విమర్శిస్తున్నారు. గత అసెంబ్లీ సమావేశంలో కూడా జవానులకు భూములను ప్రత్యేకించీ మిగిలిన బంజర్లను పంపిణీ చేయాలని సూచించడం జరిగింది. ప్రభుత్వ బంజరు భూములపై ప్రస్తుతంవున్న అంక్షలను సడలించడం అవసరమా? అవసరం అయితే ఎంతమేరకు యీ నిషేధం సడలించాలి అనే విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తుంది.

ఇంతవరకు రాష్ట్ర ప్రభుత్వం 4,47,000 మంది భూముల్లేని బీద కుటుంబీకులకు సుమారు 21 లక్షల బంజరుభూముల్ని పంపిణీ చేసింది. బంజరుభూముల పంపిణీలో భారతదేశ మంతటిలో ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా వున్నది. ఇదిమన రాష్ట్రానికి గర్వకారణమైన విషయం.

## ఉదారమైన రెమిషను నిబంధనలు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమంతటా ఒకే రకపు రెమిషను నిబంధనలను ప్రవేశపెట్టాలనీ, అవి ఉదారంగా వుండాలనీ నిర్ణయించడం జరిగింది. త్వరలోనే జారీ చేయబడనున్న యీ నిబంధనల ముఖ్యాంశాలు:

## కాలమాన పరిస్థితులను బట్టి శిస్తు తగ్గింపు

దీనిక్రింద మాగాణీ భూములమీద శిస్తు తగ్గింపుకూ, నీటితో సాగైన మెట్ట భూముల నీటి తీరువరేటు తగ్గింపుకూ అవకాశం కల్పింపబడింది. ఈభూములు దున్నకుండా బీడు భూములుగా వుండిపోయినా లేక రైతుల శక్తికి మించిన కారణాలవల్ల పంట చెడిపోయినా వాటికి రెమిషను సౌకర్యం వర్తిస్తుంది. రెండు పంటలుపండేవని నిర్ధారణ అయిన భూముల విషయంలో రెండు పంటలకు సంబంధించిన శిస్తు మొత్తం తగ్గింపబడుతుంది. ఈ భూముల్లో ఒకేపంట పండించబడిన సందర్భంలో ఒకేపంటకు మాగాణిశిస్తు వసూలు చేయబడుతుంది.

రైతులకు సాధ్యంకాని కారణాలవల్ల, మాగాణి భూముల్లో మెట్టపంటలు పండించడం జరిగితే మెట్టశిస్తు మాత్రమే వసూలు చేయబడుతుంది.

ఒకేపంట పండించే మాగాణిభూమిలో

మెట్టపంటను పండించడం జరిగినప్పుడు మాగాణిపంట పండడానికి వీలుగా సమయానికి నీటి సౌకర్యం కల్పించ బడితేనే మాగాణి శిస్తురేటు వసూలు చేయబడుతుంది. ఆ విధమైన నీటి సౌకర్యం లేనప్పుడు మెట్టశిస్తు మాత్రమే వసూలు చేయబడుతుంది. మెట్టపంట సేద్యపు నీటి ద్వారాపండిన సందర్భంలో, మొత్తం పొలానికిమాగాణిరేటు పూర్తిగా వసూలు చేయాలా, లేక మొత్తం పొలానికి మెట్ట రేటు వసూలు చేయడంతోపాటు సేద్యపు నీరు లభించిన ప్రాంతానికి మాత్రమే నీటి తీరువా వసూలు చేయాలా అనే విషయం యిప్పటివలె కలెక్టరుకు కాక రివెన్యూ డివిజనల్ అధికారికి వదలి వేయబడింది. అయితే, రెండవ పద్ధతి అనుసరించినప్పుడు విధించిన శిస్తు, మొత్తం పొలానికి మాగాణిరేటు విధించినప్పటికంటే ఎక్కువ కాకూడదు. పైన రెండు పేరాలలోనూ వివరించబడిన రాయతీలు రెండుపంటలు పండే భూములకు కూడా వర్తిస్తాయి.

అనిశ్చితమైన నీటిపారుదల సౌకర్యం గల పల్లపుభూముల విషయంలో రైతులు పల్లపు పంటనుగాని, మెట్టపంటలనుగాని, వారియిష్టప్రకారము పండించుకోవచ్చు, లేదా మానివేయనూ వచ్చు. పండించే పంటనుబట్టి శిస్తు వసూలుచేయడం జరుగుతుంది. ఈవిధమైన సౌకర్యం యిప్పుడు వున్నట్లు కర్నూలు, కడప, అనంతపురం జిల్లాలు, చిత్తూరు జిల్లాలో మదనపల్లి, వాయిలపాడు తాలూకాలలోని అనిశ్చితమైన నీటి సౌకర్యంపై ఆధారపడిన భూములకు మాత్రమే పరిమితమై వుంటుంది.

నీరు ఎక్కువైన కారణంచేతగాని, లేదా నీటి సౌకర్యంలేని కారణంచేతగాని పంట పూర్తిగా నాశనమై పోయిన సందర్భాలలో మెరక భూముల్లో నీటితీరువ రేటు తగ్గించ బడుతుంది. అయితే యీ పరిస్థితి రైతుచేసిన పంటల వల్లగానీ, అతని అలక్ష్యంచేతగాని సంభవించ కూడదు. ఒకే పంట పండే మాగాణి భూముల్లో వేసిన రెండు పంటలకు శిస్తు వసూలు చేయడంలో కూడా యిదే నిబంధన వర్తిస్తుంది.

పశుగ్రాసానికై పండించే పంటపై ఏ విధమైన నీటి తీరువ వసూలు చేయబడదు. అయితే ఆగ్రాసం పూర్తిగా పెరిగి గింజపట్టేలోపుగానే కోసివేయాలి. లేదా పశువులను పొలంలో మేపాలి. అంటే రైతుల యొక్క వ్యవసాయ ప్రయోజనాలకు మాత్రమే పశుగ్రాసం ఉపయోగించవడాలి.

## శిస్తు తగ్గింపు పరిమాణాలు

వరిపంటకు, నీటిపారుదల సౌకర్యం గల మెట్టపంటలకు యీ దిగువ సూచించిన పరిమాణంలో రెమిషను సౌకర్యాలు కల్పించబడ్డాయి.

*ఎ : వరిపంట*

| | |
|---|---|
| 4 మణుగులు అంతకు తక్కువపంట పండేచోట్ల | పూర్తి రెమిషను |
| 8 మణుగులు అంతకు తక్కువ పంటపండేచోట్ల | సగం రెమిషను |
| 8 మణుగులకుపైన పంటపండేచోట్ల | రెమిషను లేదు. |

*బి : నీటిపారుదల సౌకర్యంగల మెట్ట పంటలు*

| | |
|---|---|
| $\frac{1}{8}$వ వంతుగాని, అంతకు తక్కువగాని పండేచోట్ల | పూర్తి రెమిషను |
| $\frac{1}{4}$ వంతుకు తక్కువగాను $\frac{1}{8}$వ వంతుకు ఎక్కువగాను పంట పండేచోట్ల | సగం రెమిషను. |
| $\frac{1}{4}$వ వంతుకుపైగా పండేచోట్ల | రెమిషను లేదు. |

శిస్తు తగ్గింపు, శిస్తుమాఫీ వర్తింపేది పంట దెబ్బతిన్న ప్రాంతాలకే. జరిగిన నష్టాన్నిబట్టి యీ సందర్భంలో నిర్ణయాలు గైకొనబడతాయి.

మెట్టపంటలకు యీ దిగువ రేట్ల ప్రకారం రెమిషను యిచ్చే అవకాశాన్ని కల్పించబడింది.

| | |
|---|---|
| 4 అణాలు అంతకుతక్కువ పంట దిగుబడిగలచోట్ల | పూర్తి రెమిషను |
| 4 అణాలుపైన, 6 అణాలకు తక్కువపంటదిగుబడిగలచోట్ల | సగం రెమిషను |

ఈ రెమిషన్లను ప్రభుత్వం మంజూరు చేస్తుంది.

భూమి శిస్తువసూళ్ళు నిలుపు చేసే సౌకర్యంకూడా కల్పించబడింది. ఇది ఫసలీ సంవత్సరకాలానికి మించితే ప్రభుత్వ అనుమతిని పొందాల్సివుంటుంది. ఫసలీసంవత్సరంలోపున అయితే రివెన్యూ బోర్డు, కలెక్టర్లు శిస్తువసూలు నిలుపు చేస్తూ వుత్తర్వులు జారీచేయవచ్చు.

ఇప్పుడు చరిత్ర ఒక క్లిష్టదశలో నడుస్తున్నది. మనం ఆర్థికంగా వెనుకబడిన పరిస్థితినుంచి తెప్పరిల్లుకొని శీఘ్రంగా ఆర్థికాభివృద్ధి సాధించడానికి పూనుకున్నాం. ఈ అభివృద్ధియాత్ర దీర్ఘకాలం కొనసాగుతుంది. కష్టమైనదికూడా. లోగడకన్నా యీనాడు ప్రతిఒక్కరూ తమతమ బాధ్యతలను గుర్తించి, సంకుచిత, స్వార్థపరత్వాలను విస్మరించి; ఆర్థిక, సాంఘిక సమస్యలను ఎదుర్కొనే మహా సంగ్రామంలో పాలు పంచుకోవలసిన అవసరం ఎంతయినా వుంది. మన సంఘటిత శక్తిని విచ్ఛిత్తి చేసే ఏ ఆందోళన అయినా యీ క్లిష్ట పరిస్థితులలో అనాలోచనా రహితమూ, అసమయోచితము, దేశద్రోహమూ నైనది. ప్రజలంతా యీ విషయాన్ని గుర్తించ గలిగితే యీవిధమైన ఆందోళనాదారుల్లోనికి వెళ్ళడానికి నిరాకరించగలరు.



## మణిమకుటము

శ్రీ పూ. భా. సంకలిత సంపాదితము. ప్రతులకు శో భా ప్రచురణలు - (సాహిత్యోద్యమ సంస్థ) విజయనగరం అని వ్రాసికొనవలయును. వెల ఐదు రూపాయలు.

ఇది నవ్యాంధ్ర కవితా సంకలనముయొక్క ప్రథమ భాగము. క్రీ. శ. 1861 నుండి 1909 వఱకుఁగల ఒక అర్ధశతాబ్దిలో నుద యించిన 58 గురు ఆంధ్రకవుల రచనల నుండి కొన్ని కొన్ని భాగము లిందు సంకల నము చేయఁబడినవి. ఈ కవులలో ప్రాచీన కవితా మార్గము ననుసరించినవారు, నవ్య కవితా మార్గానుయాయులు కూడఁగలరు. ఇందలి కవుల వరుస వారు జన్మించిన సంవ త్సరముల క్రమము ననుసరించి నిర్ణయింపఁ బడినది. ఈ సంకలనము శ్రీ గురుజాడ వేంకట అప్పారావుగారి రచనలతో నారం భించి శ్రీ వింజమూరి శివరామారావుగారి రచనలతో ముగియుచున్నది.

సంకలన గ్రంథము లోకవాఙ్మయము నందలి యుత్తమకవుల ప్రశస్త రచనా భాగములనన్నింటి నొక్కచోఁ గూర్చి యందిచ్చును గావున పఠితల కెంతో యుప యోగకరములుగనే కాక యానందకరము లుగఁ గూడ నుండును. సంస్కృత ప్రాకృత ములలో సంకలనగ్రంథము లెన్నో కలవు. వానిలో హాలునిగాథా సప్తశతి సుప్రసిద్ధము. ఇటీవలనే శ్రీ దండేకర్‌గారు పూనా విశ్వ విద్యాలయమునుండి సంస్కృతమున సుభా షితముక్తావళి యను సంకలన గ్రంథమును బ్రకటించియున్నారు. ఆంధ్రమున మడికి సింగన సకల నీతిసమ్మతము ప్రసిద్ధమైన సంకలన గ్రంథము. శ్రీ దాసరి లక్ష్మణస్వామి గారు ప్రాచీనకవుల రచనలతోఁ గూడిన

## గ్రంథ సమీక్ష

వర్ణన రత్నాకరమను సంకలన గ్రంథమును నాలుగు భాగములుగాఁ బ్రకటించియున్నారు. 1928లో ఉపేంద్ర ప్రచురణాలయము వారా ధునిక కవుల పద్యములు కొన్ని సేకరించి చిన్న సంకలన గ్రంథము నొకదానిని బ్రచు రించిరి. తరువాత 1935 లో కాఁటోలు శ్రీ ముద్దుకృష్ణగారి వైతాళికులు ప్రచురింపఁ బడినది. అది మిక్కిలి జనరంజకమై యొప్పారుటచే ద్వితీయ ముద్రణముకూడ నందినది. పిమ్మట విజ్ఞానసమితి (తణుకు) వారు, శ్రీ వేంకట పార్వతీశ్వర కవుల షష్టిపూర్తి సందర్భమున పూజ్యులు శ్రీశివశంకరస్వామివారు. (మహోదయము) గుంటూరునందలి నవ్యసాహిత్య పరిషత్తు వారు (నవనీతము, కదంబము) 1955 లో నవ్యసాహితీ సమితివారు, దక్షిణభారత

సమీక్ష

**డాక్టర్ దివాకర్ల వేంకటావధాని**

పుస్తక సంస్థవారు, కేంద్రసాహిత్య అకాడమీ వారు సంకలన గ్రంథములను ప్రచురించి యుండిరి. ఈ మణిమకుటమీ పరంపరలో చివరిది. దీని తరువాతఁగూడ నొండురెండు చిన్న సంకలన గ్రంథములు వెలువడినవి కాని అవి యింత విశాల దృష్టితోఁ జేయఁ బడినవి కావు.

ఈ సంకలనమునఁ గ్రహింపఁ బడిన భాగములలోఁ బెక్కు సర్వాంధ్ర జనపరి చితములైనవి. పలువురు కవులు రచించిన గ్రంథములలోని భాగములేకాక వారాయా పత్రికలలోఁ బ్రచురించిన ఖండకావ్యములు కూడఁ బెక్కిందుఁ జేర్చఁబడినవి. బహు గ్రంథములు రచించినవారి రచనలు మూఁడు నాలుగు గ్రహించుట యుచితముగానున్నది. ఆంధ్రదేశమున నతివిఖ్యాతులయ్యుఁ గవు లుగా నెఱుఁగఁబడని నలుగు రైదుగు రిందు కవులుగాఁ బరిచితులగుట ముదావహము. అట్టివారిలో శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు, శ్రీ తెన్నేటి విశ్వనాధం గారు, ముఖ్యులు. శ్రీ అనంతపంతుల వేంకటేశ్వర్లు, శ్రీ విశ్వనాథ వేంకటేశ్వర్లు కాశూరి వేంకట నరసింగరావు, కృత్తివెంటి వేంకట సుబ్బారావు, సత్కవిహంస శ్రీపతి శ్రీకంఠశాస్త్రి మున్నగువారు రసవంతమైన కవిత చెప్పిన వారయ్యు దేశమున కవులుగా తగినంత ప్రసిద్ధి వడసియుండలేదు. అట్టివారి రచన లిందుఁ గానిపించుట మిక్కిలి ప్రశంసనీయమై యున్నది. పఠితలు వారి రచన లిందుఁజదివి వారి యితర రచనలకై యన్వేషించుట కవకాశమున్నది. సంక లితములైన భాగములు రసవంతములును భావపరిపూర్ణములునై యాయారచయితల ప్రతిభావిశేషమునుబట్టి చూపుచున్నవి. ఇది సంకలనకర్త రచనలు సేకరించుటలోఁ జూపిన నేర్పునకు, శ్రద్ధకుఁ దార్కాణము. ఇందు కవయిత్రులు ముగ్వురు మాత్రమే కనిపించుచున్నారు.

ఈ సంకలనము కేవలము సాహిత్య దృష్టితోనే చేయఁబడిన దనుటకు పెక్కు నిదర్శనము లున్నవి. మార్గవర్గముల ప్రాంత భేదము లిందు పాటింపఁబడక పోవుట శ్లాఘా పాత్రము. సుమారొక శతాబ్ది కాలములో వర్తిల్లినకవుల రచనలనుండి కూర్పఁబడిన యిట్టి సంకలనములలో సర్వసమగ్రత గోచరించుట అసంభవము. ఎంతమంది కవులను గ్రహించినను గ్రహింపఁ బడని వారు కొందఱు స్మృతికి తగులుచునే యుందురు. అది యుద్దేశ పూర్వకము కాదు

కావున సులభముగా సరిదిద్దుకొనుట కవకాశ మున్నది.

శ్రీ వీరేశలింగం పంతులు, వడ్డాదిసుబ్బారాయుడు, పానుగంటి, శ్రీపాద, చిలకమర్తి మున్నగువారి రచన లిందు( గన(బడుట లేదు. ఆంధ్ర వాఙ్మయమున కపారమైన సేవ కావించిన మహనీయులాధునిక యుగమున నింకను బలువురున్నారు. అందుచే నీ సంకలనమును ఇంకనుగొంచెము ముందుకాలమునుండి ఆరంభించి యుండినచో వారి రచనలుకూడ నిందు( జొచ్చి యుండెడివి. ఈ సంకలనమునకు ముందు చిన్న ప్రస్తావన యున్నది. అది కొంచెము విపులతరముగా నుండుట యవసరము. గ్రంథాంతమున రచయితల పరిచయము చేయ(బడినది. సంగ్రహరూప మయ్యునది చాల ఉపయోగకరముగా నున్నది. స్వల్పలోపములు, స్ఖాలిత్యములు ఉన్నను ముద్రణము చాల ఆకర్షకరముగా నున్నది.

క్రీ. శ. 1910 నుండి జనించిన కవుల రచనలతో( గూడిన ద్వితీయ సంపుటమచిర కాలముననే వెలువడ( గలదనిమనవిలో( దెలుప( బడినది. అదికూడ నట్లువచ్చుచో నీ సంకలనము నవ్య సాహిత్యమునకును, ఆధునిక యుగమునకును— ఆదర్శప్రాయమై కవితారసపిపాసువుల కానందసంధాయకము కా(జాలుననుటలో సందేహములేదు.

## నవ సంక్రాంతి

కర్త: శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి పిప్పర - పశ్చిమగోదావరి జిల్లా. వెల తెలియదు. ఇది హైదరాబాదు నందలి ఆంధ్రదేశ సంస్కృతీ సంవర్ధక సమితి సమర్పించిన ద్వితీయ పుష్పము.

ఇది నలువది గేయపుష్పములతో( గూర్ప(బడిన కదంబ కావ్యగుచ్ఛము. ఇందలి గేయములను దేశభక్తి సంబంధములు, ప్రకృతి వర్ణనాత్మకములు, కౌటుంబికములు, శృంగార రసాత్మకములు, దైవ వ్యక్తి గతములు అని అయిదు విధములుగా విభజింప వచ్చును. కవిగారి కాంధ్రరాష్ట్రముపైని, భారతమాతపైని, కర్షక జాతిపైనిగల భక్తి ప్రేమాభిమానములపారములైనవి. ఆంధ్రులు దేశమునందే యేప్రాంతముల( జెదరి యున్నను భేదభావములుమఱచి అన్యోన్యానురాగ పరిపూర్ణులై కలసి మెలసి యుండవలెనని కవిగారి ఆశయము. "ఒక్క పలుకున తెలుగు లొకటిగా నిలవాలి" అనునది వారి ప్రబోధము. తెనుగు దేశమును గేయమున రజాకార్ల దుండగములను దల(చి కవిగారు పొందిన యావేదన వారి యాంధ్రదేశాభిమానమును వేనోళ్ల( జాటుచున్నది. "తెలు(గు జోదుల వీరఖడ్గము ఖంగు ఖంగున మ్రోగవలె" నని వారి యాసక్తి. ఆకాంక్ష, జాతీయ జెండా, అనునవి కవిగారి జాతీయ భావమును చక్కగా వ్యక్తము చేయుచున్నవి. అంధ సామ్రాజ్యము నశించెననియు, బంధనము లన్నియు( ద్రెస్సెననియు, స్వాతంత్ర్య లక్ష్మితో ధర్మరాజ్య మవతరించి ప్రజల రక్షించుననియు వారి విశ్వాసము. మన జాతీయపతాక పతిత జాతుల నుద్ధరించెడి యాదర్శ భావమునకు ప్రతీకయని వారి నిశ్చయము. స్వప్రయత్నమనుగేయము ధ్వని గర్భితమై "గ్రీష్మతుది తొల(గెనదె మృగశిరముపొడసూపె" మున్నగు వాక్యములతో పారతంత్ర్యము పోకనుస్వాతంత్ర్యము రాకను జక్కగా సూచించుచున్నది. పేద రైతులపై కవిగారి కున్న యాదరాభిమానములు మేదురములైనవి. "భావిదినములు నీకు మంచిగ మారగలవోయీ" "రాజ్యమే నీదోయి రాజువే నీవోయి" అని వారు రైతు సోదరునికి సాంత్వన పూర్వకముగా నుత్సాహము కలిగించుచున్నారు. "రైతు పెట్టిన కంటితడి" చూచువారెవ్వరును లేరని వారు జాలితో వేదన ననుభవించుచున్నారు.

ఇందు ప్రకృతి వర్ణనాత్మకములైన గేయములు పెక్కున్నవి. ఇవన్నియు కవిగారి సూక్ష్మపరిశీలనమును, గ్రామీణ జీవిత పరిజ్ఞానమును, రమ్యభావనా పాటవమును చక్కగా సూచించుచున్నవి. ఊడ్పురోజు, సంక్రాంతి సందేశము, పున్నమరేయి, రాగ రక్తిమ, కోకిలా శరజ్జ్యోత్స్న, కోతరోజు మున్నగునవిందుకు నిదర్శనములు. "కంది గుబురుల పసిమి నీడల చలిది బువ్వల మెసవు వేళల కమ్మనగు చిరునవ్వు మ్రోతలు కంచు నిస్వనలు," "మెల్లగా గోదారిగాలియు ఊడ్చుచేడియ కొంగు దొలగగ కొంటెగా మేలంబు లాడుచు పరుగు లిడుచుండెన్" వంటి గేయములు కవిగారి సూక్ష్మపరిశీలనమును వ్యక్తము చేయుచున్నవి. "అనుము మేసి నునుపుదేరిన తరిపి గిత్తల నృత్యములను, అరటిపువ్వుల నమరు తేనెల ప్రీతిగా త్రావు కొదమతుమ్మెదలను ఆకాశపు టంచులలో వ్రేలాడే వెన్న ముద్దవంటి చందమామను విచ్చిన పూలకన్నెల మేని వెన్నెల తళతళలను" వారు సహజ సుందరముగా వర్ణించియున్నారు. ఊడ్పు, కోత, మున్నగు పొలము పనులను దృశ్యములను వివరించుపట్ల వారు చూపిన నేర్పు ప్రశంసనీయముగా నున్నది.

పైడికానుక, పుట్టినరోజు, అంపకాలు, దీపావళి దీవెనలు, శుభాశీస్సు, ఆశీస్సుమమాల మున్నగుగేయములు కౌటుంబికములు. వివాహ సమయములందు, పుట్టిన రోజు పండుగలందు, పర్వదినములందు కవిగారు తమ చెల్లెలికి చిన్నారి కోడలికి, బిడ్డలకు, మనుమరాలికి నొసంగిన హార్దమైన యాశిస్సుల వానలివి. ఈ గేయములందు వారి గుండెలలో నిండియున్న సహజమైన యనురాగము వ్యక్తమగుచున్నది. ఇందలి భావముల నైర్మల్యము వారి హృదయ నైర్మల్యమును జెప్పక జెప్పుచున్నది. "నెమ్మితో నిన్నాళ్ళు నిను బెంచి యిపుడు నొకయయ్యచేతిలో నుంచితిమమ్మ" ఇత్యాదిగా సాగిన అంపకాలలో శాకుంతలమందలి కణ్వమహర్షిభావములు ప్రతిధ్వనించుచున్నవి.

"ముసురులోనాచిన్ని, ఏనాటిబంధమో, విరహిణి, తీయని తలపులు, తెల్లవోయి

"అటుచూచాను" అనునవిశృంగార రసాత్మకములు, "ముసురు పట్టినవేళ కసవు కోయగ నేగి చిన్నితో పసరసాలు పచరించు నానాటి యానందము" "జడివాన తడిసిన తెలిరైక మరుగులో కదలొందు నడకలన్ వడివడిం జనుదెంచు పడుచు" "నొయ్యారము" "శరద్రాత్రి వెన్నెలలో కరువుదీర నాదరించి అరమరికలులేక అనుభవించిన ఆనందము" ఇందు రసవంతముగా వర్ణింపఁ బడినవి. శృంగార సంబంధి భావములను కూడ సభ్యతామర్యాద నతిక్రమింపకుండ వర్ణించుట ప్రశంసార్హమై యున్నది.

మహాత్మునిపై కవిగారికిఁగల భక్తి యపారమైనది. ఆయన వారిదృష్టిలో లోకాల శోకాలు నిర్మూలనము చేయఁజాలు దేవదూత; పతిత జాతుల నుద్ధరించుట కవతరించిన దైనము; భరతజాతికి చిహ్నము. శ్రీ ద్వారం వేంకటస్వామి నాయుడిగారి సంగీత పాండితిని వీరభద్రస్వామిగారిత్యాగ, దేశభక్తి, దీనజన వత్సలతలను కవిగారు గౌరవపూర్వకముగా వర్ణించినారు. "దైవ కార్య"మను గేయము నీతి భరితమైన కథతోఁగూడి రమ్యముగా నున్నది. "కష్టపడిన సొమ్మునుండి తుష్టి ననుభవించి మిగులునట్టి ధనము పేదకిడుట దైవకార్య" మని ముసలియవ్వ చేసిన నిర్ణయము మెచ్చఁదగినది. ఈశ్వరాజ్ఞ అను గేయము "విశ్వమెల్ల నిది యీశ్వరాజ్ఞ'' యను సత్యమును, జీవుల పతనోన్నతల స్వభావమును చక్కఁగా సూచించుచున్నది. కవిగారు భద్రాద్రి రఘురాముని భక్తులు. అందుచే భద్రాద్రిని గనులార దర్శించి, దర్శించుటతో నూరకుండక తనివితీర వర్ణించి, వర్ణించుటతో నూరకుండక కావ్యమును శ్రీరామునికే అంకితము చేసి తృప్తి నొందినారు.

ఇందలి గేయములన్నియు వివిధ గతులతో చక్కఁగా నడచుచున్నవి. భాష జాతీయమై, అచ్చమైన తెలుగు నుడికారముతోఁ గూడి, యింపు నింపుచున్నవి. భావములకు భాషకు పొత్తుకుదిరినది. తమితీరగా ద్రిప్పి నందితివంట, విధము దోచెడిన్ (14). జహ్వారున్ సర్దారు, అజాదు భాయిల' మున్నగుచోట్ల కొన్నిమాత్రలు తగ్గుటచే నడక చెడినది. కవిగారు గేయములలో వ్యావహారిక భాష విచ్చలవిడిగా వాడినారు. అయినను మందారపూలు, జాతియజెండా, సుఖములు బడయన్, నైరాశ్యత, అవసరము, దివ్య దీవెనలు మున్నగు ప్రయోగములు తొలగించుట మంచిది. మొత్తము కావ్యమున నిట్టివి పది పండ్రెండుకంటె నెక్కువలేవు.

## యక్షప్రవాసము

కర్త - కవిరత్న సున్నం వీరరాజకవి. వెల రు. 1-25 న.పై. ప్రాప్తిస్థానము సున్నంవీరరాజు అండ్ సన్సు- పప్పులవీధి, విశాఖ పట్టణము.

1948 వ సంవత్సరమున మొదట ప్రచురింపఁబడిన యీ చిన్నకావ్య మిప్పుడు కొన్ని సవరింపులతో రెండవకూర్పు నందినది. ఇందలి యితివృత్తము కాళిదాసుని మేఘసందేశమునకు సంబంధించినది. ఆ మహాకవియందు యక్షుని విరహ బాధను 'కనకవలయ భ్రంశరిక్త ప్రకోష్ఠః' మున్నగు పదములచే వ్యంగ్యముగా నెన్నో విధముల వెల్లడించియున్నాఁడు. శ్రీ వీరరాజకవిగారు దాని నిందు వాచ్యముగా వర్ణించి సర్వ జనానంద సంధాయకము గావించినారు, వలదు వివాహమని చెప్పుచున్నను కుబేరుఁడే తనకు యక్షినిచ్చి పెండ్లి గావించెననియు, నామెకుఁ గల్గిన కోపము తీర్పు సందడిలోఁ గొలువు కేగుట కొంత యాలస్య మయ్యె ననియు, నామాత్రమునకే ధనమదాంధుఁడైన కుబేరుఁడల్గి తనకు భార్యావియోగ ఫలమైన శాపమొసంగెననియు నిందలి యక్షుని దీనాలాపముల వలనఁ దెలియుచున్నది. అధికారులవసరమైనప్పుడు తమ క్రింది యుద్యోగులచే నియమిత కాలమైన పిమ్మటఁ గూడఁబని చేయించు కొందురు. కాని వా రెప్పుడైన రావలసిన కాలమునకు రాఁజాలకపోయి నచోఁ గఠినాత్ములై శిక్షింప దొరకొందురు. యక్షుఁడు కుబేరునిఁగూర్చి పల్కిన పల్కులలో నీ విషయమును విస్పష్టము కావించి కవిగారు కఠినాత్ములైన యట్టి యధికారుల నిందు గూఢముగా నుపాలంభించియున్నారు. యక్షుని దీనాలాపములలో నతనికిఁ బ్రియురాలిపైఁగల యపారమైన యనురాగమును, అతని పూర్వ ప్రస్తుత స్థితులందుఁగల తారతమ్యమును, కుబేరుఁడు శాపమిచ్చుటలోఁ జూపిన నైష్ఠుర్యమును చక్కఁగా వివరింపఁబడినవి. ఈ కావ్యమున మొదటినుండి తుదిదాఁక విప్రలంభ శృంగారము జాలువారుచున్నది. యక్షుఁడు కుబేరు నుపాలంభించు సందర్భమునఁ గవిగారు "ధనవంతుని కత్తికి రెండువైపులం గలుగునువాడి" "హేయముదాస్యవృత్తి వహించుటయెంతటివానికేనియున్" "మేటికృతఘ్న మానసులు కొరాయీధనాధీశ్వరుల్" "ఒకళ్ళ దోషమెప్పెంచెడువాఁడు సొంతదొసఁ గెంచఁడు కొంచెమదేమి చిత్రమో" మున్నగు చక్కని లోకోక్తులు, అర్థాంతరన్యాసములు కనిపించుచున్నవి. నడుమ యక్షుని తండ్రి స్వాతంత్ర్య ప్రియత్వమును, అభిమాన పూరితత్వమునుగూడ సూచింపఁబడినవి. భావములు స్పష్టముగను సహజముగను వెల్లడింపఁబడినవి. "జీవితము కోసమే నతని సేవలు" "అందములోన - నా చెలియ కామెయెసాటి" "కలపోల్కెన్ భ్రమఁజెంది" "ఓ విషకంధరా ? భవదనూన కృపన్" మున్నగు పద్యములందలి భావము లిందుకుఁ దార్కాణములు. భాష యాద్యంతము ప్రసన్నమై, జాతీయమై, రమణీయముగా నున్నది. యక్షుని కన్నీటి వెల్లువల వలెనే పద్యములన్నియు ధారాశుద్ధిగల్గి నిరర్గళముగా ప్రవహించుచున్నవి. "దూరమైతి నియకలు" పుట 19 ; నైఁపునె — పుట 11; మున్నగు నొండు రెండుచోట్లఁ దక్క వ్యాకరణ స్ఖాలిత్యము లెక్కఁదగు లేవు. కావ్యము భాషాభావముల రెండింట మధురమై మనోహరముగా నున్నది. ★

# టక్కాని అప్పులు

భారతదేశం అంతటా

**కూపర్
సిపిఆర్-5
డీసెల్ ఇంజన్**



కొనుటకు
ఇప్పుడు
లభించుచున్నవి

మీ సమీప
వ్యాపారిని కలుసుకోండి




హార్సుపవరు ౧ 7 5 శాస్త

కూపర్ ఇంజనీరింగ్ లిమిటెడ్,
చించ్‌వాడ్, జిల్లా పూనా మహారాష్ట్ర

maa-CE 3556 TEL

# వివిధ ప్రాంతాలకు వెళ్లి ప్రజలను కలుసుకోండి

ప్రాక్, పశ్చిమ, ఉత్తర, దక్షిణ—ఏ ప్రాంతానికి వెళ్లినా ఇండియాలో చూడదగిన వెన్నో ఉన్నాయి. శతాబ్దాల తరబడి గల చిహ్నలు, అసాధారణమైన ప్రకృతి శోభ—విభిన్న సంస్కృతి, ఆచార వ్యవహారాలు, తుదకు విభిన్న వస్త్రాలంకరణలతో విలసిల్లే ప్రజలు—ఏ ప్రాంతానికి ఆ ప్రాంతమే విశిష్టతతో రా.జిల్లుతున్నది. మీ విలాస యాత్రను విజ్ఞానయాత్ర చేసుకోండి.

---

*మీకు సహాయ సహకారాలు అవసరమైతే ఈ కింది కేంద్రాలలో మీకు సమీపంలోగల ఇండియా ప్రభుత్వం టూరిస్టు ఆఫీసుకు వెళ్లండి.*



ఢిల్లీ ★ బొంబాయి ★ కలకత్తా ★ మద్రాసు ★ ఆగ్రా ★ జైపూర్
వారణాసి ★ ఔరంగాబాద్ ★ కొచ్చిన్



# తపాలు బిళ్ళలను జాగ్రత్తతో అతికించండి

## టపాను త్వరిత పరచుటకు






తపాలు
తంతి
శాఖ

DA 63/474


Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Yuva Press, Public Garden Road, Hyderabad

Regd. No. H. 133




ముఖచిత్రం : 'చక్రనేమి' మాధవి వేషవినోదం

ఈ సంచికలోని కొందరు రచయితలు

శ్రీవిరించి, సూరిశెట్టి సాంబశివరావుబాబ్జీ, శ్రీమతి సరోజినీదేవి,
శ్రీమతి సుబ్బలక్ష్మి, కుమారి శ్రీదేవి, కోడూరి కౌసల్యాదేవి
మరియు తాతయ్య కథ, వడ్డాది పాపయ్యగారి వర్ణచిత్రాలతో
నెలాఖరుకు వెలువడుతుంది.

వివరాలకు:

**యువ కార్యాలయం,** పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాద్ - 1.